# మహాభారత కథలు

(ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస
మౌసల మహాప్రస్థాన స్వర్గారోహణ పర్వాలు)

## 5 వ సంపుటము

రచన

కామరాజుగడ్డ రామచంద్రరావు

వెల రూ. 24/-

పుస్తకం పేరు : మహాభారత కథ (అనుశాసనికాది 6 పర్వాలు

ప్రతులు 500

మార్చి 1991

ముద్రణ : సునీతా ఆర్ట్ ప్రింటర్స్, పంజాగుట్ట, హైదరాబాదు-500 48[illegible]



దొరకు స్థలం : కె. రామచంద్రరావు
C/o Y. సుబ్బారావు
2-2-1144/24 న్యూ నల్లకుంట, హైదరాబాదు-500 044.

# అభినందన

విశ్వచైతన్యం కలిగించి మానవాళి అభ్యుదయానికి మార్గదర్శకమైన విశిష్టగ్రంథం మహాభారతం. మహాభారతాన్ని మించిన గ్రంథం ప్రపంచ వాఙ్మయంలోనే మరొకటి లేదన్న కట్టమంచివారి ప్రశంసలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు. వేల సంవత్సరాలుగా ఈ మహాగ్రంథం భారతీయుల జీవన విధానంపై చెరగని ముద్ర వేసింది. "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"-అని మహాభారతాన్ని గురించిన ప్రశంసా వాక్యం. మహాభారతంలో ఉన్నవన్నీ, ఇతర గ్రంథాలన్నిటిలోనూ ఉన్నవని, మహాభారతంలో లేనిది మరెక్కడా లేదని ఈ సూక్తి తాత్పర్యం. ఈ విషయాన్నే "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" అనే పద్యంలో నన్నయ వివరించినారు. మహాభారతం భారతీయుల విజ్ఞాన సర్వస్వం. విశేషించి ఆంధ్రులకు అత్యంత అభిమాన పాత్రమైన గ్రంథం. సంస్కృతంలో వేదవ్యాస మహర్షి రచించిన మొట్ట మొదట కవిత్రయం వారు ఆంధ్రీకరించి తెలుగువారికి రసాయనంగా సమర్పించినారు. దీనికి ముందు ఏ భారతీయ భాషలోనూ వ్యాస భారతానికి ప్రామాణికమైన అనువాదం రాలేదు. దీని తర్వాత తెలుగులో మహాభారతకథ వివిధ ప్రక్రియల్లో రచింపబడి తెలుగు హృదయాలను అలరింపజేసినది.

ప్రస్తుతం శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావుగారు మహాభారతంలోని ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణ పర్వాల్లోని కథలను సులభశైలిలో 'మహాభారతకథలు' అన్న పేరుతో ఆంధ్రులకు అందిస్తున్నారు. మహాభారతంలోని ఇతర పర్వాల్లో ఉపాఖ్యానాలు ఎన్నో ఉన్నాయి. కాని వాటికి ఈ ఆరు పర్వాల్లోని కథలకూ భేదం ఉంది. అవి పెద్దకథలైతే ఇవి చాలా చిన్నకథలు. ఇప్పుడు

మనం చెప్పుకునే కథానికల (Short Stories) వంటివి. ఈ గ్రంథంలో అన్నదానం, అపరిగ్రహం, శౌచం, అతిథి పూజ, అంతః శత్రుజయం మొదలైన అనేక ధర్మాలకు సంబంధించిన కథలు ఉన్నాయి. ఈ ధర్మాలన్నీ ఈ నాటి మానవుడు కూడా ఆచరణలో పెట్టదగినవే. ఆదర్శమైన జీవితాన్ని గడపటానికి దోహదం చేసేవే. శ్రీ రామచంద్రరావుగారు కేవలం కథలను మాత్రమే చెప్పకుండా ఆయా కథల్లోని అంతరార్థాలనూ, నీతినీ, ధర్మాన్నీ వివరించడం ఈ గ్రంథంలోని ప్రత్యేకత. కథలతోపాటు అక్కడక్కడా ఆధ్యాత్మ విద్య, సాంఖ్యయోగం, ధర్మతత్త్వం మొదలైన గహనమైన విషయాలు కూడా సులభరీతిలో వివరింపబడ్డాయి.

-ఒక బామ్మ, ఇంట్లో రాత్రిపూట పిల్లలను కూర్చోబెట్టుకొని చెప్పిన కథలుగా వీటిని కూర్చడంలో నవ్యత కన్పిస్తుంది. రచయిత కథా కథనానికి అనువైన శైలినీ, సులభమైన భాషనూ, ఎన్నుకోవడం ఈ గ్రంథానికి అదనపు మెరుగులు.

ఆదర్శ జీవితాన్ని గడపడానికి, దోహదం చేసే 'మహాభారత కథ'లను చక్కని శైలిలో రచించి మన కందజేస్తున్న శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు గారిని అభినందిస్తూ తెలుగులోకం ఈ గ్రంథాన్ని ఆదరిస్తుందని ఆశిస్తున్నాను. వీరికి నా హృదయపూర్వక అభినందనలు.

హైదరాబాదు
2-4-1991

దేవులపల్లి రామానుజరావు
ఆంధ్రసారస్వత పరిషత్తు

# వినతి

శ్రీ మదాంధ్ర మహాభారతంలోని చివరి 6 పర్వాల్లోని కథలన్నీ 'ఏకంగా' ఇందులో చేర్చి చెప్పాను. 'మహాభారతకథలు' అనే ఈ పుస్తకం ఐదు సంపుటాలు. అందులో నాల్గు సంపుటాలు పూర్వమె అచ్చు అయినవి. ఇది చివరిది. ఈ సంపుటం రావటం ఆలస్యమయిన మాట వాస్తవమె. తెలుగు విశ్వవిద్యాలయానికి గ్రాంటుకోసం దరఖాస్తు చేసికొన్నాను. ఒక సంవత్సరం అయిపోయిం తరువాత రచిత కాపీలో కొట్టివేతలున్నాయని గ్రాంటు ఇవ్వలేదని నాకు తెల్పారు. డబ్బు సమకూర్చుకోడానికి మళ్ళీ ఆరు నెలలు పట్టింది నాకు! పాఠకులు ఈ ఆలస్యాన్ని క్షమించాల్సింది!

ఈ రచనా యజ్ఞానికి ప్రోత్సాహకులు శ్రీ బోడపాటి ఆంజనేయశర్మ గారు - నల్లకుంట. వారికి నా నమస్సులు. కీ.శే. మా పెదనాయనగారు చిన్నప్పటి బోధకులు వారి ఆత్మలకు నతులు.

వాత్సల్య పూరితులైన శ్రీమాన్ డా॥ దేవులపల్లి రామానుజరావుగారు (ఆంధ్రసారస్వత పరిషత్) తమ అభినందనల నందజేసినారు. వారికి నా నమస్సులు.

సునీతా ఆర్ట్సు ప్రింటర్సు ప్రొప్రయిటరయిన శ్రీ ఎస్. శేషగిరిరావుగారు శ్రద్ధా ఆదరాలతో శుద్ధముగా ఈ సంపుటం కూడ అచ్చువేసినారు. వారికి నా కృతజ్ఞతలు.

కాగితపు ధర అచ్చు ఖర్చులూ చాల పెరిగిన కారణాన ఈ సంపుటం ధర ఇంతకంటె తగ్గించలేకపోయినాను. పాఠకులు మన్నింప కోర్తాను.

94 సైదాబాదుకాలనీ
హైదరాబాదు-500659
మార్చి 1991

కామరాజుగడ్డ రామచంద్రరావు

# మహాభారత కథలు

## ( 5వ సంపుటం )

## విషయసూచిక

# మహాభారత కథలు

## ఆనుశాసనిక పర్వం- ప్రథమాశ్వాసము

## 1. కథోపక్రమణం

బాబాయి రోజూ రాత్రిపూట చెప్పే కథలు కేవలం కథలే కాదన్న సంగతి ఆయనే చెప్తుండేవాడు. మరింకా యేమిటి అనబుద్ధయేది! కాని అడుగటానికి మళ్ళీ ఇష్టముండేదికాదు. "ఆలోచిస్తే తెలుస్తుందనీ - ఆలోచించి తెలిసికొనే విషయాలు ఎవరో చెప్పటంవల్ల తగినంతగా అర్థంకావనీ అనేవాడు బాబాయి. అమ్మమ్మో-"ఇదేమిట్రా ఎన్ని ధర్మాలు చెప్పారినాన్నట్నుంచీ ఒక్క కథలేనా? బుర్రలేదా ఏమిటి" అంటుంది. అందే చెప్పేవి, ధర్మాలైనా కథలు కావని అర్థమేమో? అందుకని అడుగబుద్ధయేదికాదు.

ఆవేళ కథ చెప్పమని కూర్చోంగానే, బాబాయి అన్నాడు-"కథవేరుగా ధర్మం వేరుగా తెలియ చెప్పటం ఒక రకమైన ప్రవచనం! కథ పైకి చెప్తూ అంతరార్థం ఇమిడ్చి చెప్పేయటం ఇంకొకటి. వ్యాసుని రచనలో ఈ రెండో రకమైన మెళకువ ఉంది. ఆయన పేర్లు చెప్తూనే అంతరార్థాన్ని స్ఫురింప జేస్తాడు!-మోక్ష సాధనా మార్గాన్ని స్ఫురింపజేస్తాడు; వైశంపాయనుడూ శ్రౌతి, భీష్ముడూ వీళ్ళంతా "పూర్వం ఫలానివారు ఈ యీ విధంగా చెప్పారు. అది నేచెప్తున్నాను" అని చెప్తారు. ఫలానిది ధర్మం అంటారు ఆ కథలో. ఇంకొకరు వింటారు. అందులో చెప్పినవి ఆయా పరిస్థితుల్లో మనమూ అనుసరించవలసి నట్టి ధర్మాలేనని తెలిసికొనేవారికి అవి సత్ ఫలితాన్నిస్తాయి. లేనివారికి కాల క్షేపం మాత్రం అవుతుంటుంది.

అలా ఎందుకు చెప్పాలి తిన్నగా చెప్పరాదా అని శంక కలుగుతుంటుంది. ధర్మం అనేది ఎవరికివారు ఇదినేను చెప్తున్నాను-తెలిసికో అని చెప్పటం సరి కాదు. ఫలాని పరిస్థితులు కలిగినయి. అప్పుడు ఫలానిది ధర్మంగా పాటింప బడింది-లేదా ఎవరో అది ధర్మమని చెప్పారు అని చెప్పాలి. ధర్మం మాటల్లో చెప్తే ఆ మాటలు చెప్పే ధర్మం సర్వత్ర ధర్మం కాకపోవచ్చు. మాటలు అందుకే పరిస్థితుల్ని చెప్పి ఆ పరిస్థితులకు ధర్మం వర్తింపజేసే విధానాన్ని చెప్పటం!

ఆనుశాసనికపర్వ రచనలో కథలో ధర్మం స్పష్టంగా ఫలానగా ఉన్న దని తెలియజేయగల విధం కన్పడుతుంది. బాబాయి చెప్తున్నాడు కథల్ని!

## 2. కర్మ సిద్ధాంతం

ధర్మరాజు భీష్మునితో అంటున్నాడు- "ఎన్నో ధర్మాలు నీవు చెప్పావు- కాని బంధువులందర్నీ చంపినందుకు నాకు శాంతిలేకుండా పోతోంది. దుర్యోధనుడే ఈ వధకంతకూ కారణమైనాడు తాతా!" అని.

భీష్ముడు-"అయ్యో నాయనా! మనిషి దేనికీ కర్తకాడు. కర్మే కారణమై ఫలితాల్ని కలిగిస్తూ ఉంటుంది. కార్య కారణ సంబంధ సూత్రం మరచిపోవద్దు. ఒక కథ చెప్తాను విను.

"ఒక బ్రాహ్మణ పిల్లవాడు పాముకరిచి చచ్చిపోయినాడు. తల్లి- పాపం- ఏడుస్తోంది. అంతలో ఒక కిరాతుడు ఆ పామును వెదకి పట్టితెచ్చి "ఇదుగో నమ్మా ఆ పాము-దీన్ని నీ కసి తీరేట్లు కొట్టి చంపు" అన్నాడు. ఆమె, "దాన్ని చంపితె నాకేమిటి ప్రయోజనం నాకొడుకు బ్రతికి వస్తాడా చెప్పు" అంటుంది. అప్పుడాకిరాతుడు "ఐతే నేనే చంపేస్తా నీ పామును" అంటాడు.

వెంటనే ఆ పాము అంటుంది-"నే నీ బాలుడిమీద పగబట్టలేదు. రోషావేశాలతో కాటువేయలేదు. కాకతాళీయంగా కాటువేశాను-స్వభావంవల్ల. ఆకాటు నాధారంచేసికొని మృత్యువు వాణ్ణి చంపింది." అన్నది కిరాతుడు వెంటనే ఇంకేం నీకాటువల్లనె మృత్యువు వీణ్ణి చంపిందికదా!" అంటాడు. అందుకు పాము, "కాదు నాకాటు కాకపోతె ఇంకో చీమకుట్టడంవల్ల-చీకాకు కొట్టడంవల్ల అతడ్ని మృత్యువు చంపేసి ఉండేది. నా ప్రసక్తేమిటి! నాకు ఏ జీవినైనా చంపాలనే మనఃస్థితే లేదు. ప్రాణంలేని నృక్కువాలకు యజ్ఞపుణ్యం ఎలా రావటల్లేదో అలాగే నా కర్మకు ఏలాటి పాపంగాని రాకూడదు. నీవు నన్ను ఇప్పుడు చంపితె నీకు పాపం కలుగటం ఖాయం. ఈ పిల్లవాడు చావడంలో తప్పు ఏమైన ఉంటె అది మృత్యువుది" అంటుంది.

ఈ ధర్మ విషయమైన ఈ చర్చకు, మృత్యువు వెంటనె పరిగెత్తుకు వచ్చి, అంటుంది-"నాకు వ్యక్తిత్వమేలేదు నేను కాలుడికి దాసుణ్ణి. నా కర్త

వ్యం నాకు తప్పదుకనక దాన్నినేనుచేశాను. 'పాపం' ఏమొచ్చినా అది కాలునిదె కాని నాకెందుకు రావాలి? అంటుంది. వెంటనె కాలుడు ప్రత్యక్షమై "నేనూ నా కర్తవ్యం చేశాను, ఈ పిల్లవాడి కర్మఫలం ఇప్పటి ఈ స్థితి! కర్మఫలం ప్రకారం నేను జరుపుతూ ఉంటాను- నిన్నటి పూవే ఇవాళ కాయ అయినట్లు నిన్నటి కారణమె ఇవాళ కార్యమవుతూ ఉంటుంది. అలా కావడానికి నేను, కేవలం అనుసంధాన కర్తను మాత్రమె. సక్తతలేకుండా ఈ పామూ ఈ మృత్యువూ నేనూకూడ చేస్తున్న యీ పనులకు పాపపుణ్యాలు కలుగవు. ఈ బ్రాహ్మణి దుఃఖానికి కారణం ఆమె పూర్వజన్మ కర్మఫలం మాత్రమె. ఆ కర్మకు ఈ ఫలం రావటమె కర్మసిద్ధాంతం"-అని వెళ్ళిపోయినాడు.

భీష్ముడు ఈ కథచెప్పి, అన్నిటికీ నీవుకారణమనీ దుర్యోధనుడు కారణమనీ అనుకోవద్దు. వీరంతా చావడం వారివారి కర్మఫలమె. నీవు సక్తత లేకుండా నియత కర్మలు చేస్తుంటే పుణ్య పాపాలువచ్చి నిన్నంటుకొనవు. కాని సక్తితో దుర్యోధనునిలా-పనులుచేస్తే పుణ్యపాపాలు మానవుడ్ని అంటుకొంటాయి. అతడ స్థూల శరీరంతోపాటు చావక తిరిగి క్రొత్త స్థూలశరీరాన్ని పొందినప్పుడు ఆ పాపపుణ్య ఫలాలను ఇస్తూ ఉంటవి. కార్య కారణ సిద్ధాంతమె కర్మసిద్ధాంతం. అసక్తతతో మెలుగుతూ భగవంతుడ్ని ధ్యానించి తరించే మార్గం కర్మయోగ మార్గం అని తెలిసికొను.

'ఆ పని చేశావు' - 'ఈ శిక్ష ననుభవించు' అనేది మన శాసనాల్లో ఉంది. శిక్షాస్మృతి ఈ సిద్ధాంతం మీదనే చేశారు. తరువాత జన్మల్లో పాపానుభవాన్ని తగ్గించడానికి శిక్షాస్మృతి ఉపయోగిస్తుందనేది గమనీయం. అందుకె శాసనాన్ని ఆధ్యాత్మిక దృష్ట్యా కూడ పాటించి తీరాలి.

## 3. మృత్యువును జయించడం

అనక్త కర్మచేస్తే పాప పుణ్య ఫలాలు కలుగవు అన్నారుకదా గృహస్థుగా ఉంటూ అనక్త కర్మ చేయుగలిగితే మృత్యువును జయించగలుగుతారా అని ధర్మరాజు భీష్ముని అడుగుతాడు.

భీష్ముడు "తప్పకుండా"నని చెప్పి,- అందుకు ఒక ఇతిహాసం చెప్తాడు—అగ్నిదేవునికి సుదర్శన అనే ఆమెకూ సుదర్శనుడనేవాడు పుట్టి రాజై

తాను గృహస్థధర్మం నడుపుతూనే మృత్యువును జయిస్తానని ప్రతిన పట్టాడు. గృహస్థ ధర్మం నడుపుతాననేది బాగానే ఉందిగాక ప్రతినపట్టటమనేది తత్త్వరీత్యా గర్హించతగింది. భగవంతు డనుకుంటాడు— సర్వమూ నేను చేయిస్తూ చేస్తూఉంటే ఇతని ప్రతినేమిటి మధ్య! అని. అందుకే ధర్మదేవత అలాంటివాళ్ళను పరీక్షలకు గురిచేశాడు.

గృహస్థు, అతిథులను పూజించటమనే నియమం పాటించాలి. సుదర్శనుడు అలా పూజించి తన సంపదనంతా దానం చేసి యమనియమాది నిష్ఠలతో ఒక పట్టణంలో భార్యతోసహా నివసిస్తూ ఉంటున్నాడు. భార్యపేరు ఓఘవతి. ఆమెకు సుదర్శనుడు అతిథి ధర్మం బోధించి, అతిథి పూజను తానింటలేని సమయాన ఆమె చేయవలెనని – ఒకవేళ అతిథి దేవుడు అమె శరీరాన్ని కోరినా ఆమె దాని నివ్వడానికి వెనుకాడరాదని చెప్పి అలా చేయుమని అభ్యర్థించాడు. ఆమె అంగీకరించింది.

ధర్మదేవత ఈ ప్రతిన సంగతి తెలిసికొన్నాడు. ఒక అతిథిగా సుదర్శనుడు లేని సమయంలో వాని ఇంటికి వచ్చి తలుపు తట్టాడు. ఓఘవతి అతిథి పూజ చేసి ఆదరించుతుంది. కాని ఆ అతిథి తాను ఆమెయందు కామాతురుడైనట్లు చెప్పి తనను తృప్తి పరుపుమంటాడు. ఆమె అనేక రకాలయినవీ, సుఖదమైనవీ ఇతరవస్తువు లిస్తానంటుంది. అతడు ఒప్పుకోడు. ఆమె తన భర్త ఆజ్ఞను శిరసావహించి అతన్ని తృప్తిపరచడానికిగాను మాటునకు తీసుకొని వెళ్తుంది.

ఆ సమయాన సుదర్శనుడు ఎక్కడనుంచో వచ్చి వాకిట్లో నిల్చి ఓఘవతిని పిలుస్తూ ఉంటాడు. అతిథి ఆమెను సమాధానము చెప్పనీయక, తానే బిగ్గరగా సుదర్శనునితో అంటాడు. "నీ భార్య అతిథినైన నాకు కామ తృప్తి నీయడానికై ఇక్కడ ఉన్నది. అందుచేత నీవు అక్కడనే ఇంకా కొంతసేపుండాల్సింది" అంటాడు.

వెంటనే సుదర్శనుడు. "ఓ అతిథి దేవతా! నమస్కారము. నేను నీ ఆగమనానికెంతో సంతోషపడుతున్నాను. అతిథులను హితపూజనంచేసిన గృహాలు విమలవిభవములంటారు. నేనూ అదోవనే చరిస్తున్నాను కర్తవ్యంగా! నేను తొందర పడను" అంటాడు.

ఈ పరీక్ష సుదర్శనుడికే! ఓఘవతికి కాదు. ఆమె మనఃస్థితి గొప్పది కనక ఆమెకూ నదిగాపారటం స్వర్గానికి భర్తతో వెళ్ళటం కలుగబోతోంది.

ధర్మదేవత వెంటనే ప్రత్యక్షమై "సుదర్శనా! నీవు నిజంగా మృత్యువును జయించావు. కామరోషాది వికారాలు వదలి, స్వచ్ఛమాత్రుడై చరిస్తున్న నిన్ను మృత్యువు ఏమీ చేయలేదుగాక. నీవు ఈ శరీరంతోనే ఊర్ధ్వలోకానికి వెళ్ళాల్సింది. ఓఘవతితో సగభాగం నదీరూపంలో ఇక్కడనే ఉన్నదై మిగిలిన సగ శరీరంతో నిన్ననుసరిస్తుంది" అని చెప్పి వెళ్ళిపోతాడు. సుదర్శనుడు అలాగే ఊర్ధ్వలోకాలకు వెళ్ళాడు.

భీష్ముడీ కథచెప్పి ఈ కథలోని అభిప్రాయం గ్రహించాల్సింది. కామ క్రోధాదుల ఉద్ధృతం పూర్తిగ తగ్గించి మనవలసింది. సక్తత వదలి మనాల్సింది అంటాడు.

ఈ కథలు విని పిచ్చి కథలనే వారుంటారు. మీరు అలా అనద్దు అన్నాడు బాబాయి. ఆలోచించండి. 'మంచి పనులు చేస్తే మంచి ఫలితాలే వస్తాయనీ కార్య కారణ సిద్ధాంతం చెప్తుంది. ఏది మంచి-ఏదిచెడు? అతిథి కోరినదాన్ని దానం చేయడం మంచె. ఓఘవతి పాతివ్రత్యం కాపాడుకోవట మనేది కూడ మంచె. ఈ రెండూ ఒకేసారి పరిపూర్తి అయ్యే అవకాశం మాత్రం లేదని ఆమెకు తెలిసింది. సందేహం కలిగె ఉంటుంది - 'ఏ మంచికి ప్రాధాన్య మివ్వాలి' అని. ఒకటి తన బాధ్యత. రెండవది తన భర్తకయిన బాధ్యత.

నా బాధ్యత నాకు గొప్ప అనుకోవటం ఇప్పటి వారికి సహజం. అది స్వార్థం! ఓఘవతి భర్త బాధ్యతనే నెరవేర్చజేసింది. తన బాధ్యతను త్యాగం చేసి రెండవదాన్ని నెరవేర్చటం ఇక్కడి విశేష విషయం. అందుకె ఆమెకూ ఊర్ధ్వలోకాలు ప్రాప్తించినై.

సుదర్శనుడు ధర్మవేత్తా, గృహస్థున్నూ! వానప్రస్థం పరివ్రాజకం- అయిన తరువాత ముక్తినందటం ఒకమార్గం. సర్వధర్మాలూ ఎరిగినవాడు కావడంచేత గృహస్థ ధర్మంలో కూడ మృత్యువును జయిస్తానని ప్రతిన పట్టాడు.

ఐతే, మృత్యువు వ్యక్తికి కాదు- శరీరానికి! సుదర్శనుడు శరీరానికె మృత్యువు రాకుండా సాధించాడు, పూర్వజన్మల వాసనలు లేపు-నశించినయి. క్రొత్త కోరికలులేవు. ఇక ఈ శరీరం వదలి మరొకదాన్ని పొందాలనే అవసరమే అతడికి లేదుగనుక శరీరం చావాల్సిన పనిలేదు. అందుకే చావు అతడికి రాదనటం.

క్రొత్త శరీరం అక్కర్లేదు గనుక పాత శరీరం వదలాల్సిన అవసరం లేకపోవటం ఇక్కడ ముఖ్యం. సుదర్శనుడు కర్మయోగి. అంటే కర్తవ్య మేదో ఆ పనులను మాత్రమే చేస్తాడు. కర్తవ్యం రెండు విధాలు (1) ఆత్మోన్నతి (2) సమాజోన్నతి నందటం. గృహస్థధర్మం సమాజోన్నతికి చెందిన కర్తవ్యం! ఆ చేయటంలో కొంచెమైనా స్వార్థం లేకపోవటం అతిడి నిష్ఠకు తార్కాణం. అందుకె మృత్యువును జయించాడు. ఈ విషయాలు బుద్ధితో తర్కించి విచారణ చేస్తేనేకాని తెలియవు.

కామక్రోధాదుల ఉద్ధృతం తగ్గించి బ్రతుకు నెవరు నడిపితె అతడు మృత్యువును జయించినవాడవుతాడని బోధ.

## 4. జాతి మార్పు

ధర్మరాజు భీష్ముని ప్రశ్నిస్తాడు - ఇతర జాతుల్లో జన్మించినవాడు బ్రాహ్మణుడు కావటానికి వీలున్నదా? అని.

గుణాల ఆధారంగా బ్రాహ్మణుడు కాగలడా అని కాదు ఇక్కడ అడిగిన ప్రశ్న-అది గమనీయం. (గుణాలు మార్చుకొంటే వర్ణమార్పు అవుతుందిగాక) భీష్ముడు ఇంద్రమతంగ సంవాదం చెప్తాడు.

మతంగుడు ఒక బ్రాహ్మణుని కుమారుడుగా చలామణీ అవుతున్నవాడు, ఎక్కడికో వెళ్తూ నిష్కారణంగా ఒక గాడిదపిల్లను కొట్టుతాడు. అది వెళ్ళి తల్లికి చెప్తుంది ఫలానివాడు కొట్టాడని. ఆ తల్లి "వాడు చండాలుడు. ప్రచండ స్వభావుడు కాకఏమవుతాడు" అంటుంది. మతంగుడికి జంతుభాష తెలుసు. వెంటనే వెళ్ళి ఆ తల్లిగాడిదనడుగుతాడు తనను చండాలుడని ఎందుకన్నదీ అని.

ఆ గాడిద, వాని తల్లికి ఒక మంగలిద్వారా అతడు పుట్టాడంటుంది. కులాల విభాగంలో ప్రతిలోమ వివాహం వల్ల పుట్టినవాళ్లనూ చండాలురని పిలుస్తారు. తల్లి బ్రాహ్మణ కులానికీ తండ్రి మంగలి కులానికీ చెందిఉన్నారు కనుక అతడ్ని చండాలకులజుడంటారు. ఇది మను ధర్మశాస్త్రం. మతంగుడు వెంటనే ఇంటికివెళ్ళి తండ్రికి సంగతి చెప్పి తాను బ్రాహ్మణత్వం సంపాదిస్తానని వెళ్ళి తపను చేయడం ఆరంభిస్తాడు. తపను అంటే నియమాల నభ్యసించడం. దాని వల్ల తనకు సల్లక్షణాలు కలుగుతవని ఆశయం.

కొంతకాలమయింది. ఇంద్రుడు వచ్చి వరమడుగుమని బ్రాహ్మణత్వం తప్ప ఇంకేమయినా అడుగుమంటాడు. మతంగుడు తిరస్కరిస్తాడు. మతంగుడింకా నూరేండ్లు ఒంటి కాలిపై నిలబడి తపను చేస్తాడు. మళ్ళీ ఇంద్రుడు వచ్చి కొన్ని లక్షల రెట్లు తపస్సు చేస్తేగాని బ్రాహ్మణుడవయే అవకాశం లేదంటాడు. చివరకు ఎప్పటికో మతంగుడు తూలిపడిపోతే ఇంద్రుడతడ్ని దేవతగా చేసి చండదేవుడని పిలుస్తాడు. అందుచేత ఇతరుడు బ్రాహ్మణుడు కావడం అసంభవం అని చెప్తాడు భీష్ముడు.

ఫలానవారికి పుట్టినవారే బ్రాహ్మణుల కులానికి చెందిన వారన్నపుడు ఇతరులెవరికో పుట్టినవారు బ్రాహ్మణులనబడే అవకాశ మెక్కడున్నది? ఒక నిర్వచనం ఉంటే దానినే అధిగమించి అదే ఇదని అనడం ఎలా? కులాలు శాసన ప్రకారం చెప్పబడేవిగాని గుణరీత్యా చెప్పబడ్డవి కాదుగదా! అందుకె ఇంద్రుడీచండుడికి దేవత్వమైనా ఇవ్వకలిగాడు గాని బ్రాహ్మణుడేసనిపించ లేకపోయినాడు. ఇదిసాధారణమైన శాసన ధర్మం.

ఈ కథలోని చిత్రమేమంటే తపను కొన్ని లక్షలరెట్లు చేస్తే బ్రాహ్మణుడు కాగలవనటం. అనగా బ్రహ్మ పదార్థ తత్వజ్ఞానివి కాగలవని చెప్పడమా? కాని అది ప్రసక్తి విషయం కాదే! ఇంద్రుడన్నమాట కర్థమేమని? తపను వల్ల పొందిన పుణ్యం వల్ల ప్రజలు నిన్నలా ఆదరింపగలరనడమై య్యుంటుంది.

ఈ చిక్కు విడివడని కారణాన ధర్మరాజు భీష్ముని తిరిగి ప్రశ్నిస్తాడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి ఎలా అయినాడు అని.

భీష్ముడు - విశ్వామిత్రుడు బ్రహ్మ పదార్థ తత్త్వజ్ఞాని అయిం తరువాత ఆ కారణాన ఆయన్ను బ్రహ్మర్షిగా గుర్తించారు. కులరీత్యా ఆయన క్షత్రియుడై బ్రహ్మజ్ఞాని అయిన వ్యాసునీ శ్రౌతినీ అలాగే బ్రాహ్మణులుగా మన్నించడ మయింది.

ధర్మరాజు: ఐతే వీతహవ్యుడు బ్రాహ్మణుడైనాడంటారు ఎలా?

భీష్ముడు : వీతహవ్యుడు హైహయరాజ వంశజుడు. అతడికి నూర్గురు కుమారులు. వాళ్ళు కాశీరాజు నోడించివచ్చారు. కాశీరాజు కుమారుడు తాను గద్దెనెక్కి హైహయరాజుల్తో యుద్ధం చేస్తుంటాడు. అతడికి భరద్వాజ ముని అనుగ్రహంవల్ల ప్రతర్థుడనె కుమారుడుకలుగుతాడు. ఆ కుమారుడు పెద్దవాడై ధనుర్వేదం నేర్చి యుద్ధం చేసి, వీతహవ్యుడి నూర్గురు కొడుకుల్నీ చంపేసి వీతహవ్యుణ్ని పదవీచ్యుతుణ్ణి చేస్తాడు. వీతహవ్యుడు పారిపోతుంటే వెంటపడు తాడు. చివరకు వీతహవ్యుడు భృగువు ఆశ్రమంలోకి దూరి ఆయన్ను ఆశ్రయించి శరణువేడుతాడు.

ప్రతర్థనుడు వచ్చి అతడికోసం భృగువునడిగినప్పుడు, అతడు తన శిష్యుల్లో కలిసి వున్నట్లు చెప్పక, భృగువు నా శిష్యులందరూ బ్రాహ్మణులేగాని ఇతర్లెవరూ లేరంటాడు. అప్పటికె మరి వీతహవ్యుడు బ్రహ్మతత్త్వ జ్ఞాని అయినా డేమో తెలీదు.

ప్రతర్ధనుడు ఆలోచించాడు. వీతహవ్యుడు వీళ్ళల్లో వుంటే అతడు తన జాతినే పోగొట్టుకొన్న నీచుడైపోయినాడు. లేదా బ్రహ్మపదార్థతత్త్వజ్ఞాని అయిఉంటాడు. ఇక రాజ్యానికి రాడు. బ్రాహ్మణ సమాజమే అతణ్ని బ్రాహ్మణుడుగా అంగీకరిస్తే అతణ్ని చంపాల్సిన పని నాకులేదంటాడు.

కనుక బ్రహ్మ పదార్థతత్త్వజ్ఞాని ఏ కులంలో పుట్టినా బ్రాహ్మణుడనే ఆధ్యాత్మిక తత్త్వం చెప్తుంది. అలాటి తత్త్వజ్ఞాని కానివాడు బ్రాహ్మణుని కులంలో సక్రమంగా పుట్టితేతప్ప బ్రాహ్మణుడు కాజాలడు. ఎందుకనంటే బ్రాహ్మణునికి సక్రమంగా పుట్టిన వానికేగాని - ఈ వంశ హక్కు సంక్రమించదు. మతంగుడు బ్రాహ్మణ స్త్రీకి పుట్టినా బ్రాహ్మణుడని ఒప్పుకొనడం కలుగలేదు - కనుక బ్రాహ్మణుడు కానివాణ్ణి ప్రజలు బ్రాహ్మణుడుగా

మన్నించితె అతడ్ని బ్రాహ్మణుడుగా పరిగణించటంకద్దు! ఇది మొదటి సూత్రానికి కేవలం వినాయింపు (Proviso)

ధర్మరాజు : స్వామీ ! దైవానుగ్రహమా? పురుషప్రయత్నమా? ఏది, ప్రభావయుతమైన సాధనము?

భీష్ముడు: దైవానుగ్రహమనేది సాధనమనటానికి వీల్లేదు. సాధన చేయటమనేది మనుష్యుని పరంగా చెప్పవలసినది. ఈ అనుగ్రహం భగవంతుడీయవలసిందేగాని మనుష్యుడు స్వేచ్ఛగా లాక్కునేది కాదు. దైవభక్తినైతే సాధనమనవచ్చు. దైవభక్తిని పురుష ప్రయత్నంలో భాగంగా చేయటంవల్ల దైవానుగ్రహం పొందే వీలుంది. కనుక దైవభక్తిని పురుష ప్రయత్నంలో భాగంగాచేసి దేవునిపై భారంవేసి పురుష ప్రయత్నం చేయడమె ప్రభావయుతమైన సాధనం-దైవాన్ని పూర్తిగా వదలివేసి ప్రయత్నం చేస్తే-దైవబలాన్ని త్రోసేసినవాళ్ళె అవుతారు. అప్పుడు ప్రయత్నం పూర్తిగా చేశామనడానికే అవకాశంలేదు. దైవాన్ని ప్రార్థించటం ప్రయత్నంలో భాగమై ఉండాలిగాని నా ప్రయత్నబలం గొప్పదా-దైవం గొప్పదా-అనడం సరికాదు.

ధర్మరాజు : సత్కర్మలు చేస్తాము. వాటివల్ల ఫలం ఏమిటి కలుగుతుంది చెప్పండి.

భీష్ముడు : ప్రయత్నంచేసి సత్కర్మచేస్తే ఫలం భగవంతుడిస్తాడా ఈయడా? ఏం ఫలం? అంటావు. శాస్త్రయుక్తమైన ఫలం వచ్చితీరుతుంది– చెప్పినట్లుచేస్తే. యజ్ఞంచేసి అన్నం పెట్టిన ఫలం అంతాయింతాకాదు. సమారాధనవల్ల పౌరుష శ్రేష్ఠత కలుగుతుంది. దానంఇస్తే ఇచ్చిన వస్తువునుబట్టి ఫలం. మౌనంవల్ల పరిజ్ఞానశక్తి. అతుల తపం వల్ల భోగం. అహింసవల్ల రూపబల ప్రకాశ ఐశ్వర్యసిద్ధి కలుగుతుంది. బ్రహ్మచర్యానికి ఫలం-ఆయుష్షు. ఉపవాసంవల్ల చిత్తశుద్ధి. శ్రుతపరునకు సౌఖ్యం. అర్థప్రతిబోధకునకు సుగతి. సత్యవ్రతానికి ముక్తి-ఇలా ఫలాలు కలుగతవి.

చెట్లకు ఆకులూ పూవ్వులూ చిగుళ్లూ పళ్లూ ఎలా కలుగుతాయో అలాగే కర్మకు ఫలం కలుగుతూ ఉంటుందనేది నిజమైనమాట. అది ఎంత సహజమో

ఇదీ అంతేనని అర్థం. ఇది భౌతిక ఫలం! ఇక మానసిక ఫలాలు – పుణ్య పాపాలు! ఇవి కర్త మనఃస్థితినిబట్టి ఆసక్తినిబట్టి ఉంటాయి. తృష్ణా ఆసక్తికల వారికే పుణ్యపాపాలు కలుగుతయి. వితృష్ణులకివిలేవు. నిర్లేపులు అయిన కారణం చేత వారి కీపాపపుణ్యాలు అంటవు.

ఇదివిని పాండవులు సంతోషించారు.

ధర్మరాజు : ఆశ్రితులు ఎవరినాశ్రయించుకొని ఉన్నారో వారిపట్ల ఎలా ఉండాలి?

ధర్మరాజు ఈ ప్రశ్నను తనకోసం అడుగలేదనిపిస్తుంది. ఎందుకంటే తాను మహారాజై ఇతరులకు ఆశ్రయుడు అయినాడుగాని తాను ఆశ్రితుడైనవాడు కాడుగదా.

భీష్ముడు ఒక చిలుక కథను చెప్తాడు. "ఒక చెట్టుమీద ఒక చిలుక ఉంటూ ఉండేది. ఒక కిరాతుని బాణం ఆ చెట్టుకు తగిలింది. ఆ బాణానికి విష ముండటంచేత ఆ చెట్టు నిలువునా ఎండిపోతుంది. ఐతే ఆ చిలుకమాత్రం ఆ చెట్టు ఆశ్రయాన్ని వదలలేదు. చుట్టూ ఎన్నో ఫలపుష్పభరితమైన చెట్లున్నా వాటిని ఆ చిలుక ఆశ్రయించలేదు. ఈ చిత్రంచూచి ఇంద్రుడు మారువేషంతో వచ్చి ఆ చిలుకను ప్రశ్నిస్తాడు. ఈ మాడిపోయిన చెట్టుమీదెందుకు? ఇంకో చెట్టుకు పోరాదా అంటాడు. అప్పుడు చిలుక అంటుంది! "పండినరోజుల్లో ఆశ్రయం పుచ్చుకొని ఎండినరోజుల్లో వదలిపోవటం కృతఘ్నతకాదా ఇంద్ర దేవా" అంటుంది. ఇంద్రుని వేషరహస్యం గ్రహించిన చిలుకనుచూచి అతడు ఆశ్చర్యపడి, "నీకు ఏమైన వరం కావాలంటె అడుగు ఇస్తా" నంటాడు. చిలుక "ఈ చెట్టుకు సమృద్ధియైన జీవం ప్రసాదించుమంటుంది. అతడలా చేస్తాడు– ఆశ్రితులు అలాటి కృతజ్ఞులై ఉండాలి—

ధర్మరాజు : ఆశ్రయమిచ్చేరాజు ఎవరిననుసరించినవాడై ఎవరిని జాగరూకుడై చూచుకోవాలి?–అంటాడు.

భీష్ముడు : తపసు–స్వాధ్యాయం–చేస్తూ ఇహ పరలోకాలు నీకు వశం చేయగలిగే బ్రాహ్మణులను అనగా బ్రహ్మపదార్థ తత్త్వజ్ఞానులను – మన్నించాలి. వారు సంతోషిస్తె సుఖాలూ, అలిగితె కష్టాలూ నీకు కలుగుతాయి.

అతడ్ని తండ్రిగా గురువుగా మన్నించాలి. ఋగ్వేదం "బ్రాహ్మణజాతికి పరిభవం కలిగించేటట్లయితె పూర్వపుణ్యం నశిస్తుంది-యోగం పట్టటం మానుతుంది" అంటున్నది. "జపహోమాదుల్ని చేయటంకంటెకూడ బ్రాహ్మణునిచేత అవి చేయిస్తె గొప్ప ఫలదమవుతవి" అన్నది యజుర్వేదం. సామవేదం "ఒక మాసంపాటు బ్రాహ్మణుని పూజిస్తే పాపనాశనం అవుతుంది" అంటున్నది. అధర్వణ వేదం బ్రాహ్మణవర్ణులనుచూచి ఆదరింపకపోతె అంతకంటె కీడు మరి లేదు." అన్నది. ఇలానే మునులూ చెప్పారు. అంతేకాదు-పరమమైన ధర్మం చెపుతాను విను. "విష్ణు నెరుగుటధికవిమల బోధము-యజ్ఞమూర్తి యజ్ఞకర్తృమూర్తి యజ్ఞకలనమూర్తి యజ్ఞఫలమూర్తి విష్ణుడతండు కృష్ణుడమలచరిత" అన్నాడు. బ్రాహ్మణులు అనిచెప్పి పరమమైన మతం విష్ణునెఱుగడమని చెప్పటంలో సంగతత్త్వం గ్రహించాలి! పరమాత్మనెరిగినవాడే బ్రాహ్మణుగనుక విష్ణునే ఎఱుగటం ఇంకా పరమమైన సంగతని భీష్ముడు అంటున్నాడు. పై మాటలు వేదంలో చెప్పినవి గనుక వేదకాలంలో గుణకర్మ విభాగవశమైన బ్రాహ్మణుల గూర్చియే చెప్పబడిందనేది గమనీయం. అందుకే భీష్ముడు విష్ణు ప్రసంగంచేసి, చివరకు, శ్రీకృష్ణునిచూపి,—

"ఈ శ్రీకృష్ణుడే వేదమయుడు వేదవేద్యుడు కనుక (బ్రాహ్మణుడని అర్థం) ఆయనే వేదార్థవిత్తమప్రియుండు, ఈ విషయం మనసా బుద్ధ్యా తెలిసి అనుభూతి అనుసరణ చేయడమె పరమధర్మ" మన్నాడు.

## 5. గరుత్మంతుడు-ఐకాంతిక తత్త్వబోధ

ధర్మరాజు "వేదాల ప్రసక్తిని భీష్ముని ప్రవచనంలో విని గరుత్మంతుని జ్ఞాపకంచేసికొన్నాడు. గరుత్మంతుడనే మాటకు వేదమార్గమనే అర్థంకూడ ఉంది. అందుకని గరుత్మంతుని కథ వినాలని ఉంది-చెప్పవలసిందంటాడు.

వ్యాసుడు ఆదిపర్వంలో సౌపర్ణోపాఖ్యానం భారతంలో చేర్చినా మళ్ళీ ఇక్కడ గరుత్మంతునికథ వివరిస్తున్నాడు. ఏదో అంతరాంతరమైన అర్థం ఈ కథలో ఉందికనుక వ్యాసుడు దాన్ని అంత ప్రేమించి ఉంటాడు. గరుత్మంతుడు సాక్షాత్తు విష్ణుమూర్తికి వాహనమే అయినాడని చెప్పి ఆతడి గొప్పతనాన్ని గూర్చి వ్రాక్రుస్తాడు. భీష్ముడు చెప్తున్నాడు :

"కశ్యపుడికి ఇద్దరు భార్యలు. వినత, కద్రువ. వారిద్దరికీ వారుకోరిన ట్లుగా సంతానం కలిగే వరాన్నిచ్చాడాయన. కశ్యపుడనేమాట 'పశ్యకు' డనే అర్థానికిగాను వాడారు. ఆయనకు సమస్తమైన నిజమూ అవుపడుతుందని-అ అర్థం! మనిషి ప్రధానుడు-పుణ్యం-పాపం-అనేవి అతడికి సహాయకాలు. ఈ కథలోని ఇద్దరు భార్యలూ మనిషికి పుణ్యపాపాల్లాటివారు.

వినతకు రెండు గ్రుడ్డులూ కద్రువకు వేయి గ్రుడ్డులూ పుట్టినయి. వాటిని కుండల్లో నేతితోపెట్టి వాటినుంచీ రావాల్సిన జీవాలకోసం ప్రతీక్షిస్తున్నారీ ఇద్దరు స్త్రీలు. పుణ్య పాపాల ఫలం వెంటనే కలుగనూవచ్చు వేయేండ్లైనా పట్టనూవచ్చు. వారు అలా వేచి ఉన్నారు. ముందు కద్రువకు పుట్టిన వేయి గ్రుడ్లూ ఒకొక్కటే విచ్చి జీవాల్ని ప్రసవించినయి. అవన్నీ పాములరూపంలో ఉన్నాయి. బలంగా ఉన్నాయి. పొడుగ్గా ఉన్నాయి. వినతకు పుట్టిన గ్రుడ్లు ఇంకా పిల్లల్ని ప్రసాదించలేదు. వినత మత్సరాన్నిపొంది, ఒక గ్రుడ్డును చిదిపింది. పుణ్యపరుడైనా ఈ మనో వికారాల్ని జయించడానికి సాధన కావాల్సిందె. అది లేక ఇలాటి పిచ్చిపని ఆమెచేసింది.

ఆ గ్రుడ్డులోంచీ అనూరుడనే పక్షి పెద్ద శరీరంతో ఉద్భవించినా క్రింది భాగం పూర్తిగా పెరగని కారణంచేత కుంఠితత్వం అతడి శరీరానికి కలిగింది. అతడు తల్లిని మందలించి నీకు పాపులతల్లి అయిన కద్రువకు దాస్యం చేయా ల్సిన గతిపట్టుతుంది-అన్నాడు. ఆ రెండో గ్రుడ్డును జాగ్రత్తగా కాపాడితె అందులో పుట్టేవాడు నీ దాస్యాన్ని వదిలిస్తాడన్నాడు. ఈ గ్రుడ్డు విచ్చడానికి ఇంకా ఐదువందల ఏండ్లు పట్టుతుందనికూడ చెప్పాడు. అలా ఐదువందల ఏండ్లు అయింతరువాత ఆ గ్రుడ్డులోంచీ మహాకాయుడైన గరుత్మంతుడు పుట్టాడు. అనూరుడు సంతోషించి సూర్యలోకానికి వెళ్ళిపోతాడు.

పుణ్యఫలాలు రెండు విధాలు అనిపిస్తుంది. ఐహిక ఫలాన్ని అనుభవించి సుఖపడటం ఒకటి. ఆ ముష్మికోన్నతికి దోవదొరకడం రెండు. అనూరుడు మొదటి సుఖం ఇచ్చాడు. గరుత్మంతుడు పుట్టంగానే అనూరుడు సూర్యలోకా నికి వెళ్ళాడంటె పుణ్యఫలం మెట్టునెక్కిందనుకోవాలి, వినతకు గరుత్మంతుని వల్ల ఆ ముష్మికఫలం కలుగబోతోంది.

అనూరుడు వెళ్ళినప్పుడే,-గరుత్మంతుడు బ్రహ్మదేవునిచేత కల్పితమైన భోజనం చేయడానికి వెళ్ళాడు. అది తిని శరీరం చక్కగా పెంచుకొన్నవాడై సిద్ధ సాధ్యగణాలచేత ముద్దు చేయబడి ఆడుకొంటూ ఉండేవాడు. బ్రహ్మ కల్పించిన భోజనం యేదో అది! పుణ్యఫలితంగా మనిషికి కలిగే ధర్మబుద్ధే. ఆ భోజనమై శరీరమనోబుద్ధులకు వికాసాన్ని కలిగిస్తూ సిద్ధులూ చారణులతో సమానమైన శక్తులు కలిగింపజేస్తూండటమయి ఉండవచ్చు.

ఈ కథలో పూర్వమే కద్రూ వినతలు సముద్రతీరానికి వాహ్యాళికి వెళ్తారు. సముద్ర-అంటె బ్రహ్మానందమని అర్థం. దాన్ని చేరారంటె బ్రహ్మా నందం తీరానికి వెళ్ళారు. అదె శుద్ధ సత్త్వస్థితి. దూరంగా వారికి శుద్ధ సత్వమైన దగిన ఉచ్చైశ్రవముకనుపడింది. "దానితోక తెల్లగాలేదు నల్లగా ఉన్నదం టుంది కద్రువ"—కాదు సర్వమూ తెలుపేను అగుఱ్ఱమంటుంది వినత. పుణ్య వశంచేత సత్వాన్ని పొందినా మనిషికి సాత్వికాహంకారం ఉదయించకుండా ఉండాలి. కాని ఇక్కడ వినతకు అహంకారం కలిగినదై, కద్రువ మాటను కాదని ఎదిరించింది. నిజానికి ఆరంగు ఎలాఉంటేనేంగాక! ఇద్దరూ వాదించు కొని పందెం కట్టారు. వెళ్ళి చూడాలి. ఎవరు ఓడిపోతె వారు రెండోవారికి దాస్యం చేయాలన్నారు-ఆనాడు ప్రొద్దుగ్రుంకి మర్నాటికి ఆ పనిని వాయిదా వేశారు.

మరునాడు కద్రువ దుర్వ్యూహంచేసి, కొడుకుల్ని వెళ్ళి ఆ గుఱ్ఱపు తోకను నల్లగా చుట్టుకొని ఉండుమంటుంది, ఆ కుమారులంతా ధర్మానికి వ్యతి రేకం చేయమంటారు. ఆమె శపిస్తుంది. మీరంతా జనమేజయ యాగంలో హోమగుండంలో నశిస్తారని. ఒక్క కర్కోటకుడనేవాడు మాత్రం ఆమె ఆజ్ఞను ఇష్టం లేకుండానె ఒప్పుకొని మొత్తంమీద నెరవేరుస్తాడు. వినత మరు నాడు తన పందెం ఓడిపోయింది. సవతికి దాశీ అయింది.

సాత్వికాహంకారంవల్ల ఈ పరిస్థితి వచ్చింది. అందుకే మనిషి పుణ్య పరుడైనా ఈ అహంకారం కలుగకుండా చూచుకోవాలి. అది కలిగిందంటె పెద్ద పతనం కలుగుతుంది. ఆ సాత్త్వికాహంకారం పోవాలంటె-మంచికో-చెడుకో-ఇతర్లకు దాస్యం చేయడానికి సిద్ధంకావాలి. దాస్యం చేస్తేనే అయహం కారం పోయినట్లు!

పుణ్యం పిల్లి కలిగిన ఆధ్యాత్మతత్త్వం కారణంగా భగవంతుడి అనుగ్రహం కలుగుతుందంటారు. అలాగే నారదుడు గరుత్మంతుడికి అతడి తల్లికి కలిగిన దాస్యం ఐహికంగా వదిలించి వేయరాదా అని, దానికి సంబంధించిన పై జరిగిన కథను చెప్తాడు. గరుత్మంతుడు వెంటనె సవతితల్లివద్దకు చేరి నమస్కరించి "మా తల్లి దాస్యం నీకు చేయాల్సిందె. అది న్యాయమా అన్యాయమా అని నేను వివాదం చేస్తున్నాననుకొనకు. ఈ దాస్యం ఇప్పుడు వదలాలంటే నీకేంకావాలో చెప్పు నే తెచ్చిస్తా" నన్నాడు.

ఆమె "అమృతం తెచ్చియివ్వు-మీ అమ్మకు ధాస్యం వదలిపోతుంది. నీవు ఆమెను తీసికొనిపోదువుగాని!"-అంటుంది. బహుశ ఈ పని ఇతడు చేయలేడనుకొని యుండచ్చు. లేదా బ్రహ్మ దగ్గరకు వెళ్ళగలిగినవాడుగనుక ఇతడే అమృతం తేగలడనుకొని ఉండచ్చు. ఏదైనా మేలేనని అలా చెప్పింది. కొడుకుల్ని తాను శపించినా అమృతం తెస్తే తానూ వారూకూడ శాశ్వతంగా ఐహికంలో బ్రతుకుదామనుకొంది కావలె. కాని కొడుకులు వెళ్ళిపోయి వాళ్ళ వాళ్ళ పుణ్యపాపాల విధానాన-నడుపుకొంటున్నారు జీవితాల్ని. అమృతం తెస్తే పాపానికి ప్రతీక అయిన ఈ కద్రువకే లాభం బహుశ! వాసుకి మొదలైన కుమారులు అప్పటికే పరమాత్మ నాశ్రయించి అమృతమయులైనారు.

గరుత్మంతుడాలోచించాడు- ఏం చేయాలని. వెంటనె వెళ్ళి తండ్రిని కలిసి "అమృతం తేవాలి-నాకు దేవతల్ని జయించే శక్తి రావాలి! ఎలాగ?" అన్నాడు. కశ్యపుడు పశ్యకుడేననన్నాముకదా! అంటే నిజం చూడగలవాడు. చూశాడు. మానసలోకంలో వారికి ద్వంద్వాలుంటయి. ఆ ద్వంద్వాలు నశిస్తేగాని దేవతలంతటివారు కాలేరు; అందుకని, ఆ ద్వంద్వాల్ని నశింపజేయుమనే భావం కడుపులో పెట్టుకొని,-ఇలా అన్నాడు.

'తూర్పు సముద్రానికి దగ్గరె ఒక పర్వతముంది. అక్కడొక పెద్ద సరస్సు ఉంది. మధుకైటభులు పూర్వమెప్పుడో అస్తికోసం పోట్లాడుతూ వచ్చినవాళ్ళై ఒక గజముగా ఒక కచ్ఛపముగా ఆ పర్వతం, సరోవరంలలో జన్మించి పోరాటం సాగిస్తూనే ఉన్నారు, ఆ యిద్దర్నీ ఒక్కసారిగా పట్టి నాశనం చెయ్యాలి. ద్వంద్వాలైన ఆ రెంటినీ ఒకేసారి నాశనం చేస్తేగాని దేవతల్ని జయించటం కుదరదన్నాడు.

వైనతేయుడు క్షణంలో ఎగిరి వెళ్ళాడు. అక్కడ ఏనుగును సరసిలోని నీళ్ళు త్రాగనీయకుండా తాబేలు అడ్డుకొంటోంది. ఏనుగు దాన్ని తొక్కుతోంది. పక్షీంద్రుడు వాటి వివరణ పశ్యకునిద్వారా తెలిసికొన్నవాడు కావటం చేత, తన రెండు కాళ్ళ గోళ్ళతో రెంటినీ గ్రుచ్చి ఎత్తి ఆకాశమార్గానికెగిరి ఒక పెద్ద చెట్టుమీద పెట్టి తినబోయినాడు. ఆ చెట్టుకొమ్మ పెళపెళమంది. విరిగి క్రిందపడితె దాన్ని పట్టుకొని ధ్యానసమాధుల్లో ఉన్న వాలఖిల్యులనే మునులు చచ్చిపోతారు అని తెలసికొన్నాడు. తండ్రి ద్వంద్వాల్నినాశం చేయాలన్నాడని, దయాదుల్నికూడ నాశంచేశాడా యీ గరుత్మంతుడు? లేదు. దయాదులను నాశం చేయలేదు. ఆ మునులను రక్షించాలనే, తన నోటితో ఆ విరిగిపోయిన కొమ్మను పట్టుకొని వారిని రక్షించాడు, దీనితో గరుత్మంతునికి పుణ్యం, తత్ఫలం కలుగుతోంది. ఎక్కడో పర్వతంమీద నిల్చి ఆ రెంటినీ నశింపజేశాడు. అమృతంకోసం దేవలోకం వెళ్ళాడు.

ద్వంద్వాల్ని గుర్తించాలి ముందు. సుఖం కలుగుతుంది. దానివెంట కలిగే దుఃఖం-ఓహో-ఇది సుఖానికి ప్రత్యర్థిగా వచ్చింది అని తెలియాలి. అందుకె గరుత్మంతుడు ముందు ఏనుగను చూచి అది నీళ్ళకు వెళ్ళుతున్నప్పుడు దాన్ని తాను అనుసరించి వెళ్ళి తాబేలుతో పోట్లాడే క్షణాన ఆ తాబేలును గుర్తించటంకూడ వ్యాసమహర్షి కథలో వర్ణించాడు!

అమృతభాండాన్ని ఒకచోట దాచి దానిచుట్టూ మంటలుపెట్టి ఉన్నారు దేవతలు. అందుకని ముందు బ్రహ్మను తలచి ఆయన్ను ప్రసన్నుడిచేసికొన్నాడు గరుత్మంతుడు. బ్రహ్మను గత్యంతరమడిగాడు. అప్పుడు బ్రహ్మ అంటాడు-"ఆలమందలుండేచోటికి వెళ్ళు. అక్కడ నుంచి అంతులేనంత వెన్న తెచ్చి ఆ మంటలకున్న శిఖలకు వెయ్యి. ఆ జిహ్వలు మోయలేనంత వెయ్యి. అవి తగ్గుతాయి. అప్పుడు లోపలకు వెళ్ళి అమృతాన్ని పొందు" అని! ఆలమందలంటే సాధులోకం. అక్కడికి వెళ్ళుమంటే "నీవు సాధువు కావలసిందని అర్థం. వెన్న అంటే ప్రేమ, దయ! వీటిని పుష్కలంగా కలిగిఉండు. ఆ దయను ఆ క్రోధరూపమైన అగ్ని భరించలేనంతగా ప్రసరింపజెయ్యి. అది తగ్గిన క్షణాన అమృతభాండాన్ని నీవు చేరగలవని బోధ.

ఇది సాధన. ఇంతసాధనవల్లనే అమృతం చిక్కుతుంది. అమృతమంటే పరమాత్మ అనుగ్రహం అని అర్థం! దాన్ని గడించడానికి ఇంతపని తప్పదని

బోధ. మామూలు మనుషులకు సందేహం వస్తూ ఉంటుంది పురుషకారము గొప్పదా? దైవానుగ్రహమా? అని, సాధనలో పురుషకారం కావాలి. అది ఉపాయము సంపాదించడానికికాదు! భగవంతుని అనుగ్రహం పొందడానికే గాను చేయాలి. అలాటి పురుషకారంవల్ల భగవదనుగ్రగం కలిగితె మోక్షం పొందచ్చు. ఏదిగొప్ప? పురుషకారమె మనమున్న స్థితిలో కర్తవ్యం, గొప్పా కూడ! దానివల్లనే 'అనుగ్రహం' పొందాలి కనుక చిట్టచివరిదిగా అనుగ్రహమె గొప్ప!

గరుత్మంతుడు అలాచేసి లోపలకువెళ్ళి అమృతభాండం అందుకొని దేవతల్ని ఇంద్రుణ్ణి ఎదిరించి జయించి కద్రువ ఎదుట దాన్ని పెట్టాడు. కద్రువ అమృతాన్ని పొందడానికి తగిన వ్యూహం అంతా తన ప్రయత్నమంతా లౌకికంగా చేసింది. ఇక మరి ఫలితం కలుగుతుందా! ఎలా కలాగుతుంది? భగవంతుని అనుగ్రహంకోసం ఈ ప్రయత్నం చేయలేదే! గరుత్మంతుడు అమృతభాండాన్ని చూపి అక్కడుంచి, తల్లి దాస్యం వదిలిపోయింది అని చెప్పి ఆమెను తనపై నెక్కించుకొని దేవలోకం వెళ్ళిపోయినాడు. దేవతలు అతడి వెనుకనె వచ్చియున్నవారై కద్రువకు అది దక్కకుండా తీసికొనిపోయినారు.

ఇదీ గరుత్మంతుని కథలో అంతరాంతరమైన భావం.

గరుత్మంతుడు విష్ణుమూర్తికి వాహనమయినాడు. ఇంద్రునకు స్నేహితుడైనాడు. గరుత్మంతుడంటే వేదాలనెరిగి తత్ప్రకారం నడుచుకొనేవాడని అర్థం. వేదాలు ఎన్నో యజ్ఞాలు చేయుమని చెప్పటం ఒక్కటే మనకు తెలుసు. అవి "అకర్మ"గా చేస్తే చిత్తశుద్ధియై ఉపనిషద్భావం ఉప్పొంగి, ఏకాంతికత్వం కలిగితె మోక్షం పొందడానికి మానవునికి వీలు. అందుకు పరమేశ్వరుని ఎరిగి భక్తిచేస్తూ శరీరంతో అకర్మ చేయాలి అన్నాడు భీష్ముడు! అప్పుడు ధర్మరాజంటాడు—

"అధిభూత అధిదైవాదులు పరమేశ్వరునివల్ల కలిగినవంటారు. అలాంటి పరమేశ్వరుణ్ణి ఎటుగతమెలా?" అని. అప్పుడు భీష్ముడు సనత్సుజాతుడు నారదునకు చెప్పినబోధలోని అంతర్య విషయాలు చెప్తాడు :

"ముందు ప్రపంచ చింత తగ్గాలి. అందుకు జ్ఞానమే శరణం, అప్పుడు కర్మ చేయడంలోనే మార్పు కల్గితె భగవంతుణ్ణి తెలియచ్చు. భగవానుడైన విష్ణుమూర్తి విధమేదో ఒకప్పుడు గరుత్మంతుడు చెప్పాడు. ఈ కథవిను:

"హిమగిరిలోని మహర్షులు తనకు చెప్పిన మాటలు చెప్తూ గరుత్మంతుడు ఇలా చెప్పాడు: "ఈ భువనత్రయాన్ని రక్షించడానికి స్వామి ఒకొక్కప్పుడు వచ్చి దుర్మార్గుల్ని రాక్షసుల్ని శిక్షించి వెళ్ళిపోతుంటాడు. అమాత్రం చూసి అదె ఆయన రూపం అనే వీలులేదు. ఇంద్రుడిన్ని గెల్చి అమృతాన్ని నేను తీసికొనిపోయాను. ఆ సమయాన 'నిన్ను మెచ్చాను. నీకు వరమిస్తాను, అనే మాటలు నాకు వినపడ్డయి. అప్పుడు నేను నీవెవరో సెలవిచ్చి ఆ తరువాత 'వరం' ఈయాల్సింది అన్నాను. అప్పుడాయన కేవలం ఉజ్జ్వలమైన తేజస్సుగా దర్శనమిచ్చి, నాకు వరమిచ్చి నన్ను తనవాహనంగా ఉండు" మని వెళ్ళిపోయినాడు.

ఆయనెవరనేది అప్పటికి తెలీలేదు. వెళ్ళి మా తండ్రినడిగాను. ఆయన విష్ణుమూర్తనీ ఆయన దర్శనం కావడం ఆయన అనుగ్రహమాత్రమెననీ చెప్పాడు. వెళ్ళి బదరికాశ్రమంలో ఆయన్ను కలిసే ప్రయత్నం చేయుమన్నాడు.

నేను బదరి వెళ్ళాను. ఆస్వామి అక్కడ ఎనిమిది భుజాలతో శంఖచక్రాలతో అపుపడ్డాడు. ఉత్తరదిశకు తాను వెళ్తూ నన్నూ రమ్మన్నాడు. నేను వెళ్తున్నాను.నాకు ఆయన కన్పడకపోయినప్పుడల్లా ఒంటరిగా ఏకాతమైనమనసుతో నిల్చి ధ్యానిస్తూ వచ్చాను. ధ్యానించినప్పుడల్లా అపుపడి రమ్మనిపిల్చి వెళ్ళటం అవగతమయేది. అతడె అగ్నిగా, శివుడిగా, ఇందరుగా అవుపించాడు.

అక్కడ చీకటి బ్రహ్మాండంగా ఉంది, దానిని దాటి ఆయన వెళ్ళాడు. నేనూ వెళ్ళాను. ఆ తరువాత ఆయన అంతులేని కాంతితో వెలిగిపోయినాడు. సూర్య-చంద్రులక్కడలేరు. వారక్కరనేలేదు నిజానికక్కడ.

నేను మళ్ళీ ప్రార్థించి ఆయన నాకు అవుపడటల్లేదని కలవరపడ్డాను. అప్పుడాయన మాటలు ఇలా వినపడ్డవి: "నన్ను చూడాలంటే మమకారం, అహంకారం, రెండూ వదలాలి. నిశ్చలమతితో శమాపూర్ణమైన ఆత్మతో ఉండాలి. అప్పుడు నన్ను చూడగలరు." నేనలా సాధన చేశాను. అప్పటినుండి నాకు ఆయన స్థూలరూపంతో దర్శనమిస్తారు. స్థూలరూపం ఇంద్రియాలకుకూడ అవుపడేది. ఇంద్రియాలు ఐకాంతికమై విష్ణుముఖమై యున్నను మనస్సుతో

లీనమైతేనే అది సంభవం." అన్నాడు గరుత్మంతుడు. తనకు విష్ణుమూర్తి చెప్పిన జ్ఞానం తెల్పాడు.

విష్ణుమూర్తి గరుత్మంతునకుపదేశించిన ఆత్మ తత్త్వం భీష్ముడు చెప్తున్నాడు: "అన్ని భూతాలూ నానుండి వచ్చినవె. నాతత్త్వాన్ని అవి అధిగమింపలేవు. నా సత్త్వంతోపాటు భూతాలకు ఎన్నో వికారాలుండవచ్చునుగాక. ఆ వికారాలూ నానుండి పుట్టినవె అయినా అవి ఈ భూతాల జ్ఞాననేత్రాన్నికప్పుతవి. అందుకె, కామవర్జితులూ అహంకార విముఖులూ, నిర్మలబోధయుతులూ, నిత్యతృప్తలూ, శాంతులూ, సత్యం, భక్తిలతో నిండిన చిత్తంకల నియతాత్ములూ మాత్రమెనన్నెరుగగలరు. సాంఖ్య యోగులు అంతర్దర్శనులై నిశ్చయులై ఉంటేనే-వారే ఉపవాసాలు చేసినా వ్రతాలు చేసినా ప్రయోజనం! బహిర్దర్శనులైతే ప్రయోజనంలేదు. ఐకాంతిక ధ్యానపరులు మాత్రమె నన్నెరుగగలరనడం అందుకె".

విష్ణు సాక్షాత్కారమంటే ఆత్మ సాక్షాత్కారమే ననేది ఈ కథకు ప్రాతిపదిక.

## 6. యోగనష్టము ఉపాఖ్యానాలు

మనిషి భగవంతుడ్ని చేరజాలనట్లై జంతువుగాకూడ కాలేడా? అనిశంక. దీనికి సమాధానంగా,—

భీష్ముడు ధర్మరాజుకు "నక్క-కోతి" కలిసి మాట్లాడుకొన్న కథ చెప్తాడు. నక్క తనకాజన్మ ఎలా వచ్చిందో చెప్తూ బ్రాహ్మణునకు తాను దానమిస్తానని ఈయకపోవటంవల్ల వచ్చిం"దన్నది-అది చెప్పి, మనిషి అబద్ధపు బ్రతుకు బ్రతకటంవల్ల మనిషినుంచీ నక్క వరకూ దిగజారడం కలుగుతుందని సూచించాడు. ఐకాంతిక భక్తివల్ల దేవునివైపుకూ, అబద్ధపు బ్రతుకువల్ల జంతుగర్భాలకూ మనిషివెళ్ళటం ఇక్కడి విషయం.

అలాగే శూద్రునకు వేదమంత్రాలు చెప్పినందుకు ఒకానొక ముని పతనం చెందినట్లుకూడ కథచెప్పాడు. వేదార్థపర్యవసానం చెప్పాల్సిందిగాని వేదాలు పలకలేని వారిచేత పలికించుదామన్న ప్రయత్నం చేయకూడదని చెప్పదలచాడనుకోవాలి.

అలా వర్ణాలు, గుణాలు, ఒక ప్రక్కనూ కులాలూ జన్మలూ మరొక ప్రక్కనూ ఆధారంచేసి, మను రాజశాసనాన్ని మన్నిస్తూభగవంతుని గుణమయ శాసనం విడిచి, మర్చిపోయి, మనిషి యోగాన్ని నష్టపరుచుకోవటం జరుగుతోందని బోధ!

లక్ష్మీ ఉండే స్థానాలు ఏవి? అనే ప్రశ్నకు భీష్ముడు లక్ష్మియె-రుక్మిణికి చెప్పిన మాటలు చెప్తాడు: "ఎల్లప్పుడూ నిజం చెప్పేవారూ, శౌచనిరతులూ గురు భక్తులూ, అప్రమత్తులూ, దక్షులూ, అమలినమతులూ సత్కర్మపరులూ తపం బ్రహ్మచర్యం, శమంలను కల్గిన వారివద్ద నేను ఉంటాను" అన్నదట. కౄరులు నిద్రపోయేవారివద్ద ఉండను అన్నది.

ధర్మరాజు భీష్ముని అడుగుతాడు: స్త్రీ పురుష సంయోగ సమయంలో ఎవరికి ఎక్కువ సుఖము? అని. భీష్ముడు, భంగాశ్వుడనేరాజు కథనుచెప్తాడు. అతడు నూర్గురు కొడుకుల్నికని, దైవవశాత్తు ఒకానొక సరస్సులో మునిగి స్త్రీ అయిపోతాడు. తరువాత ఒక మునిని పెళ్లాడి సంభోగమంది నూర్గురు పుత్రుల్ని తిరిగి కంటాడు. మొదటి నూర్గురుకూ ఈ నూర్గురుకూ యుద్ధం వచ్చినదై అంతా చచ్చిపోతారు. అప్పుడు ఇంద్రుడు వచ్చి ఎవర్ని బ్రతికించుమంటావంటాడు. అప్పుడా స్త్రీరూపంలో ఉన్న భంగాశ్వుడు తాను తల్లిగా కన్న నూర్గురనే బ్రతికించుమంటూనే-తాను స్త్రీగానే ఎక్కువ సంభోగ సుఖం పొందుతుండటం చేత తాను అలాగే ఉంటాననీ ఆ వరం అనుగ్రహించాల్సిందనీ కోరి అవరాన్ని పొందుతాడు. ఈ కథవల్ల అతీతదశలు కలిగినవారిద్వారా క్లిష్టమైన ప్రశ్నలకు సమాధానాలు తెలియటం ముఖ్యం అనిపిస్తుంది,

# మహాభారత కథలు

## అనుశాసనిక పర్వం- ద్వితీయాశ్వాసము

## 1. కొన్ని ధర్మసందేహాలు

1. కన్యాదానం పుచ్చుకొనే వరుడెలా ఉండాలని ధర్మరాజడుగుతాడు. అందుకు భీష్ముడు- అష్టావక్రుడంటె ఎనిమిది వంకరలున్నవాడని అర్థం. జన్మించడానికి పూర్వమె శాపం పొందాడు. తండ్రి చెప్పే వేద పనసలో స్వరం తప్పున్నదని తల్లి గర్భంలోనున్నపుడే తప్పు పట్టటం చేత - తండ్రి అలా శాపమిచ్చాడు. తరువాత కొన్నేండ్లకు విద్వత్తులో తండ్రిని మెప్పించటం చేత తండ్రి నదిలో స్నానం చేసి రమ్మన్నప్పుడు అష్టావక్రుడు స్నానంచేయంగానే దివ్య రూపాన్ని పొందాడు.

అష్టావక్రుడు సంయమి. వదాన్యుడనే తపస్వికి ఒక కుమార్తె ఉంది. ఆమెనతడు వివాహమాడదలచాడు. వదాన్యుని వద్దకు వెళ్ళి సుప్రభను తన కీయవలసిందని అర్థిస్తాడు, వదాన్యుడు ఈతడ్ని తగిన వరుడౌనా కాదా అని పరీక్షింప దలచి, కొంతకాలంపాటు ఉత్తర దిశకు వెళ్ళి పర్యటించి రావలసిందంటాడు. అతడు వెళ్ళంగానే ఉత్తర దిశను పిలచి ఆ అష్టావక్రుడు తగిన వరుడవునాకాదా పరీక్షించి చెప్పుమంటాడు, ఆమె సరెనని వెళ్తుంది.

అష్టావక్రుడు ప్రయాణం చేస్తుంటే ఆమె ఒక చక్కని కుమారిగా అవుపడుతుంది. ఆయన్ను ఆహ్వానించి అతిథ్యమిస్తుంది. ఆమె అతడ్ని ఆకర్షింప జూస్తుంది. రాత్రివేళ తనకు చలిగా నున్నదని అతడి శయనం చేరుతుంది. అతడ్ని కౌగిట చేర్చింది. ఆతడు కేవలం కొయ్యలా ఉండిపోతాడు.

"నేను కోరుతుంటే నీవనుభవింపవేం? స్త్రీ కామవశం చేత వంశహాని తలచకుండా నూర్గురు పురుషులనైనా సరె కోరుతుంది. నేను నిన్ను కోరుతున్నపుడు నీకభ్యంతరమెందుకు!'' అంటుంది.

అష్టావక్రుడు "నేను అస్ఖలిత బ్రహ్మచారిని. భార్యను కోరినవాడనై వచ్చాను. నీవు ఈ ప్రవర్తనను అబద్ధంగా తెచ్చిపెట్టుకున్నావు అనిపిస్తోంది. నీ వెవరో చెప్పు. నేమ నియమవంతుణ్ని" అంటాడు.

వెంటనే ఆమె "నేను ఉత్తర దిశను. నిన్ను పరీక్షించాను. నీవు తగిన వరుడవు. ఆ మాట వదాన్యునకు చెప్తాను. నీవు వెళ్ళి సుప్రభను పెండ్లి చేసికొను" మంటుంది.

ఈ కథ చెప్పి వరుడు కామాన్ని అదుపులో పెట్టుకోగలిగిన నియమవంతుడై యుండటం ముఖ్యం అన్నాడు భీష్ముడు.

ధర్మరాజు పృచ్ఛించిన తరువాతి ప్రశ్న ఏమంటే విప్రుడు దానం పట్టటానికి పాత్రుడంటారు కదా! ఎందువల్ల? అతడు భిక్షాటనం ఊంఛవృత్తి చేస్తున్నందువల్ల అతడికి పాత్రతకలుగుతున్నదా? అయితే ఆ వృత్తి చేయని విప్రునకు దానమీయరాదనవచ్చునా? అన్నాడు.

భీష్ముడు "వృత్తితో పనిలేదు. వేద విహితమైనట్టి ధర్మం నడుపుతున్న మంచి బ్రాహ్మణుడై ఉండాలి, అతడు దానం గ్రహించడానికర్హుడు. బ్రహ్మవేత్తయైన పురుషుడు అందుకు అర్హుడె బ్రహ్మర్షులు అందుకు ముఖ్యులు కదా!" అలాగా ప్రాపంచిక వృత్తుల్లో ఏ వృత్తి చేసే వాళ్ళుఅన్నట్లయితె దానికి సమాధానంలేదు.

ధర్మరాజప్పుడు మునులవలన శూద్రజాతి స్త్రీకి పుట్టిన వారికి బ్రహ్మర్షిత్వం ఎలా కలుగుతున్నది? అని ప్రశ్నిస్తాడు.

భీష్ముడు - మనుధర్మ రీత్యా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రుల్లో ఒక కులానికి చెందినవారు ఆ తరువాతి వారికి చెందిన స్త్రీని పెండ్లి చేసుకొనవచ్చు. కాని ఆమెకు పుట్టిన సంతానం ఆమె కులానికి మాత్రమె చెందినదవుతుంది. ఇది సాధారణ శాసన ధర్మం, కాని ఉత్తమ తపోజ్ఞాన విద్యాప్రభావ కలిగిన మునుల బీజం వల్ల కలిగినవారు, ఆ క్షేత్రమేదైనా - ఆ ముని వంమునే పొందుతారు. ఇది విశేష ధర్మం. అలాంటివారికి ఇతర కులాలయందు కలిగిన వారి మాటకేమిగాక - వారికి అయోని జాతులైనవారు తండ్రి జాతిని పొందటల్లేదా? వశిష్ఠుడు ఋష్యశృంగుడు అగస్త్యుడు వ్యాసుడు ద్రోణుడు కృపుడు వీరంతా అలాంటివాళ్ళు కాదా? మనుశాసనంలోనే కులముల ప్రసక్తి చేస్తూ "సామాన్య శాసనం, మునిజనులు, నదులు, సిద్ధుల జననాలకు వర్తించదనె అపవాదం కూడ ఉన్నది.

* ధర్మరాజు: దానం పుచ్చుకొన్నందువల్ల పాపంరాదా?

భీష్ముడు : రాదు. తన పాపం పోవాలని శ్రద్ధగా దానమిచ్చినపుడు తగినవాడు పుచ్చుకొన్నపుడు దాత పాపం వీనికి రాదు. శ్రద్ధా పూర్ణమైన దానం ఇవ్వడంలో గల త్యాగం వల్ల ఆ పాపం నశిస్తుందిగాక! పితృ కార్యానికీ దైవ కార్యానికీ కూడ మంచివానిని తగిన బ్రాహ్మణుని వెదికి తేవాలి. శ్రేష్ఠుడైన వానికి దానమీయడం వల్ల దాని ఫలాన్ని దాతకు కలిగిస్తుంది.

* ధర్మరాజు : దానము పొందడానికి - పూర్వసంబంధి, పండితుడు సోమయాజి, తపస్వులలో ఎవరు ఎక్కువ శ్రేష్ఠులు?

భీష్ముడు: ఎవరైనా ఫరవాలేదు. అతడు ఆత్మోన్నతిని ధర్మమార్గాన్ని అనుసరించడమనేది ముఖ్యం. క్రియాపరత లేక మాటలు చెప్పేవాళ్ళు పనికి రారు. శీలము అనేది అతి ముఖ్యము. వేయి అశ్వమేధాలు చేశాననే వానికంటె ఒక సత్యవంతుడెక్కువ పాత్రుడు దానానికి. మద్య మాంసాలు తినక శుచిగా ఉండేవాడు గొప్ప అనచ్చు.

* ధర్మరాజు: ధర్మార్థ కామాలు ఏఏ కాలాల్లో ఆచరించాలి?

భీష్ముడు : అర్థకామాలయందాసక్తి తగ్గించుకొని ఈ పురుషార్థాలను ఎప్పుడైనా ఆశ్రయింపవచ్చు. ధర్మ విరుద్ధం కాని అర్థాన్నీ కామాన్నీ ఆశ్రయించాలి. యోగ్యుడయిన వ్యక్తి ఒకడ్ని సంతృప్తినందజేస్తే దేవతలు, పితరులు మునులు అంతా తృప్తిపడతారు. దేవతలకు మిట్టమధ్యాహ్నానికి పూర్వమున్నూ పితరులకు ఆ తరువాతనున్నూ మనుష్యులకు పగటి కాలంలో మధ్యాహ్న సమయంలోనూ దానమివ్వటం శ్రేష్ఠము. సంధ్యోపాసన లేని వారికి, వడ్డీకి డబ్బునిచ్చేవారికి, అనగ్నికులకు ఆరాధన దైవ పిత్రు కార్యాల్లో పనికిరాదు. దానమిచ్చేటప్పుడు-ఆర్తిలో నున్నవానికి, సత్కార్యం చేయాలన్న వానికి, ఇచ్చేటట్లుండాలి.

* ధర్మరాజు : తీర్థప్రదేశాల్లో ఇచ్చే 'దానం' గొప్పదంటారు. పుణ్య తీర్థ విశేషాలు చెప్పండి.

భీష్ముడు ; తీర్థ సేవను, కామక్రోధలోభ మదాదులు చేరని మనసుతో చేయాలి. అప్పుడే ఏ ఫలమైనా కలిగేది ! తీర్థాలు ఎన్నో చెప్పి వాటిలో స్నానం

చేసినందువల్ల కలిగే ఫలితం అంగిరసుడు చెప్పాడు. కాని దమం, తపం, అహింస, శమం, శౌచం కలిగిన వారికె- మమత్వం పోగొట్టుకోవటానికై తీర్థ సేవనం చెప్పారు. మమత్వం పోయిం తర్వాత ఇంకా వట్టి నీళ్ళలో స్నానం చేయాల్సిన పనేమిటి? ఈ లక్షణాలను తలచితెచాలు మానవుని కల్మషాలు నశిస్తవి,

ఈ మాటలు చెప్పి తీర్థాల మహాత్మ్యాలు పలుకుతున్న సమయంలో అత్రి, వశిష్ఠుడు భృగువు పులహుడు మొదలైన మునులు శిష్యులతో సహా అక్కడకు వచ్చి నిల్చి భీష్ముని మాటలు వినటం అందరకూ కన్పడింది. ఆ తరువాత వారు వెళ్ళిపోయినారు. తీర్థ విశేషాలు వినడం వల్లనే ధర్మరాజాదులకు ఈ మహా పురుషుల దర్శనం అయిందనవచ్చు.

భీష్ముడు తిరిగి చెప్తాడు. తీర్థ యాత్రలవల్ల ప్రయోజనం లేదనే భావం పెట్టుకొనకు. తీర్థ యాత్రలవల్ల మమత్వం నశించే విధం చూసుకోవటం ముఖ్యం. మమత్వం నశించినవాని కొక్కరికే వాటి ప్రయోజనం శూన్యమని చెప్పటం;

* ధర్మరాజు తీర్థాలు నదులవద్ద ఉంటవికదా - నదుల్లో ఏనదికి పుణ్యానుభవం ఈయగలిగిన శక్తి ఎక్కువగా ఉన్నది?

భీష్ముడు : గంగ అని చెప్పాలి. గంగ త్రిపథగామి. పరమ పుణ్యావహమైంది.

* ధర్మరాజు : బ్రాహ్మణులు పుణ్యానికి మూలమనీ, స్త్రీలు పాపానికి మూలమనీ అంటారు. సర్వజనులకూ పూజ్యులయిన వారుగా బ్రాహ్మణులెలా అయినారు? స్త్రీలెలా కాలేదు?

భీష్ముడు : ఈ శ్రీకృష్ణుడే ఒకసారి నారదుణ్ణి ఒక ప్రశ్న వేశాడు: నీవు ఎవరికి నమస్కరిస్తావు చెప్పవలసిందని. అప్పుడు నారదుడు,- వరుణ, వాయు సూర్య ఇంద్ర అగ్ని మొదలైనవారిలో ఎవరినైనా సరె భక్తితో సేవిస్తున్నవారికి అతిథి పూజ గావించే వారికి, పితృ సమర్చకులకు సత్యవ్రతులకూ నమస్కరిస్తాను అన్నాడు. పైగా "శ్రీకృష్ణా! నీవుకూడ అలాగే సేవించుతూ ఉండాల్సింది. శుభం అవుతుంది అన్నాడు. దీని అర్థం ఎక్కడో దూరంగా ఒక

దేవుడంటూ ఎవరో అతడికై నమస్కరిస్తాననే భావం గాక సర్వత్ర అధి దేవతలై అవుపడే భగవంతుని అర్చిస్తానని ఇక్కడి బోధ. అతిథికూడ భగవంతుడే. బ్రహ్మ పదార్థ తత్త్వజ్ఞాని భగవంతుడె అని బోధ. స్త్రీ త్రిగుణాల్లో తగు లోపిస్తేవారు పాపాలకు మూలమనటమె దాని ఆంతర్యం- త్రిగుణాల కూడలి అందర్లోనూ కానీ ఆ పేరులో సత్వ తమోరజాలు కలవటం చేత అలావారు పనికిరారని అంటారు.

ధర్మరాజు : రాజుకు అనేకమైన పనులుంటవికదా! అందులో అతి ప్రధానమైన కృత్యమేది? భగవంతుని సేవించడమా ప్రజలను సేవించడమా ఏది ముఖ్యం ఎలా చేయాలి అని శంక.

భీష్ముడు : సామ్రాజ్యాభిషిక్తుడయిన రాజుకు కర్తవ్యం బ్రాహ్మణ పూజనమే. బ్రాహ్మణుల అగ్రహానుగ్రహాలవల్ల ఆపదలూ సంపదలూ అప్పటి కప్పుడు కలుగుతుండటం మనం ఎన్ని చూడటల్లేదు. బ్రాహ్మణుడనగా అంతటి శక్తి కలవాడేను. విప్రుడు తృప్తి చెందితె దేవపితృ సమూహాలు తృప్తి నందుతవి. భూదేవి శ్రీ కృష్ణునకు చెప్పిందొకసారి : "మానవులు పాపాలను తరించే విధం విప్రసేవనం, విప్రపూజనం విప్ర హితం చేయడమె. "బ్రహ్మ బ్రాహ్మణులైన వారిని సృష్టించి మహాభాగులుగా చేసి వారితో ఇలా అన్నాడట "మీకు ఆత్మ కర్మ తప్ప మరొకటి లేదు. యుక్తధర్మ నిరతినీ బ్రహ్మగోపన మునూ పాటించవలసింది. మీకు శుభమవుతుంది" అని. బ్రాహ్మణ్యమె అన్ని వర్ణాలకూ తారకము. అనగా బ్రహ్మ పదార్థ తత్త్వశోధనమె. ఏ వర్ణానికి చెందిన సాధకునకయినా పరాకాష్ఠమని అర్థము. బ్రాహ్మణ వంశ జన్మలకు కూడ బ్రాహ్మణులైన వారిని పూజింప వలసినదే. విప్రగుణ సముదాయమైన శ్రీ, తపసు, స్వాధ్యాయం -ఇవె బ్రాహ్మణి అనబడతయి. వాటిని వెలుగ జేయుటం బ్రాహ్మణకులజులకేకాదు సర్వులకూ కర్తవ్యమె. జటాసురుడూ వాని కుమారుడైన శంబరుడూ విప్రపూజనం చేతనే దేవతలను గెలవగలిగారు. అప్పటినుంచీ ఇంద్రుడికికూడా విప్రపూజనం శిరోధార్యమైంది,

ధర్మరాజు : పాపాలకు మూలం స్త్రీ అనటంలో వారి తెఱగేమిటి?

## 2 స్త్రీ - పాపం ।

భీష్ముడు : ఆడవారి నిజమైన స్వభావం తెల్పవలసిందని పంచచూడ అనే అప్సర స్త్రీని నారదు డడిగాడు. ఆమె ఇలా చెప్పింది: "తినటం కట్టడం ముడువడం లాటి వాటి వల్ల కలిగే సుఖం ఆడవారికీ మగవారికీ ఒకవిధంగానే ఉంటుంది. కాని స్త్రీ పురుష సంగమంలోగల సుఖం స్త్రీకీ పురుషుడికీ ఒకే విధంకాదు. ఆమెకు ఆ విషయమై గలకాంక్ష తీరేదికాదు. అనుభవించినకొద్దీ ఇంకా అనుభవించాలనే అనిపిస్తుంది. అగ్నిలో ఇంధనం వేస్తున్నకొద్దీ మంట పెరుగుతుందిగాని ఎలా తరగడముండదో, నదులెన్ని వచ్చిచేరుతున్నా సముద్ర మెలా నిండదో వారి కాంక్షా అలాగే ఉంటుంది. దురదగల రోగికి గోకటంవల్ల ఆ దురద ఎలా తీరదో ఇదీ అలాంటిదె. అందుకె పురుషుడు స్త్రీల నీ సందర్భంలో సంతృప్తిపరచకలుగటం కల్ల. దురద పుట్టుతున్నా, "ఛీ. ఇక గోకవ"ద్దని స్థిరచిత్తం చేసికొని గాలిపీల్చి గోకటం మానేసినట్లే - "ఇకచాలు" అన్న ధృతిని కలిగితేనే తప్ప ఆ కాంక్ష నశించదు. అన్యపురుషుణ్ణి చూచినప్పుడు స్త్రీకి కామ గృహంలో కళలు కదులాడవి. అందుచేత స్త్రీని భజించే పురుషులు ఆ ఆకర్షణ వదలి సన్మార్గంలోకి రావటం అరుదు. పురుషుని ఆత్మోన్నతి దృష్ట్యా (అంటే జీవుని ఆత్మోన్నతి దృష్ట్యా) స్త్రీ దోషభూయిష్టమైంది అని చెప్తారు." అన్నది పంచశిల.

అంతేగాక స్త్రీలకు పూర్వం అగ్గలమైన కామప్రవృత్తి ఉండేదికాదు అప్పుడు జనులందరూ నిర్దోషులై ధర్మార్థ కామాలను సరిపడ అనుభవించి సౌఖ్యాలను దేవతలతో సమంగా అనుభవించేవాళ్ళు. ఇందుకు దేవతలు స్పర్థ చేసి, బ్రహ్మదేవునర్థించి స్త్రీలకు కామ స్పందనం ఎక్కువచేయించి అందుకు వారికి సుఖాన్నెక్కువ కల్పించి, ధృతిలేని మనుష్యులకు చిక్కులు తెచ్చిపెట్టారుట! అనగా కొంత అతీతశక్తులవల్ల ఈ ప్రవృత్తి స్త్రీకి ఎక్కువయి ఆధ్యాత్మికపరునకు పతనం కలిగించుతోందనిఅర్థం.

ధర్మరాజు : మరి అయితె-పాతివ్రత్య ప్రధానమైన యీ నేలమీద స్త్రీని కాపాడే దెలాగ? అన్నాడు.

భీష్ముడు : మనిషికి స్వార్థం లేకుండా కాపాడాలంటె సమాధాన మేదో అదే దీనికి సరియైన సమాధానమవుతుంది. మనసులో భగవంతుడా

వేశించి ఆకట్టపలిసించె. భగవద్ధ్యానంతప్ప యథాతథంగా ప్రత్యుపాయంలేదు. ఒకప్పుడు దేవశర్మ అనె మునికి చాల అందమైన భార్య ఉండేది. ఆమె అందానికి ఇంద్రుడే ముగ్ధుడై ఆమెకై ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఇంద్రుడనే మాటకి మనసని అర్థం. ఆధ్యాత్మిక చింతనం లేని మనసుకు ఆమెపై భ్రమ కలుగటం ఆశ్చర్యంకాదు.

ఒకసారి ఆముని ఎక్కడకో యాగానికని వెళ్తూ తన శిష్యుడైన విపులుని పిల్చి ఆమెను తానువచ్చేవరకూ ఇంద్రుడినుంచీ కాపాడవలసిందని ఆదేశించి వెళ్ళాడు. ఇంద్రుడేరూపంలో వస్తాడోననే భయంతో విపులుడు తన యోగబలం చేత ఆమె మనసులో ప్రవేశించి ఆమె చిత్తాన్ని జడంగా చేసి ఉండిపోయినాడు. ఇంద్రుడేవచ్చి ఆమెను అనునయిస్తున్నపుడు ఆమె చిత్తం జడమైయున్నది. గనుక విపులుడె ఆమె నోటినుంచీ మాట్లాడి ఇంద్రుణ్ణితిట్టి వంపివేస్తాడు. ఆమెను రక్షించడానికి అంతపని చేయవలసివచ్చింది.

దేవశర్మ యాగంనుంచీ తిరిగివచ్చి తన భార్యను రక్షించినందుకు విపులుని మెచ్చుకొని ఆశీర్వదించుతాడు. విపులుడు మాత్రం తాను ఆమె మనసులో ప్రవేశించినట్లు చెప్పలేదు. ఐనా దేవశర్మకు తన తపశ్శక్తి కారణంగా తెలియనె తెలిసింది, అప్పుడాయన శిష్యునితో అంటాడు, "నీవు ఆమె మనోబుద్ధుల్ని జడంగాచేసి ఆమెనోట నీ మాటలు పలికించావని చెప్పకపోయినావు. కాని ధర్మపరుడవై నీవాపని చేశావు కనుక అదినాకు సమ్మతమె" నన్నాడు. విపులుడప్పుడు తెలిసికొంటాడు: ఇంద్రుడు ఆమెను ఆకర్షింపజూస్తే తానే ఆమె మనసు నాపరించటం-ఇది తప్పే ననుకొన్నాడు.

ఒకసారి ఒకచోట స్త్రీ పురుషులిద్దరు చేతులుపట్టుకొని గిరగిరా తిరుగుతూ ఒకరికాళ్ళు ఒకరు తొక్కుకొన్నారు. ఆ విషయంలో వారు వాదులాడుకోవడ మారంభించారు. ఒకరు అంటున్నారు: నేను అలా బుద్ధిపూర్వకంగా నీకాళ్ళు తొక్కటం చేసినట్లుంటే ఆ విపులుడు పొందే పాపాన్నే పొందుతా"నని ఈ మాటలు విపులుడు విని గురువుగారివద్దకు వెళ్ళి ఈ సంగతిని నిర్వేదంతో చెప్తాడు.

అప్పుడు గురువు చెప్తాడు: వాళ్ళిద్దరూ అహోరాత్రులు. అహోరాత్రులూ ఋతువులూ మనిషి ఎంత రహస్యంగా ఏమిచేసినా తెలిసి సాక్షులుగా నిలుస్తారు.

కాని నీవుచేసిన పనికి అలాంటి పాపమేదీ రాకుండా నే నాశీర్వదిస్తున్నానన్నాడు. దేవశర్మ భార్యను రక్షించడానికి అంతయోగశక్తిని వినియోగింపవలసివచ్చింది.

## 3. పెండ్లిండ్లు - పుత్రులు

ధర్మరాజు : పెళ్లి-దాని ప్రక్రియచెప్పి, ఏది ధర్మం అనే విషయం చెప్పండి!

భీష్ముడు : ధర్మ దూరం కాని పెండ్లిండ్లు మూడు రకాలున్నాయి. (1) బ్రాహ్మ వివాహం (2) క్షాత్ర వివాహం (3) గాంధర్వ వివాహం. కుల, విద్యా, శీల, నైపుణ్యాలనుచూచి పిల్చి కన్యాదానం చేయటం మొదటిది. ఈ దానం తండ్రి చేస్తాడు. దీనివల్ల స్త్రీని ఒక దానవస్తువుగా చూడటంకాదు. మిగిలిన రెండురకాల్లో ఆ వధూవరుల ఇష్టమె ప్రధానము గనుక ఈ రకపు, వివాహంలో అది లేదనటానికిగాను తండ్రి కన్యను దానం చేయడం ఉన్నది. క్షాత్ర వివాహంలో వధూవరులిష్టపడినట్లయితె వారిపెండ్లి జరుపుతారు. అది రెండవది. కన్యయే వరుని ఎన్నుకొనే పద్ధతిని గాంధర్వ వివాహమంటారు. ఇవిగాక పిల్లనిచ్చినందుకు ధనం తీసికొన్నప్పుడు అది అసుర వివాహమవుతుంది. బలవంతంగా పిల్లనెత్తుకొని పోయివరుడు పెండ్లి చేసికొనటం, రాక్షసం, చివరి రెండూ ధర్మ దూరాలు. బ్రాహ్మణుడు, శూద్రజాతినుండితప్ప మిగతా జాతులనుండి పిల్లనుతెచ్చి వరుసగా, చేసుకోవచ్చు. క్షత్రియుడు క్షత్రియజాతి పిల్లనూ వైశ్యజాతి పిల్లనూ తెచ్చి వరుసగా చేసుకోవచ్చు. వైశ్యుడు వైశ్య జాతి పిల్లనూ శూద్రజాతి పిల్లనూ తెచ్చి వరుసగా పెండ్లి చేసికోవచ్చు. బ్రాహ్మణ క్షత్రియుల జాతులవారు శూద్రవనితల్ని తెచ్చి చేసికొనరాదు. ఎక్కడయినాఅందుకు వ్యతిరేకంగా పెండ్లి జరిగినా అలాంటిదికూడ చెల్లుతుంది. కనుక ఎవరినిపడితె వారిని పెండ్లిచేసికోవడమనేది ఎప్పుడూ పూర్వధర్మం ఒప్పుకోలేదు.

ధర్మరాజు : ఐతే ఆయా భార్యలకు కలిగిన సంతానం తండ్రి ఆస్తినెలా పొందాలి?

భీష్ముడు ; బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులకు చెందిన స్త్రీలకు పుట్టిన బ్రాహ్మణుని కుమారులు తమ తండ్రి ఆస్తిని 4:3:2:1 నిష్పత్తిలో పంచుకొనాలి.

క్షత్రియ, వైశ్య శూద్ర స్త్రీలకు పుట్టిన క్షత్రియ కుమారులు తమ తండ్రి ఆస్తిని 4:3:1 నిష్పత్తిలో పంచుకొనాలి. వైశ్యునికి వైశ్య శూద్రకులాలకు చెంది నస్త్రీలకు పుట్టిన కుమారులు 4:1 నిష్పత్తిలో పంచుకొనాలి.

బాబాయి చెప్పాడు-ఇప్పుడీ శాస్త్రం అమలులోలేదు. ఇప్పుడు ఎక్కువ పెండ్లిండ్లు మనిషి చేసికొననూ వీలులేదు-అథవా అలా చేసికొన్నా వారలకు పుట్టే కుమారులంతా (పెళ్ళి చెల్లినట్లయితె), లేదా అవరుద్ధ స్త్రీకి పుట్టినవారితోనహా కుమారులె అవుతారు గనుక వాటా పుచ్చుకోవచ్చు.

ధర్మరాజు : ఎన్నో రకాలయిన కొడుకులున్నారుకదా వారెవరు?

భీష్ముడు : పదమూడు రకాలవారున్నారు. ధర్మపత్నికి తనవల్లకలిగిన కుమారుడు ఔరసుడు. కూతురి పెండ్లి సమయంలో ఆమెకు పుట్టే మొదటి కుమారుడ్ని తన కుమారుడుగా ఇవ్వవలసిందని కోరి అలా పుచ్చుకొంటే కలిగిన కుమారుడు పుత్రికాపుత్రుడు. భార్య, యెవరో తెలియని వానివల్ల గర్భవతియై కన్న కుమారుడు గూఢజుడు. భార్యను తానే మరొకనివద్దకు పంపగా అందు వల్ల ఆమె కన్న కుమారుడు క్షేత్రజుడు. ఎవరో తలిదండ్రులు తమ పిల్లవాణ్ణి వదలివేస్తే తాను ఆ పిల్లవాణ్ణి తన కుమారుడుగా పెంచినట్లయితె అతడు అప విద్ధుడనే పుత్రుడవుతాడు. స్త్రీ తండ్రి యింట్లో ఉన్నప్పుడు పెండ్లి కాకముందు కలిగిన పుత్రుడు ఈ భర్తకు కానీనుడవుతాడు. గర్భిణిగానున్న స్త్రీనే పెండ్లిచేసి కొనగా ఆమెకు ఆ గర్భాన పుట్టినవాడు సహోఢుడు. భర్త పోయింతరువాత పుట్టినవాడు పౌనర్భవుడు. తనకై తానువచ్చి కొడుకుగా మునిషవాడు స్వయం దత్తుడు. తలిదండ్రులు తమ కుమారుని దత్తునీయగా ఆ దత్తుపొందిన తండ్రికి ఆ కుమారుడు దత్తకుమారుడవుతాడు.

బాబాయి చెప్పాడు-"ఇప్పుడిన్ని రకాల కుమారులను ఎవరూ లెక్క చెప్పరు. ఇప్పుడు ఔరసుడూ, దత్తుడూ మాత్రమె కుమారులు. మిగతావారు మోహ పుత్రులు మాత్రమె". అని "ఐతె అక్రమ సంతానమని రుజువు కానంతవరకూ పెండ్లి అమలయిన కాలంలో పుట్టినవారంతా ఔరస సంతానమనె లెక్క" అనికూడ అన్నాడు.

ధర్మరాజు : సహవాసం, స్నేహంవల్ల కలిగే స్నేహమెలాటిది?

భీష్ముడు : చ్యవనుడు ఒకప్పుడు నీటిలోనుండి జపం చేసికొంటున్నాడు. చేపలు చుట్టూచేరి ఉండేవి. బెస్తలు వలవేసి చేపలు పట్టినప్పుడు ఆ వల ద్వారా ఈయనకూడ బయటకు లాగబడ్డాడు. వారు ఆయన్ను క్షమించుమంటారు. అయనప్పుడు ఈ చేపల్తోపాటు తననుకూడ అమ్మివేయుమంటాడు. చేపలనూ తననూ విడదీయ వద్దంటాడు. వాళ్ళకు దిక్కుతోచక నహుషమహారాజు వద్దకు తీసికొనిపోతారు, నహుషుడు చ్యవనునికీ చేపలకూ విలువకట్టి బెస్తలకియ్యడానికి కొన్నికోట్ల ధనం విలువగా కట్టినా బ్రాహ్మణుడైన తనకా విలువ చాలా నట్లుగా ఉన్నాడు చ్యవనుడు. నహుషుడు ధర్మసందేహాన్ని బ్రాహ్మణుల్ని తీర్చవలసిందిగా కోరుతాడు. కలిజాతుడనే ముని, "బ్రాహ్మణునకు వెల ఒకగోవు అనిచెప్తాడు. నహుషుడు అవును చ్యవనమునికె దానమిచ్చి స్వర్గారోహణఫలం పొందుతాడు. స్నేహఫలం చిత్రమైంది అంటాడు.

## 4. పరశురాముడు

ధర్మరాజు : చ్యవనుని వంశంలో పరశురాముడు క్షాత్ర లక్షణాలతో కలుగడానికీ విశ్వామిత్రుడు బ్రాహ్మణ లక్షణాలతో క్షత్రియులలో కలుగడానికీగల అంతర్యమయిన కారణమేమిటి?

ఈ పరశురాముని జననం ఆ రోజుల్లో చాలా పెద్ద సమస్యా విషయం అనిపిస్తుంది!

భీష్ముడు విసువులేకుండా ఎలా చెప్తున్నాడివన్నీ అనిపిస్తుంది: అది భగవదిచ్ఛ అని చెప్పి తప్పించుకోవచ్చు. అది అబద్ధం కూడ కాదు. ఆయన మాత్రం పూర్వగాథ జ్ఞాపకం చేసికొని చెప్తాడు— ఒకసారి బ్రహ్మ "భృగు-కుశిక వంశాలకు సంకరమవుతుంది" అన్నాడు. ఆ మాటను చ్యవనుడు విన్నాడు. తాను భృగు కుమారుడు. కుశక వంశం క్షత్రవంశం. తన వంశానికి ఆ క్షత్ర వంశంవల్ల సంకరం రాకుండా తను చేయాలని ఉపక్రమించాడు. ఆ కుశికవంశాన్ని శపించటం ఒక మార్గం కదా! కాని శపించడానికి వారియందు తప్పు పట్టాలి. అందుకుగాను కుశిక వంశపురాజు వద్దకు వెళ్లాడు. ఆయన సతీసమేతుడై చ్యవనుని ఆదరించి అతిథ్యమిస్తాడు. చ్యవనుడు అన్నాడు; "నాకు శుశ్రూష చేయాల్సింది. నేను నిద్రిస్తాను. నేను లేచేవరకూ లేవకుండా

నా పాదసంవాహనం చేయాల్సింది మీరిద్దరూను" అంటాడు. వారు అలాగే ఆరంభిస్తారు. అలాపడుకొన్న వాడు 21 రోజులు కదలకుండా పడుకొన్నాడు. కుశిక దంపతులు సహనంతో ప్రేమతో తమ పరిచర్యను విడువక, నిద్రపోక, సౌఖ్యాలు పొందక శుశ్రూష నడుపుతారు. తరువాత చ్యవనుడు లేచి వెళ్ళుతూ ఉంటాడు. కుశిక దంపతులు వెనుక వెళ్తారు. అడివంతా తిరిగి హఠాత్తుగా కన్పడ్డం మానేస్తాడు చ్యవనుడు. కుశిక దంపతులు "అయ్యో ఏమయినాడో ఏమో"ననుకొంటూ ఇంటికొచ్చేటప్పటికి మళ్ళీ శయనంమీద పవ్వళించి ఉంటాడు ముని. వారు మళ్ళీ పాద సంవాహనానికి ఆరంభిస్తారు.

ఇలా శ్రమపెట్టి వారియందు తప్పు ఏదైనా ఉందేమో శపించాలని చ్యవనుడు వారిని పరీక్షకు పెట్టాడు. తలంటి నీరుపోయుమంటాడు వెంటనే కనుపడటం మానేస్తాడు. మళ్ళీ ఎప్పుడో అవుపడి పల్లకీలో ఉండినవాడై మీరిద్దరూ నన్ను మోయండంటాడు. వాళ్ళలా మోస్తుంటే ముల్లుకర్రతో వారిని పొడుస్తాడు. ఊరి బయటకు తోలుకుపోతాడు. ఇన్ని చేసినా వారికి వగపులేదు. చేయవలసిన కర్తవ్యం చేస్తున్నామన్న తృప్తి మాత్రమె ఉన్నది. ఇది చ్యవనుడు గమనించి సంతోషించి వాళ్ళను మెచ్చుకొని వరమడుగవలసింది ఇస్తానంటాడు. వారు నీ సేవకంటె మాకేమి కావాలి అంటారు. అప్పుడు తాను బ్రహ్మ చెప్పిన విషయం వారితో చెప్పి ఎప్పుడో ఈ ఘోరకలి జరుగకుండా ఇప్పుడే మీకు ఏ శాపమో ఇచ్చి సమాజ రక్షణం చేయాలని ఇంత చేశాను. మీరు అవకాశం ఇవ్వలేదు. కనుక మనం ఏమీ చేయకలిగిందిలేదు. "నా వంశంలో ఋచీకుడనేవాడు నీ కుమారుని పుత్రికను పెండ్లాడుతాడు. వానికి జమదగ్ని జమదగ్నికి పరశురాముడూ కలుగుతాడు. పరశురాముడు క్షత్రియ వంశాన్ని నాశనం చేస్తాడు. ఇది దైవేచ్ఛ, ఎవరూ ఏమీ చేయకలిగింది లేదు. నీ కుమారునికి బ్రాహ్మణ్యాగణ్యుడైన విశ్వామిత్రుడు జన్మిస్తాడుగాక" అని ఆశీర్వదించి వెళ్ళిపోతాడు. కనుక ఇది ఇలా జరగడం దైవేచ్ఛ అనేది మరువరాదు మంటాడు భీష్ముడు.

ఈ వంశాభిమానం కులాభిమానం పెరిగి పెరిగి మానవులందరూ ప్రతికే బ్రతుకు ఒక్కటేననే సమానత్వం దిగజారి సంకరం కూడదనే ధర్మం వచ్చి ప్రధానమై నిల్చింది. ఈ స్థితి పతనమా? అభ్యుదయమా అనే ప్రశ్న అనవసరం.

అప్పటి స్థితి అది! ఇప్పటి భావంతో పోల్చిదాన్ని గురించి మాట్లాడడం ఎన్నటా నిజం అనిపిస్తుంది.

## 5. దానఫలం

భీష్మణ్ణి ధర్మరాజు దాన విశేషాలేవో చెప్పవలసిందని అడుగుతాడు. దానం చేసేవారి మనసు త్యాగానికి తిరిగినదై మోక్ష పథానికి చేరుతుంది. తానిచ్చిన వస్తు విశేషంవల్ల కలిగే గౌణమైన ఫలం భౌతికమైంది. అలాచెప్పి, యేయే దానమిస్తే యేలాటి భౌతిక ఫలాలు లభిస్తవో భీష్ముడు చెప్పాడు.

అలంకరించిన గోవును దానమిస్తే చాల మంచిదంటాడు. అంతకన్నా గొప్పదేదంటాడు ధర్మరాజు! అడిగినవాడు కోరిందాన్నివ్వటం గొప్ప అంటాడు. ఈ సమాధానాల్లోని ఆంతర్యం స్పష్టంగా శుద్ధాంతః కరణమనేది భారతం విన్నవాళ్ళకు తెలుస్తూ ఉంటుంది! యుద్ధంలో చచ్చేదాకా పోరాడటమే గొప్పదయితే - శరణన్నవాణ్ణి రక్షించడం ఇంకా గొప్పదంటాడు. అడగకుండా లేమిడినే అనుభవిస్తున్న వానికీయటం అడిగినవానికీయటం కంటె గొప్పది. భూదానం, అన్నదానం జీవితాన్నేదానం చేసినంత ఫలం. ఒక్కొక్క సందర్భంలో, చంద్రుడే నక్షత్రంలో ఉన్నప్పుడేదానం చేస్తే ఏమేమి పుణ్యమో కూడ వరస చెప్పాడు.

ఎన్నిచెప్పినా దానం చేయడంలో గల శ్రద్ధ ముఖ్యమన్నాడు. నృగుడు ఒక గోవును ఒక బ్రాహ్మణునకు దానమిస్తె అది తిరిగివచ్చి నృగుని మందలో కలుస్తుంది. నృగుడు దానినె ఇంకొకరికి ఇచ్చేస్తాడు. అది అదివరకె దానమై పోయి తిరిగివచ్చినట్లు అతడికి తెలీదు, ఇది సుపథదానం కాదన్నాడు భీష్ముడు. ఇద్దరు బ్రాహ్మణులకూ ఈ గోవు విషయంలో తగాదా వచ్చింది. ఆ గోవును వదలుకోడానికి ఒక్కడికీ సమ్మతం కాలేదు. చివరకు నృగుని శపించి ఆ బ్రాహ్మణులు వెళ్ళిపోతారు. ఆ శాపవశాన నృగుడు ఒక పెద్ద ఉడుమై బావిలో నిలిచి ఎంతోకాలం ఉండాల్సి వచ్చింది. చివరకు ఎప్పుడో శ్రీకృష్ణుడువచ్చి ఆ బావి నుంచి ఉడుమును తీయడం అయింది. అలా చేసి శ్రీకృష్ణుడు అక్కడి యాదవులకు చెప్తాడు: "ధరణీ సుత ధనహరణము, దురితతమము" అని, అది

ధనహరణమవుతుందా? అంటే శ్రద్ధ తక్కువ తనమవుతుందిగదా - అదిచాలు అన్నారు.

ఉద్దాలకుని కుమారుడు నచికేతుడు. ఉద్దాలకుడు తన సొమ్ములన్నీ వరసగా దానం చేస్తూ ఉంటాడు. నచికేతుడు వెళ్ళి నన్నెవరికి దాన మిస్తావని పదే పదే తండ్రినడుగుతాడు. కుమారునిపై మమకారం తండ్రికి పోలేదు. కుమారుడు తండ్రికంటె ఎక్కువ జ్ఞాని, మళ్ళీ మళ్ళీ అడిగాడు. తండ్రికి కోపంవచ్చి "నిన్ను యముడికిచ్చానుపో పో"మ్మన్నాడు. మహాత్ముడైన నచికేతుడు అప్పటి కప్పుడు యముని సదనానికి వెళ్ళిపోయినాడు. యముడతడ్ని ఆదరించి అక్కడి విశేషాలు చూపి పరమార్థ తత్త్వం బోధించి తిరిగి మీ తండ్రి వద్దకుపోయి ఆయన్ను సంతోషపెట్టు" మని పంపివేస్తాడు. నచికేతుడు తిరిగివచ్చి తండ్రితో చిత్రమైన విషయం చెప్తాడు, గోవుల దానం చేసినవారి పుణ్యం అక్కడా పర లోకంలో పెద్దకొండలుగానై పెరిగి తనకు అవుపడింది" అని చెప్తాడు.

బ్రహ్మ ఇంద్రునితో గోదాన పరులు గోలోకానికి వెళ్తారని చెప్పి-అది-పంతో విశిష్టమైన లోకమనికూడా చెప్తాడు.

ఇలా భీష్ముడు గోదాన మహిమను గూర్చి ఇతిహాసాలను ధర్మరాజాదులకు చెప్తాడు.

ఇది ద్వితీయాశ్వాసము



# మహాభారత కథలు

## అనుశాసనిక పర్వం- తృతీయాశ్వాసము

## 1. గోదాన విధి

భీష్ముడు ధర్మరాజుకు అనుష్ఠేయాలయిన ధర్మాలను చెప్తున్నాడు! ఈ ధర్మాలకు, నియమం, వేదాధ్యయనం, స్వధర్మ కర్మలు పాటించటం, ఇంద్రియ జయం, సత్య నిరతి, దానం, బ్రహ్మచర్యం మాతాపితల శుశ్రూష గురు శుశ్రూష, గోవ్రతం పరమ ముఖ్యమని చెప్తాడు.

ధర్మరాజు గోదానవిధి ఏదో చెప్పుమంటాడు. భీష్ముడు బృహస్పతి మాంధాతకు చెప్పిన ఆ విధిని చెప్తాడు:

అశ్వయుజ బహుళాష్టమి నాటికి మూడు రోజులముందే గోష్ఠంలో ఉండి పేడ, పంచితం పాలులపై నాధారపడి పవిత్రుడై యుండాలి. ఆ పర్వదినాన అహోరాత్రాలూ గోష్ఠంలోనె ఉండి అవును ఆహ్వానించి "తల్లిగోవు - తండ్రి వృషభం - గర్భప్రదేశం దివము" అనే మాటలు పఠించాలి. పాపంలేని వానికి వ్రతశీలునికి, శాంతునికి అక్రోధనునికి ఆయావుతోపాటు అర్పించాలి. ఆయనకు ఆ గోవును దానమిస్తూ "ఈ గోవు నా సకల కల్మషాలనూ త్రెంచి, నన్ను సౌఖ్యాలలో తేల్చుతుంది" అని చెప్పాలి. నీళ్ళు ఆయన చేతిలో వదలాలి. దానానికి కపిలగోవు మంచిది.

'కపిల' అంటె చెవులు, కొమ్ములు, కళ్ళు ఖుర నాసికాపుటాలు నల్లగా కలిగియున్న ఆవు అని అర్థం. గొంతూ ముష్కాలమొకటీ నల్లగా ఉంటే ఆ యావు కపిలయేనని వ్యాసమహర్షి వ్రాశాడు. ఈ నలుపును గూర్చినకథ ఏమంటే,—

బ్రహ్మ ఇచ్చిన అమృతంవల్ల దేవతలకున్న ఆవులన్నీ తెల్లనివె కాని ఆవుదూడలు ఆ అవుల పాలుత్రాగి ఎగురుతుంటే 'వాటి నోటి నురుగు హిమగిరి సానువుల్లో తపసు చేస్తున్న శివునిపై పడింది. ఆయన మూడోకంటితో వాటిని చూశాడు. ఆ వేడికి ఆ యావులు కపిల అవులైపోయినయి, దేవతలు:చి!

శివుని క్షమాపణవేడి, వృషభాన్ని ఆయనకు కానుకగానిచ్చి సంతోషపెట్టారు. శివుడు ఆ కపిలగోవులకు ఎక్కువ మహత్త్వాన్నిచ్చాడు.

అదిగాక, ఒకసారి దేవతలతో స్పర్థచేసి అగ్నివెళ్ళి గోవులమధ్య దాగొంటాడు. ఆ అగ్నివేడికి గోవులు నల్లబడినయి. అగ్ని కపిలలకు మహత్త్వమిచ్చి వాటిని దానమిచ్చినవారికి సర్వపాపాలూ నశించి పుణ్యం కలుగుతుందని వరమిస్తాడు.

గోవుల్ని కొల్చినవారికి స్వర్గం కలుగుతుందని బ్రహ్మ చెప్పాడు. గోపంచితం, పేండ ఆరగించడంవల్ల, బ్రహ్మహత్యాపాతకాలు పరిహారమయ్యే ఉపాయం ఉందన్నాడు. సాధుజంతువులైన వీటిసేవవల్ల బ్రహ్మహత్య చేయటంలో కలిగిన అహంకారం శమం పొందటానికి అవకాశం కలుగుతుంది. వాటితో సమమయిన జీవులమె మనమున్నూ అనే సాధుస్మృతి కలగాలని అర్థం.

గోమతీ పఠనం గోష్ఠంలోచేస్తే కోరికలు సిద్ధిస్తవి అన్నారు. గోలోకం బ్రహ్మలోకంకంటె పైనఉన్నట్టిది. అక్కడికి వెళ్ళటం గోవులకూ మనుష్యులకూ కూడ పుణ్యఫలమె. సుమిత్రుడనే మునియొక్క గోవులు గోలోకం వెళ్ళటానికి యజ్ఞపశువులు కావటమె ప్రధానమని యెరిగి, రంతిదేవుడప్పుడుచేస్తున్న యజ్ఞంలో తాము యజ్ఞపశువులుగా వచ్చామని తమ్మతాము సమర్పించుకొని, గోలోకం వెళ్ళ కలిగినయి. అక్కడ తమ యజమానియైన సుమిత్రునీ రంతిదేవునీకూడ అవిచూచి సంతోషిస్తయి.

కపిలగోవుల నారాధించడంవల్ల స్వధర్మచ్యుతులైనవాళ్ళకూడ పాపరహితులవుతారు అని వ్యాసుడు శుకునకు చెప్పాడు.

ధర్మరాజు, గోవులున్నచోట లక్ష్మి ఎందుకుంటుంది అన్నాడు. అందుకు భీష్ముడు,—

ఒకసారి లక్ష్మి తానె వెళ్ళి గోవుల్లో చేరింది. గోవులు ఆమెను "నీవెవర" న్నాయి. లక్ష్మి చెప్పింది. అప్పుడవి, "నీవు చంచలవు మాలోకి రావద్దు" అంటవి. లక్ష్మి వగపొందింది ఆ తిరస్కారానికి. అప్పుడామె వాటిని ప్రతిమాలి అలా నిరశిస్తే తనకింకెక్కడా తావుండదు గనుక వాటి మూత్రపురీషాదుల్లో

నిల్చి ఉండేందుకు అనుమతికోరి అలా ఉంటున్నది. గోవునకు అందువల్లకూడ ప్రకాస్తి కలిగింది.

గోదానం తరువాత సువర్ణదానం గొప్పదన్నాడు భీష్ముడు. శివుని వీర్య మెసువర్ణం. ఆ వీర్యాన్ని అగ్నిభరించాడు కొన్నాళ్ళు. అందుకె శ్రాద్ధానికి ముందుగా అగ్నిహోత్రుని పూజించటం ఏర్పాటు చేశారు. తరువాత అగ్ని దాన్ని గంగకిచ్చాడు. గంగ రెల్లుదుబ్బుల్లో ఉంచుతుంది. అందువల్ల అక్కడ శరవణ ఉదయించాడు, అతడే దేవతల సైన్యాధిపతియై తారకాసురుణ్ణి చంపాడు. ఆ శివుని వీర్యమె భూమియందు చేరి బంగారమయింది. దానిని దానం చేయ టం పుణ్యం అన్నాడు భీష్ముడు.

## 2. అపరిగ్రహం

దానం పొంది దానశీలుని పాపాలను క్షయింపజేయటం ఒక ధర్మం. అయితె అపరిగ్రహమనేదికూడ ఒక శిష్టనియమమె. ఈ అపరిగ్రహమును గూర్చి ధర్మశాస్త్రాల్లో ఏముందో తెలియచెప్పుమని ధర్మరాజు భీష్ముని అడుగు తాడు. భీష్ముడప్పుడు సప్తఋషులూ-వృషాదర్భి అనే ఇతిహాసాన్ని చెప్తాడు.

సప్తర్షులు అపరిగ్రహులు. వారేదిచ్చినా పుచ్చుకోరు. ఒకప్పుడు కరువు వచ్చింది. వారు అనాథప్రేతను తిని ఆకలి నాపుకోవాలని ప్రయత్నిస్తున్నారు. అక్కడకు వృషాదర్భి అనే రాజు వేటకైవచ్చి వారిని చూచి వారికి తాను తిండి నిస్తాననీ రావలసిందనీ ఆహ్వానిస్తాడు. వారు నిరాకరిస్తారు-తాము అపరి గ్రహులమంటూ. రాజు అసంతలసు వెళ్ళి కోపగించుకొని కృత్తి అనే ఒక రాక్ష సిని సృష్టించి వెళ్ళి సప్తర్షులను హింసించుమంటాడు.

అప్పటికి సప్తర్షులు తామంతతూండ్లు తినడానికి తెచ్చిపెట్టుకొని స్నానా నికై సరస్సులోకి వెళ్ళబోతూ ఉంటారు. కృత్తికి సప్తర్షులు వీళ్ళవునో కాదో తెలీదు. ఇంద్రుడు మారువేషంతో శునస్సఖుడనే పేరుతో అక్కడకువచ్చి వారితోపాటు స్నానానికి తయారవుతూ ఉంటాడు. కృత్తివచ్చి అందర్నీ మి మీ పేర్లు చెప్పుమంటుంది. సప్తర్షులు దీనితత్త్వం తెలిసినవారై తమపేర్ల వ్యుత్పత్త్యర్థం తెలిసికొంటేగాని తెలీని విధంగా చెప్తారు. ఇంద్రుడు మాత్రం దానినెత్తిన కొట్టి చంపివేసి ఋషులకు సహాయం చేస్తాడు.

కాని ఇంద్రుడు ఆ తామర తూండ్లను కనపడకుండా చేస్తాడు. ఋషులు స్నానం చేసివచ్చేటప్పటికి ఆ తూండ్లు అక్కడలేవు. ఎవరికివాళ్ళు ఆ తూండ్లను తాము తీయలేదని ప్రతివాళ్ళు ప్రమాణం చేయాలన్నారు: వాళ్ళుచేసిన ప్రమాణాలు చాల చిత్రమైయ్యుండి మనకు తెలియని కొన్ని కర్మలను పాపాలుగా చెప్పినయి. వారు అవిచేసిన కర్మానికి బద్ధులమైపోతామంటారు,

అత్రి సూర్యునివైపు తిరిగి మూత్రపురీషాలు విసర్జించిన పాపానపోతానంటాడు. వశిష్ఠుడు సన్యాసస్థితిలో కాముకుడైన పాపానా కుక్కను పట్టుకు తిరుగడం అనే పాపాన పోతానంటాడు. గౌతముడు కుమార్తె నమ్ముకొన్నవాని పాపానపోతానంటాడు ఇంకొకరు శరణాగతుని వదలినవాన పాపానా దానమిచ్చే వాడి దరిద్రత చూచికూడ ఆతడ్ని యాచించేవాడి పాపానకూడ పోతానన్నారు. కశ్యపుడు, తానా తూండ్లు తీసియున్నట్లయితె వృధాగా మాంసం తిన్నవాణ్ణి సభలో పక్షపాతంతో పలికినవాణ్ణీ అవుతానన్నాడు. భరద్వాజుడు-జ్ఞాతులు గోవులు, కోతులు వీళ్ళ విషయంలో క్రూరుడై ప్రవర్తించినవారి పాపానపోతానన్నాడు. జమదగ్ని భార్య ముట్టయి యుండగా ఆమెను గవసిన పాపానపోతానన్నాడు.

చివరకు శునస్సఖుడివంతు వచ్చింది. [illegible] ప్రమాణం చేయుమంటారు. అతడు : "నా పుత్రికను ఛందోగునకూ యజ్ఞం చేసేవానికీ వివాహం చేసిన ఫలానపోతా" నంటాడు. ఇందులో పాపంలేదు- పైగా పుణ్యముంది. కనుక-నీవే ఆ తూండ్లను దాచి వేశావు అని అంతా అంటారు.

అప్పుడు ఇంద్రుడు ప్రత్యక్షమై కృత్తిని చంపడానికి తానట్లా వచ్చినట్లూ తానెవరో తెలియవద్దానికి తూండ్లను దాచి ఈ విధంగా నాటకమాడినట్లూ చెప్తాడు. చివరకు వారిని దేవలోకానికి తీసికొని వెళ్తాడు.

ఈ కథలో కేవలం ధర్మాలను కొన్నిటిని చెప్పాలనే అభిప్రాయంతోనే వ్యాసుడుగాని వైశంపాయనుడుగాని శ్రౌతిగాని చెప్పి ఉంటారా అనిపిస్తుంది. వ్యాసుడు మోక్షమార్గానికి ఏదో పద్ధతిని చేర్చి మరీ కథలు వ్రాశాడు. జనమేజయునూ శ్రౌతి కాలంనాటికి ధర్మాలే గట్టిగా చెప్పాల్సిన అవసరం కలిగి-మరి వారు ఇలా కథలు చెప్పారేమొ బహుశ, వ్యాసమహర్షి వ్రాసియున్నట్లు

యితే ఇందులో మోక్షమార్గ విషయం ఉండి ఉంటుంది. దాన్ని మనం ఇంకా శోధించాలేమొ.

## 3. శుచి-ఆదిధర్మాలు

ధర్మరాజు భీష్ముని అడుగుతాడు: శూద్రునకు అవస్యం అనుష్టింప వలసిన ధర్మమేమిటో చెప్పండి అని. అందుకు భీష్ముడు వ్యాసముని తన శిష్యులకు చెప్పిన సంగతులను జ్ఞాపకంచేసికొని చెప్తాడు.

శూద్రుడు తప్పక చేయవలసిన ధర్మం,-ఇంద్రియాలను గెలిచి కామ క్రోధాలను నిర్జించి మిగతా సామాజికులయెడ భక్తిభావం కలిగి శుశ్రూషాప రుడై ఉండడమె. మిగతా అనగా తానుకాని ఇతరులని అర్థం- కులాల ప్రసక్తి కాదు- ఇంద్రియాలను జయించి షడ్వర్గాలను నిర్జించడమనేది సర్వజనులకూ అవస్యంగా చేయవలసిన నిష్ఠ. వర్ణాశ్రమ ధర్మం అదే!! అలా ఉండటంవల్లనె ఇహపర లోకాలల్లో అతడికి (వ్యక్తికి) అభివృద్ధి కలుగుతుంది. లేకపోతె దుష్ట ఫలం కలుగుతుంది.

రెండవది శౌచవిధి. ఇదికూడ సర్వులూ అనుసరింపవలసినదే. మిగిలిన వారికి ద్విజులకు సంధ్యావందనాది మంత్ర సంబంధమైన నిత్యయజ్ఞాలు చేయ వలసిందని ప్రత్యేకంగా చెప్పి దానిని అందులో భాగంగా చేశారు. మంత్రో చ్చారణాభాగం శూద్రులకు చెప్పలేదు గనుక శుచి అనేది ప్రత్యేకంగా వారికి తిరిగి చెప్పారు. మలమూత్రాలు విసర్జించేటప్పుడు రాత్రుళ్ళు దక్షిణానికి తిరిగిన్నీ పగలు ఉత్తరానికి తిరిగిన్నీ విసర్జించాలి. ముందుగా శరీరాన్ని మట్టితో శుభ్రం చేసి ఆ తరువాత నీరు తొడల పైబాగాన జల్లుకొనాలి. మూడు సార్లు మృత్తికతో తుడిచి ఆ తరువాత కడగాలి. ఎడమచేతిని క్రింద రుద్ది మన్నుతో శుభ్రంచేసి నీటితో కడగాలి. తరువాత రెండుచేతులూ శుభ్రమైన నీటితో కడగాలి. కాళ్ళు కడగాలి. ఆచమనం చేయాలి. జనులు చూస్తూండగా మూత్ర పురీషాలు విసర్జించకూడదు.

ఇవన్నీ నీళ్ళు సమృద్ధిగా ఉన్నచోట! పూర్వం నీళ్ళు లేనిచోట కాపురాలు చేసేవాళ్ళుకారు.

ఆచమనం ముమ్మారుచేస్తే ఋగ్యజుస్సామ వేదాలు సంతసిల్లుతవి. ముఖం రెండుసార్లు నీటితో తుడవాలి. అందువల్ల అథర్వవేదమూ ఇతర ధర్మ శాస్త్రాలూ తృప్తినొందుతయి. నీరు పాదాలమీద చేతులమీద శిరస్సుమీద చల్లు కొని కళ్ళు ముక్కు చెవులు హృదయం స్పృశించటంవల్ల దేవతలు తృప్తి నందుతారు. ఈ ఆచమనం అంతా చేయవచ్చు. శూద్రులు పెదవులు తుడుచు కొన్నాచాలు. (ద్విఃపరిముజ్య సకృతుపస్పృశ్య యత్‌సవ్యం పాణింపాదౌప్రో క్షతి శ్శిరః అనే మంత్రార్థమిది.)

బ్రాహ్మణునకు జపయజ్ఞం, అధ్యయనం చేయటం ధ్యేయం. రాజు యజ్ఞాలను చేయాలి. వైశ్యుడు హవ్యయజ్ఞంచేస్తూ విక్రమోప జీవనం చెయ్యాలి శూద్రులు సమాజస్తులకు పరిచర్య చేయాలి. తమ కులంవారికి అక్కర్లేదా? అని శంక. అక్కర లేదని కాదు. తనకులస్థులూ సమాజస్థులేకదా!

సేవలు చేయడమంటే Services అన్నీ అవె. ఉద్యోగి వర్గాలు, మోటారు సర్వీసులు, రైలు సర్వీసు ఇవన్నీ సేవలేననేది మరువకూడదు. కాళ్ళు పిస కటం వంటి న్యూనమైన అర్థం మాత్రమే ఏ శాస్త్రం కూడ చెప్పలేదు. శూద్రు లకు అనేక రకాలయిన వృత్తులు కేటాయించబడినయి కుండల సరఫరా, కమ్మ రపు వస్తువుల సరఫరా, క్షురకర్మ చేయటం, పొలాలు పనిచేయటం, ధాన్యం సరఫరా ఇవన్నీ సేవలే. వీటిని వీరు నడపటమె ఉద్దేశించారు ఆరోజుల్లో. ఈ సేవలు వీరీయకపోతె సమాజం నడక ఎలా కుంటుపడుతుందో తోటి మానవు డేమైపోతాడో తెలిస్తె ఈ నియమంలోని కీలకం బోధపడుతుంది. బ్రహ్మక్షత్రియ వైశ్యులకు ప్రత్యేకమైన వృత్తులు చెప్పి మిగిలిన వృత్తులన్నిటినీ అవలంబించే శూద్రులకు సాధారణంగా సేవలు చేయాలి అనటంలో ఏ దురుద్దేశ్యమూ లేదు.

ఇక 'యతి' అయిన వ్యక్తికి శాకీరక శుశ్రూష చేయాలనటం చూస్తాము. ఎందుకనంటే 'యతి'కి గల గుణాత్మకమైన ప్రత్యేకతను విప్పి చెప్పడానికె అలా అన్నారు. యతులు శ్రుతి స్మృతి విహితా చారులు అవడంవల్ల వారికి శుశ్రూష చేస్తే మనుష్యులు తరిస్తారని బోధ.

క. దానోప వాసముల నన్మానిత గతిలేదు శూద్రులకు - యతిదెన స
మ్మాననమున తత్పూజాధీన రతింగాని యెన్ని తెరువుల చూడన్

గుణ కర్మశః ఈ వర్ణ విభాగం భగవంతుడు చేశానని చెప్పినా మనుపు శాసనం వల్ల జన్మరీత్యానే ఈ కులాలు ఆస్తిగా సంక్రమించటం కలిగింది. మనుధర్మ శాస్త్రం తెచ్చిన ఈ మార్పును ఒక్క రాజు తప్ప (శాసనసభ) ఇంకెవరూ కాదనడానికి అవకాశం లేకపోయింది. అందుకె ధర్మరాజుకు ఇన్ని సందేహాలు కలిగినయి. ఆయన భీష్మనేకాదు, మార్కండేయుని ఇంకా ఇతర ఋషులనూ కూడ పృచ్ఛించాడా విషయాల్నిగూర్చి ఎన్నోసార్లు!

సర్వవర్ణ ధర్మం పారాశర్యుడిలా చెప్పాడు :

సీ. పరధనంబుల కానపడక యొల్లను తన యట్లు కాజూచుచునఖిలవస్తు వులు దోచు-నదగు-వీచుల చందమున - మెఱుం గుల భంగినని కనుగొనుచు నెందు నాసక్తిలేక భూతాళిపై దయగల్గి నడచుట హితము....

ఈ నీతి అందరూ పాటించారా అనేది మరచిపోరాని విషయము. మంత్రోచ్చారణంతప్ప శూద్రునకైనా - పరమోత్కృష్టమైన సాధనలన్నీ చెప్పడమయింది.

వ్యాసుడు ఆ తరువాత పాపాలను పోగొట్టుకోడానికిగాను కొన్ని ప్రాయశ్చిత్త విధులు చెప్పాడు ఇవి తమ పాపాలకు మనసులో పరితాపపడే వారికే గాని, పశ్చాత్తప్తులు కానివారికి కాదన్నాడు.

చావు ఎప్పుడు రావచ్చునో తెలిపె కొన్ని సూచనలు చెప్పాడు. అ శకునాలు కన్పడినప్పుడు ఈ తృష్ణాకలితమైన సంసారంమీద సంగం వదలాలి- హృదయం ఏకాగ్రం చేయాలి. మునీంద్రునికుండే నిర్మలతతో ధ్యానం చేయాలి. అలాంటి అంతరంగం సంతరించుకొంటె బహుజన్మల ద్వారా అభివృద్ధి పొందుతాడు జీవుడు. ఐహికాలు అశాశ్వతాలని ఎరిగి యతియై సంసార సాగరాన్ని తరించాలి. అందుకుపయోగిస్తవనె ఈ శకునాల సూచనలు చెప్పారుట.

భీష్ముడు శూద్ర ధర్మ విషయం ముగిస్తూ అన్నారు: అలాంటియతినిగొల్చిన శూద్రుడు వాని అనుగ్రహం వల్ల విగత కల్మషుడై మంగళమును పొందుతాడు. అన్ని వర్ణస్థులకూ ఇంద్రియ నిగ్రహం మొట్టమొదటిది. దానివల్ల-ఇంక దేనికీ

అనపడకుంటే - అనామయమైన సాధన తెలుస్తుంది. అన్ని వర్ణాల వారికీ స్త్రీలకూ కూడ ఇది లభ్యమయేదే. పాపులు సంస్కృతమైన పనులు చేసి పాపం తగ్గించుకోవాలి. అప్పుడె జ్ఞానోదయమయేది. బోధ తెలుస్తున్న కొద్దీ శాంతిని వృద్ధి చేసుకొనాలి. అందుకె కడుపును, శిశ్నాన్ని, ధృతిని, కాళ్ళను చేతులను అదుపులో పెట్టుకోవాలనటం! మనసులోపలికి-వాటిని లాగేసుకోవాలి. మనసును బుద్ధిలో చేర్చాలి. అపుడు ప్రబోధం కలుగుతుంది. అప్పుడు 24 తత్త్వాలనూ తెలిసి పరమాత్మ నెఱుగకలుగుతాడు. గురు శుశ్రూషచేత నాల్గు వర్ణాలవారికీ మోక్షం సమకూరుతుందని పారాశర్యుడైన వ్యాసుడుచెప్పినట్లు భీష్ముడు చెప్పాడు.

ఇంతెందుకు - ఇంద్రియ నిగ్రహం కలిగినవారూ ధర్మార్థ కామాల్ని చక్కగా నడిపేవారూ నిజదారతృప్తులూ తపోధనులూ సత్యవ్రతులూ పరమ శౌచులూ, గూఢధర్ములూ వీళ్ళు ఇంద్రునికి శిరోధార్యులు-అన్నాడు.

ఇది తృతీయాశ్వాసము



# మహాభారత కథలు

## అనుశాసనిక పర్వం- చతుర్థాశ్వానము

## 1. ఆచార ధర్మాలు

పూర్వపు ఆచారాలూ వాటికి అనుబంధించిన ధర్మాలూ మహాభారతంలో వేదవ్యాసుడు వ్రాశాడు. అవి ఆయా పరిస్థితులకు తగిఉన్నట్టివి. వాటి అంత రాంతరమైన భావాన్ని మాత్రం తెలిసి జీవితం నడుపుకోవటం అవసరం.

ధర్మరాజు భీష్ముని ధూపదీప నైవేద్యాల ఫల విశేషాలు చెప్పవలసిం దంటాడు. భీష్ముడు నారదుడు తనకు చెప్పిన విషయాలు చెప్తాడు.

"ధూపదీప నైవేద్యాలు దేవతలకూ యక్షులకూ రాక్షసులకూ కూడ ఇస్తారు. ఓషధులనూ అమృతాదులనూ ఇస్తారు. వాటిలో పుష్పాలు ఎక్కువ మేలుచేస్తాయి. పూవుల్ని దానమీయడంవల్ల మంచి మనసు కలుగుతుంది. రాక్ష సులకు ముళ్ళలో పుట్టిన పుష్పాలూ, దేవతలకు తెల్లనివీ పచ్చనివీ అయిన పుష్పాలూ ఇష్టం. ధూపానికి గుగ్గిలం మంచిది. కర్పూర ధూపం అన్నిటికంటె మంచిది. దీపం పెట్టడానికి ఆవునేయి అవసరం.. దేవతలకు నైవేద్యమిచ్చిన తరువాతనే తాను భోజనం చేయాలి. లేకపోతే దేవతల సొమ్ము దొంగతనం చేసిన వాళ్ళమే అవుతామనేది భారతీయ సంస్కృతి.

నహుషుడు అలా ధూపదీప నైవేద్యాలతో దేవునీ పితృదేవతల్నీ ఆరా ధించి తేజస్సుసుపొంది మునులచేత తాను పూజింపబడ్డాడు. దీపారాధనం చేసిన ఆచారం కారణంగానే అతడు తన ఇంట్లోకి వెళ్ళినట్లుగా బ్రహ్మసభకు వెళ్ళేవాడట.

ధర్మరాజు సర్వ సందేహాలూ తీర్చుకోవలసిన సమయం అని నమ్మి తనకు కలిగిన శంకను వెంటనే భీష్ముని ప్రశ్నిస్తుంటాడు. బ్రాహ్మణ ధనాన్ని అపహరించినవాడే గతి నందుతాడు అని! బ్రాహ్మణుడనగా బ్రహ్మపదార్థ తత్వ సాధకుడు గనుక అతడికి అపచారం చేసిన వాడిగతి ప్రత్యేక మనేది ఇక్కడి బోధ. మిగతావాళ్ళ ధనం అపహరింపవచ్చుననికాదు!.

భీష్ముడు దానికొక కథ చెప్తూ- ఒక బ్రాహ్మణ బాలకుడు అన్నంమూట విప్పాడు. తినడానికి ముందు నీళ్ళల్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కొని వచ్చాడు. ఈలోగా, ప్రక్క భూమిలోని దుమ్ము వచ్చి అన్నంమీద పడింది,- ఆ అన్నాన్ని అతడు తిన్నాడు. ఆ ప్రక్క భూమి ఒక బ్రాహ్మణునిది. అందుచేత ఆ బాలుడు బ్రాహ్మణుని సొమ్ము తిన్నవాడైనాడు. ఆ కారణంగా అతడికి చండాలజన్మ కలిగింది అని చెప్పాడు. ఐనా పూర్వ పుణ్య వశంచేత పూర్వజ్ఞానం కలిగి ఉన్నాడట. తన ఆ కథను ఇతర్లకు చెప్పటం ద్వారా పాపవిముక్తుడై తరువాత సజ్జన జన్మడైనాడు. అందుచేత ఆ పాపం అంత కఠిన ఫలితం కలిగింది" అన్నాడు.

ధర్మరాజు : స్వర్గంలో అందరికీ ఒకే రకమయిన సుఖమా ఎరివ ఇష్ట మొచ్చిన సుఖాన్నే వారు పొందవచ్చా?

భీష్ముడు : ఎవరికి తగిన సుఖము వారే అనుభవిస్తాడు. అదీ వారి పుణ్య ఫలమె. ఒకప్పుడు మతంగుడనే మునిని ఇంద్రుడు స్వర్గాని కాహ్వానించాడు. ఎందుకనంటే మతంగుడు పుణ్యాత్ముడు. అతడు ఒక ఏనుగు పిల్లను పెంచుతూ దాని స్నేహంతో ఎంతో సుఖాన్ని పొందుతూ ఉండేవాడు. ఒకసారి ఇంద్రుడు మారువేషంతో ఆదేశపు రాజులా ఆ మతంగుడి దగ్గరకు వచ్చి ఆ యేనుగను రాజైన తన కిమ్మంటాడు. మతంగుడు కాదనలేక, ఆ రాజును యముని సభకు రావలసింది-అప్పుడు ఇస్తానంటాడు. ఇంద్రుడు, పాపాత్ములు వెళ్ళే ఆ చోటికి నేను రానంటాడు. వెంటనే ఆకాశగంగ ఒడ్డుకు రావలసిందని మతంగు డంటాడు. ఇంద్రుడు, అది కృతఘ్న్యాత్ములు అతిథికి పెట్టి తరువాత వారు భుజించే చోటు నేను రానంటాడు. వెంటనే మతంగుడు అయన్ను ఇంద్రుడని తెలిసికొని "నీవు మహేంద్రుడవైయ్యుండి ఎక్కడకు వెళ్ళలేనంటావు?" అంటాడు. ఇంద్రుడు ఆశ్చర్యపడి వేషం మార్చి మతంగుణ్ణి ప్రశంసించి స్వర్గానికాహ్వానిస్తా అక్కడకూడ ఈ ఏనుగు పిల్లను ఉంచుకొని సంతోషించుదువుగాక అన్నాడు. అందుచేత స్వర్గంలో కూడ వివిధమైన సుఖాలు ఉంటయి. తగినవి.

ధర్మరాజు :-తపను అంతగొప్పదిగదా! అసలు తపనంటే ఏమిటి?

భీష్ముడు : నియతాశనుడై భగవన్నిష్ఠ చేసేవాడు తపసి. భగీరథుడు ఆకలి బాహములను కూడ తీర్చుకోకుండా యజ్ఞాలకు విఘాతాలు కలిగించే

వారితో యుద్ధంచేసి వాటిని రక్షించాడు. ఆ పుణ్యంవల్ల అతడు నేరుగా బ్రహ్మ సభకు వెళ్ళగలిగాడు. దానికి కారణం అతడి నియతమైన తిండితో తృప్తిపడి యాగాలను రక్షించడమే! బ్రహ్మ భగీరథునకు అర్ఘ్యమిచ్చి అర్చిస్తాడు.

ధర్మరాజు : నూరు సంవత్సరాలు బ్రతకాల్సిన మనుష్యులు చిన్నతనం లోనే చావు నందుతూ ఉంటారెందుకని?

భీష్ముడు : ఆచారంవల్ల ఆయువు పెరుగుతుంది- అనాచారంవల్ల ఆయువు తరిగిపోతుంది. ఆచారవంతులకు శ్రీ, కీర్తిలు పెరుగుతూ ఉంటవి. ఈ ఆచారం నియమం అనే వాటికి ప్రత్యేకమైన శాస్త్రమేదీ లేదు. వర్ణాశ్రమాచారాలు చెప్పూనే ఇవీ ఇమిడ్చి చెప్పారు. ఈ ఆచారాలను వాటినుంచి గ్రహించి అనుస రించాలి. అవి అన్నీ సంక్షిప్తంగా చెప్తాను. ఐనా ఇవి చెప్పితే విని అనుసరించటం కంటె శిష్టులను చూచి వారు చేసినట్లు, చెప్పినట్లు అనువర్తించటం వల్ల బాగా తెలుస్తుంది. ఐనా విను. గురుధిక్కారం, దుశ్శీలత, పిట్టలను చంపటం, గోళ్ళు కొరకటం, సంధ్యా కాలంలో సూర్యుని చూడటం చేయరాదు. క్రోధం, హింస, అబద్ధం చెప్పడం వదిలేయాలి. ఉదయం ఉపాసన, దేవపూజనం చేయాలి. పరదార గమనం పనికిరాదు. చేయరాని పనులు చేస్తుండటాన ఆయువె తరుగుతుంటుంది. చేయవలసిన పనులు చేయటంవల్ల ఆయువు పెరుగుతూ ఉంటుంది.

దేవాలాయాలవద్దనూ, వీధిలోనూ, గోకోష్ఠాలవద్దనూ ఉమ్మివేయటం, మూత్ర పురీషాలను వదలటం కూడదు. తూర్పు ముఖంగా భోజనం చేయాలి. నిలుచొని చేయరాదు. మూత్ర విసర్జనం కూడ నిలుచుని చేయరాదు. ముసలి వారు వస్తుంటె ఎంత కష్టంలో ఉన్నా-ఎదురువెళ్ళి నమస్కరించాలి. రెండు చేతులతో తలగోక్కోరాదు. నెత్తినూనె వంటికి రాచుకోరాదు. దోవలో వెళ్తూ- విప్రులకు, గోవులకు, క్షత్రియులకు, వృద్ధులకు, దుర్బలులకు, భారగర్భిణులకు దోవనిస్తూ నడవాలిగాని అడ్డగించరాదు. పౌర్ణమి, చతుర్దశి, సప్తమి అష్టమిలలోనూ, తన జన్మ తిథియందుస్నూ సంగమం చేయరాదు. బ్రహ్మచర్యాన్ని పాటించాలి. కొండీలు చెప్పకూడదు. మూత్ర పురీష విసర్జన కాలంలో మౌనంగా ఉండాలి. సంధ్యాకాలంలో నిద్రించకూడదు. గర్భిణీ స్త్రీలతో రమించకూడదు. ఉత్తరానికి పడమరకూ తలబెట్టి పడుకొని నిద్రించరాదు.

కట్టివిడిచిన గుడ్డ కట్టరాదు. తినే సమయంలో ఆపదార్థాలయందే దృష్టి-మనసునుంచి తినాలి. రాత్రికాలంలో పెరుగును తీపితో చేర్చి తినరాదు. పంక్తిలో కొందరకు ఒక రకంగా పెట్టి ఇతరులకు మరో విధంగా భోజనం పెట్టరాదు. దేవతర్పణం వ్రేళ్ళ కొనలగుండాను, ఋషితర్పణానికి చిటికిన వ్రేలి మొదళ్ళ గుండానూ పితృతర్పణానికి బొటన వ్రేలినుంచీన్నీ నీటిని వదలాలి కుడి చేతితోనే ధర్మకార్యాలు చేయాలి. కఠినంగా మాట్లాడటం క్రోధం కలిగి ఉండటంవల్ల ఆయుష్షు తరుగుతుంది.

వర్ణాశ్రమాచార విధులనేది మనకుగల నియమావళి. వాటిలోని విధుల ననుసరించిఆచారాలుంటవి. వాటిని అనుసరించాలి. వర్ణాశ్రమ ధర్మాలను పాటించుమనడం అవి ఆయుర్వృద్ధికరమైన వైనందునె. ఆచారం ధర్మానికి మూలం. అన్ని ఆచారాల కంటె గొప్పది సకల భూతదయ కలిగి ఉండటం' ఇది మనసు అనే అంత్రదింద్రియానికి చెందింది. ఇవి జ్ఞాపకముంచుకొని ఆచరించి ఆయుర్వృద్ధి చేసికొనాలి.

ధర్మరాజు : సోదరులు ఎలా మెలగాలి ?

భీష్ముడు; అగ్రజుని అనుజులు ఆరాధించాలి. అగ్రజుడు తమ్ములను ఆదరించిమెచ్చుకొంటూఉండాలి.తమ్ముడు వెర్రివాడైనా ఫరవాలేదేమో గాని అగ్రజునకు కార్యజ్ఞాన నిరూఢి లేకపోతే తమ్ములు చిక్కుల్లో పడుతారు. ఉన్న ఆస్తిని తగినట్లు పంచుకొని అనుభవించటం మేలు. లేకపోతె కొట్టుకు చావడమె అవుతుంది. పెద్దవాడైనా తమ్ముడైనాసరె ఎవరు అక్రమానికి దిగుతారో వారు దండ్యులు. అన్నగారు తండ్రి తరువాత తండ్రియంతవాడు. ఉపాధ్యాయుని కంటె తండ్రి పదిరెట్లు ఎక్కువ గౌరవానికి తగిఉన్నాడు. తండ్రికంటె పదిరెట్లు ఎక్కువ గౌరవానికి తగినది తల్లి.

ధర్మరాజు : స్వామీ ఉపవాసము అందరూ చేయవచ్చునా ఆ విధి ఏమిటి?

భీష్ముడు : ఉపవాసమందరూ చేయవచ్చు. బ్రాహ్మణ, క్షత్రియులు మూడు రోజులు చేయవచ్చు. ఓపిక ఉంటే ఇంకా చేయవచ్చు. ఏదైనా ఒక నెలకు మించి ఎవరూ ఉపవసించరాదు. పూర్తిగా ఉపవాసం ఉండి అన్నాళ్ళుండటం ఎవరికీ మంచిదీకాదు. ఆపైన పాపంకూడాను. శూద్రులూ వైశ్యులూ

తాము రోజులో తినే సమయాల సంఖ్యను తగ్గించటమే ఉపవాసమౌతుంది. ఉపవాసంతో చేసినతపం కంటె ఎక్కువయిన తపస్సు లేనేలేదు. విశ్వామిత్రుడు ఏకభుక్తి నియమంతో వేయి సంవత్సరాలు తపస్సు చేయటంవల్ల బ్రాహ్మణు డయినాడు. ఉపవాస విషయంలో సులభ మార్గమున్నది. ఏమిటంటే, పగలు ఒకసారి రాత్రి ఒకసారి భోజనం చేసి అప్పుడే అవసరమైన నీరు త్రాగటం- ఆ తరువాత ఒక భోజనానికి రెండవదానికీ మధ్య ఏమీ తీసుకొనకపోవటం- నీరుకూడ తీసుకొనరాదు. పైగా పాప కార్యాలు చేయకుండ, పుణ్య చింతచేస్తూ అగ్నిహోత్రాది కార్యాలు చేస్తే పుణ్యలోకాలు కలుగుతవి. ఇది యజ్ఞం చేయ లేనివారికి మార్గం. అన్నాడు భీష్ముడు.

## 2. అధ్యాత్మ విద్యా వివరణం

ధర్మరాజు అధ్యాత్మ విద్యావివరణంగూర్చి, అడుగుతాడు. భీష్ముడు హరసనత్కుమార సంవాదం చెప్తాడు :

అధ్యాత్మ విద్యను తెలియటం ఒకటేకాదు. దానిని మళ్ళీ మళ్ళీ మథనం చేసి మననం చేయాలి. శివుడు తానై సనత్కుమారుని దగ్గరకువచ్చి సాంఖ్య యోగవిషయం చెప్పిధ్యానంలో చూడదగిన వస్తువేదో చెప్పాల్సింది అంటాడు. సాంఖ్య విషయం తెలిసి భగవద్ధ్యానం చేయాలి. సాంఖ్య విషయమె అధ్యాత్మ విషయం సనత్కుమారుడు చెప్తున్నాడు :

"'నేను' అనేదీ-శరీరం అనేదీ వేర్వేరు. మనసు, బుద్ధి, అహంకారాలు కూడ శరీరంలోవె. ఇవన్నీకలిసి ప్రకృతి. ఈ ప్రకృతికి ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నది. ఇదికూడ ఇరవయినాల్గు తత్త్వాల్లో ఒకటి. ఆ తత్త్వాలతోనే సర్వ ప్రపంచంకూడి ఉన్నది. అవి ఏమిటంటే, పృథివి, జలం, తేజం, వాయువు, ఆకాశం, ఇవి ఐదు, వాటి గుణాలు-శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు-ఇవి ఐదు, వాక్ పాణిపాద పాయూపస్థలు అనే కర్మేంద్రియాలు ఐదు-శ్రోత్రత్వక్ చక్షుజిహ్వ ఘ్రాణాలు అనే జ్ఞానేంద్రియాలు ఐదు. మొత్తం 20. మనసూ బుద్ధీ అహంకారం 3 మొత్తం 23 న్నూ ప్రకృతి 24 వదిన్నీ మొత్తం 24 తత్త్వాలు. ఈ 24 తత్త్వాలూ తలుపుల్లా గోడల్లా ఊరికె ఉండటంకాదు-కట్టెలో అంతటా అగ్ని ఉంటే మండేగుణం ఉన్నట్లుగా వీటిలో ఒక తెలివి, చైతన్యం

ఉంటోంది. దాన్నే బుధుడు అంటాం. ఈ బుధుడే బుద్ధినికూడ తెలిసికొనేవాడు. అందుచేత బుధుడు వేఱు, బుద్ధివేఱు. ఈ బుధుడే జీవుడు. ఇతడూ ఈ ప్రపంచంలో ఉన్నవాడే కనుక ఇతడు 25వ తత్త్వమని తెలియాలి. ఈ జీవుడు వేఱనీ, మిగిలిన 24 తత్త్వాలూ వేఱనే అనుసంధానం చేయాలి. ఇది ధ్యానం. ఇదే సాధనం. బుద్ధి బుధునివైపు ప్రసరించటం ధ్యానంలో కలగాలి.

ఆ బుద్ధిలో ఆ ప్రత్యగాత్మ (అంటె బుధుడె-జీవుడె) నిల్చి ఉండేటట్లుగా చేయడానికే ఈ అభ్యాసం చేయాలి. అలా అభ్యసిస్తేగాని ఆ తెలివి నిల్చి ఉండదు. బుద్ధికి శరీరమంటె అభిమానమెక్కువ. నిజానికది శరీరంలో భాగమే కదా! ఈ శరీరం నిలవాలనే యావలోపడి, ఈ ధ్యానాన్ని బుద్ధి పాటించదు. ఆ ధ్యానాన్ని అనుసంధానం చేస్తేనే జీవుడికి పురుషోత్తముడవుపడేది! ఆ పురుషోత్తముడె అమృతార్థ తత్త్వం. దీన్నే బ్రహ్మమనికూడ అంటారు. అది అమృతార్థ తత్త్వమెందుకంటే దాన్ని తెలిసినవాడు మృత్యువును జయిస్తాడు గనుక! ఇది 26వ తత్త్వం. మొదటి 23 తత్త్వాల్లో బుద్ధి తాదాత్మ్యం చెందకూడదు. ఎందుకంటె వాటికి మృత్యువున్నది. 24వది ప్రకృతి ఎప్పుడూ మారేదే! ఎప్పుడూ ఉండేదేకూడ. ఐతె ఒక సందేహం రావచ్చు-బుద్ధికూడ 23 లోనిదేనై నశిస్తె ఇంకా తెలిసేదెవరికి? జీవునకు! ఇది జ్ఞాపకముంచుకోవాలి. 25వ తత్త్వమయిన జీవునకు అనుభూతి కావటం ముఖ్యం. వానికి గానీ, అమృతార్థ తత్త్వమయిన 26వ తత్త్వానికిగానీ మృత్యువులేదు. 24వదైన ప్రకృతి ఎప్పుడూ మారేదైనా 26లో లయించి ఉంటున్నదే గనుక దానికీ మృత్యువు లేదనే అనాలి! (అదె దేవునిశక్తి-దేవి-కాళి. అంటారుకూడ).

అమృతార్థ తత్త్వమే అనేకమై అనులోమ ప్రకారంగా ఈ ప్రపంచం తోస్తున్నది. ఏకమై లయమై బ్రహ్మంలో ఉంటూనూ ఉన్నది ఇదంతా ఒకరు చెప్తె విన్నాను తెలిసింది అంటే చాలదు. తెలిసింది బుద్ధికే. అనుసంధానం చేసి జీవునకు అనుభూతిని కలుగజెయ్యాలి. ఉత్తమ శ్రద్ధకలిగి ఏకముఖమైన చిత్తం కలిగి ఇంద్రియాలను జయించి వేదం తెలిసినవారికే-అంటే తెలియదగింది తెలిసినవారికే-ఎఱుగ సాధ్యం.

ఇక అనుసంధానం ఎలాటిచిత్తం, ఇంద్రియజయంతో చేయాలనేది ముఖ్య విషయం! తన శరీరంగూర్చి ఆలోచిస్తే ముందు కనుపడేవి కరచరణ

ణాలు. వాటిని అధ్యాత్మలు అంటారు. ఇవి భగవంతుని కర్మలు చేయడానికి సంభవించినయి. ఆ పనులు చేయవలసియున్న కారణమేదో అది అధిభూతం అవుతుందిగదా! ఇలా చేయడానికి ఆధారంగా అధిదైవం ఒకటి ఉంటుంది. ఇది అమృత తత్త్వంనుంచి వచ్చిన పరమాత్మ తత్త్వమె. పరమాత్మ శక్తె. అదే పరమేశ్వరి! దేవి!

కన్ను అనె అధ్యాత్మకు, చూడవలసియుండటమనే అధిభూతానికీ, అధిదైవం సూర్యుడు, స్పర్శకు వాయువు ఇలా అధిదైవాలు ఉన్నాయి, ఇవన్నీ పరమాత్మ శక్తులె. పరమేశ్వరిలో భాగాలె. ఆ అధిదైవాలనారాధించితె పరమేశ్వరి నారాధించినా శరీరంలోని మనసునూ, బుద్ధినీ అమృతతత్త్వంవైపుకు పారింపించి శరీరాన్ని పరిరక్షించుకొంటున్న వాళ్ళమవుతాము. అంతవరకె. ఆ పరమాత్మ తత్త్వాన్ని అనుభూతి చేయాలంటె ఇలా సర్వాన్నీ ధ్యానంచేస్తూ పరమాత్మె ఇదంతానని ఎఱుగాలి. అందుకు అవయవాల (అధ్యాత్మల)ను ఆ అధిదైవాలకుగాను హోమం చేయడమనే ధ్యానయజ్ఞం చేయటమె సాధన.

ఆ బ్రహ్మతత్త్వం 'ఓం' కారవాచ్యం. అంతకంటె దాని వివరణం కష్టం. అహంకారాన్ని నశింపుచేసి దానిని ఆరాధించాలి. బ్రహ్మము అమలమైంది. శీతమూ ఉష్ణమూ కూడ కాదు. మంగళకరమైంది. తృషాహరము కూడ. అప్రమేయం, అవిజ్ఞేయం, అచలం, ఆదిరహితం, అంత్యం, విమలం, అవ్యయం, పుండరీకాక్షం, అచ్యుతం, సత్ అసత్ కూడాను. ఈ మాటలు కేవలం సూచనలె. ఇదలకా బుద్ధితో ముందు తెలిసిం తరువాత ఎప్పుడో అనుభూతి అవుతుంది. (కాలేనాత్మనివిందతి).

సాధకుడు ముందు ఇంద్రియాల్లో తాదాత్మ్యమయి ఉంటే సాధన చేసేటప్పుడే, మనోబుద్ధ్యహంకారాల్లోనూ తరువాత పరమాత్మ తత్త్వమైన 'నేను' అనేదానిలోనూ తాదాత్మ్యం పొందటం బుద్ధితో తెలిసి అనుభూతి నందాలి. జీవుడికి ప్రబోధం కావాలి.

ఈ 24 తత్త్వాలూదాటి తాదాత్మ్యం పొందగలిగినపుడె 25వ తత్త్వమైన జీవుడు తన్ను తాను చూచుకోగలడు. అప్పుడే తాను పరమాత్మ తత్త్వంలోనున్నట్లు అవగతమవుతుంది. అది జ్ఞానం. అమృతతత్త్వం.

దేహాన్నిచూస్తూ దేవతల్ని చూడటం అభ్యాసం చేయాలి. ఈ శరీరంలో అవగతమవుతున్న ప్రకాశ విశేషాలు ఈ అనుగుణ్య దేవతలచే ప్రకటితమవుతున్నవని తెలియటం ప్రాతిపదిక.

సీ. జిహ్వసోముడు। వాణి శిఖి। ప్రాణమునగాడ్పు। దానంబునందు శతక్రహ దాలి
వ్యాన స్తనాంతర వర్తులై పర్జన్యగగనముల్ బలమున కౌశికుండు
మతి-నపానమున సమానంబు నందు నీశాన మిత్రావ్సరస్స మితులక్ష
లందు సూర్యుడు మేననంఘ్రుల జెవి భూమి ధరణి ధరుండుదిక్తతియుపస్థ
మున ప్రజాపతి బుద్ధియం దనఘ బ్రహ్మయుండు నింతకు బుధ్య
మానుడనంగ వెలుగు నాత్మయధిష్ఠాత విను ప్రబుద్ధ డన నబుద్ధుండు నా
చౌప్పనతడు—

అతడే దైవతాల నన్నింటినీ చూస్తుంటాడు. అచలితమైన నిష్ఠతో ఉంటాడు.

బుద్ధి అనేదానికి దైవతం బ్రహ్మ, ఈ బుద్ధిలో చైతన్యం చేరినప్పుడే ఇచ్ఛ ఆనేది స్వతంత్రంగా కలుగుతుంది. అలాగే నిత్యబుద్ధ ముక్తస్థితిలో ఉన్న ప్రబుద్ధుడుకూడ ఇచ్ఛను నిస్స్వార్థంగా లీలామాత్రంగా పొంది, అవ్యక్తస్థితికి వచ్చినవాడై జీవుడుగాను (అక్షరుడు) ప్రకృతిగాను (క్షరుడు) అవుతాడు. జీవుడు ప్రకృతితో తాదాత్మ్యం చెందటమూ కలుగుతుంది. ఇది తెలిసి తిరిగి వెనక్కు ప్రయాణంచేసి జీవుడు పరమాత్మతో తాదాత్మ్యం పొందితె తిరిగి పరమాత్మ స్థితికి జీవుడెక్కుతాడు. ఇదే యోగం. యోగికి ఎవరూ సరికాదు. ఆ ప్రదుద్ధుడే తానుగా ఎఱుగడమే అమృతత్వం. యోగులకు సంప్రాప్తమయేదది! ఆ ప్రదుద్ధుడే పరుడు. 26వ తత్త్వం. ఆ స్థితిలో అతడు జీవుని, యోగిని, 25వ తత్త్వాన్ని చూస్తాడు. అంతేగాక అతడూ తనూ ఒకటేనని చూడటం ఇక్కడికీలకం. ఈ విషయాలను బుద్ధితో తెలియడం చాలదు. అనుభూతికావాలి. అయితె బుద్ధికి తెలిసేదాకా అనుభూతి ప్రసక్తె సాధారణంగా ఉండదు మనిషికి.

ఇది తెలిసికొన్న తరువాత మునులు ఏకాంత ప్రదేశానికి పోయి, ఆసన ప్రాణాయామాదుల్ని పాటించి, ఇంద్రియ విషయాలను మనసునుంచీ వదలివేసి గురూపదేశాన్ని నడుపుతారు. అప్పుడు వారిని దేహబాధలుకూడ బాధించవు. అభ్యాసమె అతడికి ఆహారమై బలాన్నిస్తుంది. తిండిలేకున్నా అప్పుడు—

తిండితిని యోగం చేయలేనివారికి నిష్ఠ కుదురుతుంది. నిర్వాతదీపకళికలా మనసు నిలుస్తుంది. నిర్జనమైనచోట, నిశ్శబ్దమైనచోట హృదయస్థుడైన దేవు చూడాలి. ఒకవేళ శబ్దం ఉన్నా అది సజ్జనాన్వితమైన స్థలమై ఉండాలి.

అలా వ్యక్తి యోగం చేస్తే తమం, నిస్తమం, చేతనం నిశ్చేతనం అమృతత్త్వం అన్నిటినీ గ్రహిస్తాడు. అంటే తాను అమృతుడని ఎరిగినట్లె, అజ్ఞాన పూర్ణ దేహముతాదాత్మ్యతగానూ, జ్ఞానం పొందిన బుద్ధిస్థితినీ, అవ్యక్తంనుంచీ వ్యక్తం కావడానికి ముందుగలస్థితినీ తానుగానే అనుభూతి చేస్తాడు.

ఇది తిరిగి వెనుకకు రాకుండా వెళ్ళదగిన నిచ్చెన. సాంఖ్యమంటేకూడ చెప్తాను మళ్ళీ-విను. ఇంద్రియాలున్నాయి. వీటికంటెకూడ గొప్పదయిన మనసు వేఱుగా ఉంది. దానిపైది అహంకారం. అంతకుపైది బుద్ధి అంతకంటె ఎక్కువది ప్రకృతి. అంటే దేనియందు జీవుడు ప్రవేశింపబోతున్నాడో ఆస్థితిని అదె అవ్యక్తం. దానినే దేవిగా పూజిస్తారనేకులు. అవ్యక్తం కంటె పురుషు డెక్కువ. పురుషుడంటే పైనచెప్పిన 26వ తత్త్వమయిన అమృతార్థ తత్త్వం.

చేతనుడైన పురుషుడు జడమయిన ప్రకృతిలో చేరే స్థితె 24వ తత్త్వం. జడానికీ పరమేశ్వరునికీ మధ్యనున్నది పరమేశ్వరీ తత్త్వం. ఆమెనారాధిస్తె జీవునికి తన నిశ్చయస్థితి అవగతమై పరమార్థ తత్త్వం తెలుస్తుందనేది గమనించాల్సినట్టిది!

26రో తత్త్వం పరిమితిపొంది జీవుడవుతోంది. ఆ క్షణంవరకూ 26వ తత్త్వానికి గుణాలనేవి వుండవు. తాను వేఱుగానున్నా ఒకడనే పరిమితిఉన్నా ద్వంద్వాలింకాలేవని అర్థం ప్రకృతిలోని గుణాలతో తాను తాదాత్మ్యమయిన ప్పుడా గుణాలు కలుగుతున్నాయి. ఎందుకన్నంటె ప్రకృతె తను అనె పొరపాటు వచ్చిపడిందప్పుడు. తనకుతానే ఉంటున్నాడనే అనుసంధానంచేసి, ఈ ప్రకృతీ త్రిగుణాలూ ద్వంద్వాలూ తనవికావని జీవుడే తను అని పరమాత్మే సర్వ భూతాల్లో ఉన్న జీవుళ్ళు అనీ తెలిసి పరమాత్మతోతాదాత్మ్యం పొందటం యోగ!

ఇందుకు ధృతి చాల అవసరం. ధృతి సడలినప్పుడల్లా క్రిందకు జారి పోతాడు వ్యక్తి. గమ్యం చేరలేడు.

ఉన్నది ఏకత్త్వమే: అజ్ఞానం బుద్ధిలో కలిగిన అవరోహణం. దానివల్లనె తాను పరమాత్మ అనే మాట మరచి మనుష్యుణ్ణి అనుకుంటున్నాడొకప్పుడు. ఇంకొకప్పుడు శరీరాన్నేననుకొంటున్నాడు. తాను పరమాత్మ అనే సంగతిని తాను ప్రకృతిలో చేరిన క్షణాన మర్చిపోయినాడు. ఇది అనుభూతి అయినప్పుడే తాను కేవలుడని ఎఱిగి కైవల్యముక్తి పొందగలడు.

ఈ ధ్యానం శరీర త్యాగ సమయంలో అభ్యమయితె ముక్తికలుగుతుంది మరణం ఎప్పుడొస్తుందో సాధారణంగా తెలీదు. అరిష్ట సూచనల్ని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు. అవి గమనించి ధ్యానాన్ని అనుసంధానం చేయాలి. ఏకత్త్వాన్ని గ్రహించి కైవల్యం పొందాలి అంటె మృత్యువును జయించాలి.

నీటిలో చేపా, ఉదుంబర ఫలంలో కీటకాలూ ఉన్నట్లుగానె ఈ ప్రకృతిలో తానూ ఉంటున్నాడనేది మనిషి తెలియాలి. ఆ ఫలానికీ కీటకాలకీ-నీటికీ చేపకూ తేడా ఎలాటిదో నీకూ ప్రకృతికీ అంతే తేడా. నీకూ నీ మనోబుద్ధులకూ అంతే తేడా అనేది అవగతం చేసుకోవాలి. తామరాకుమీది నీటిబొట్టులా అంటకుండా బ్రతకాలి. ఈ ప్రకృతికి తాను భిన్నుడుగా ఎఱిగినప్పుడు ఇరవయిఆరో తత్త్వంలో వెలిసి అజరామరుడవుతాడు. అదె ముక్తిని పొందటం.

ఇదంతా సాంఖ్య శాస్త్రంగా చెప్పుకొన్నాం గనక ఈ శరీరసృష్టి-విధము-ఇలా వచ్చింది-ఒక్కమాటలో చెప్పాలంటె సంగం, బంధమనీ నిస్సంగం మోక్షమనీ అంటే చాలు-అర్థం చేసికోవచ్చు. ఇదంతా సనత్కుమారుడు చెప్పిన అధ్యాత్మ విషయం :

ధర్మరాజు అదంతావిని, మనిషి శుచిత్వం పొందటానికి ఏఏ తీర్థాలకు వెళ్ళాలి? చెప్పవలసిందంటాడు. అందుకు భీష్ముడు-నాయనా! మానసమె శౌచాతిశయమైన తీర్థం. దానికి ఆధారం ధృతి. ఆ ధృతి అనే హ్రదంలోనె ఆ మానసమనేది పుట్టింది. ఆ మనసు తీర్థంలో, రజస్తమాలను ప్రక్కకు త్రోసివేసి సత్యాన్ని ఊతగా తేసికొని స్నానంచేస్తె శుచిత్వం పొందినవాడవుతాడు వ్యక్తి. రాగం లేనివాడవుతాడు. ధృఢవ్రతంచేత ఇంద్రియాలను జయించుతాడు, కనుక వివేకవంతుడైన తరువాత తీర్థాల్లో స్నానం చేయటం ముఖ్యం! నిజానికి మంచి స్వభావం, ఇంద్రియ నిగ్రహం, తపస్సు, అహింస మనో

నిగ్రహం ఇవె మంచి తీర్థాలు! ఇదె స్నానం. అలాచేస్తే వారె పరిశుద్ధులు. సాధారణ తీర్థాల్లో శారీరకంగాచేసే స్నానంకంటె ఈ స్నానం ఎక్కువ పరిశుద్ధిని కలుగజేస్తుంది. లభించని పదార్థాలను కోరే వారికిగాని కోరనివారికిగాని తీర్థాలక్కర్లేదు. లభించిన వాటియందు మమకారం, దుష్టమనస్సుపొందనట్టి వారికీ-ఆశ అనేది లేనట్టి పురుషులకూ భౌతిక తీర్థస్నానాలతో పనిలేదు.

*ధర్మరాజు : శరీరం వదలిన తరువాత-మనిషి (జీవుడు) ఏది సహాయంగా వెళ్తాడు అన్నాడు. ఈ ప్రశ్నకు ఆ సభకు అప్పుడే వచ్చిన బృహస్పతి ఇలా చెప్తాడు-"ధర్మం ఒక్కటె సహాయంగా వెళ్తాడు. ధర్మపథం అవలంభించి చిత్తంలో దాన్ని చేర్చటం బ్రతికి యుండగానే జరుపుకోవాలి. ఆ ధర్మ ప్రవృత్తి లేకపోతె నరకానికె వెళ్తాడతడు అప్పటికిగల ప్రవృత్తితో. జీవుడు శరీరాన్ని వదలినప్పటికీ, ఆ శరీరానికి సంబంధించిఉన్న బుద్ధి, పంచతన్మాత్రలూతమ లక్షణాలతో జీవుని కలసి సూక్ష్మ శరీరంగానయి ప్రయాణమై వెళ్ళటం జరుగుతుంది. ఆ సూక్ష్మ శరీరికి తనకున్న పంచభూత లక్షణపూర్వకమైన పరిస్థితినిబట్టి తనువాలి జన్మకలుగుతుంది. అది ధర్మ పరిపూరితమయితె సుఖభాజనమైన జన్మ వస్తుంది. అధర్మయుతమయితె దుఃఖభాజనమైన జన్మ వస్తుంది. ఇదీ సరళి.

## 3. అనుశాసనికం

ఈ అనుశాసనిక పర్వంలో సర్వమైన ధర్మాలూ శ్రోతలకు తెలియజెప్పాలని, భీష్ముడూ, వ్యాస వైశంపాయన శ్రోతులూ, ధర్మరాజూ కూడ ఆశించారని తోస్తుంది. ఒక ప్రశ్నకిచ్చిన సమాధానాన్ననుసరించి తరువాతి ప్రశ్న ఉండకపోవటం చూస్తె ఈ ప్రశ్నల్ని ధర్మరాజు అడుగటం ప్రజలకు ధర్మ విషయం తెలియాలనేను అనిపిస్తుంది.

ధర్మరాజడుగుతాడు. పాపాలను పోగొట్టుకొనే విధమేమిటని. ఆ సమయానికి సభకు వచ్చిన దేవగురుడు సమాధానం చెప్తాడు; "దానంవల్ల పాపాలు పోగొట్టుకోవచ్చు. దానాల్లో అన్నదానం గొప్పది. న్యాయార్జితమైన విత్తంతో దానం చేస్తే పోని పాపాలే లేవు. విప్రుల అకలి గ్రహించి అన్నదానం చేయటం గొప్పది. ఇతర్లకు చేయరాదా అనే ప్రశ్న ఉద్భయించదు - దానికంటె ఇది

గొప్పది అన్నప్పుడు. వేదాధ్యయనపరుడైనవాడు వేదార్థాన్ని ఇతర్లకు చెప్పడం చేత పాపాన్ని పోగొట్టుకుంటాడు. రాజు భూదానాదులవల్ల పాపాన్ని పోగొట్టుకుంటాడు. వ్యాపార మూల కధనంతో బ్రాహ్మణ భోజనం ఈయడంద్వారా వైశ్యుడు పాపం పోగొట్టుకుంటున్నాడు. శూద్రుడున్నూ బ్రాహ్మణులకు తృప్తి కలిగించడంద్వారా పాపాంను పోగొట్టుకొంటున్నారు" అన్నాడు దేవగురుడు. బ్రాహ్మణులకు తృప్తి అన్నప్పుడు తత్త్వవేత్తలయినట్టి - లేదా తత్సాధకులయినట్టి వారికి తృప్తి అని అర్థము. బ్రాహ్మణ కులజులయిన వారందరికీ కాదా అన్నవుడు మనువు బ్రాహ్మణ కులజులకు సత్యం ధర్మం శౌచం సద్వృత్తులు లక్షణాలుగా ఉండాలని శాసించి ఉన్నాడు గనుక అలా ఉన్నవారు అని చెప్పాలి గాని బ్రాహ్మణత్వంలేని వారనటం వల్ల చిక్కులు రావచ్చు. ముఖ్యంగా ఈ మత విషయకమైన దానాది పుణ్యాలు చెప్పినప్పుడు బ్రాహ్మణుడంటే తత్త్వవేది లేదా తత్సాధకుడూ ఇంకా ఇంకా మంచిలక్షణాలుగలవాడు అని మాత్రమే అర్థం చెప్పుకోవటం అవసరం.

ధర్మరాజు : 1) ధ్యానం, 2) ఇంద్రియ నిరోధం 3) అహింస 4) గురు శుశ్రూష 5) నిత్యానుష్ఠానం 6) తవం ఇన్ని మంచి లక్షణాలు చెప్తారు కదా అందులో ఏది గొప్పది? అంటాడు. దేవగురువు అన్నీ గొప్పవే అని చెప్తాడు.

భీష్ముడు : అహింస అనేది గొప్పది. గోవు స్థిరంగా నిలవాలంటే నాల్గు పాదాలూ ఎలా అవసరమో అలాగే ధర్మానికి అహింస వల్లనె స్థిరత వస్తుంది. హింస చేయరాదు. మనోవాక్కాయ కర్మలా చేయరాదు. మాంసం తినకుండటం కూడ అహింసె. పితృ దేవతలకు శ్రాద్ధం పెట్టేటప్పుడూ ఆచార ప్రకారం మాంసం పెట్టటం—అది విధ్యుక్త ధర్మం కనుక—తప్పులేదు. మాంసం తినకుండటం ఆయు, శ్రీ, రూపకారి అని మార్కండేయుడు చెప్పాడు. నూరు సంవత్సరాలు తపం చేయటమూ మాంసం తినకుండటం రెండూ సమానమన్నారు వేదవిదులు. కనీసం ఆషాఢం శ్రావణం భాద్రపదం అశ్వయుజం అనే మాసాల్లో మాంసం తినకుండా ఉండాలి.

మాంసం రుచి మరిగినవారు దానిని వదలడం కష్టమేగాని అసాధ్యం మాత్రం కాదు. అహింసను గురించి సూచన ప్రాయంగా చెప్పాను. నీవు గ్రహించాలి" అన్నాడు భీష్ముడు.

ధర్మరాజు : కురుక్షేత్ర సంగ్రామంలో చనిపోయిన వారికెలాటి లోకాలు ప్రాప్తించినవో చెప్పండి-

భీష్ముడు : సంగ్రామంలో చనిపోయినవాళ్లు సద్గతులనే పొందుతారు. వ్యాస మహర్షి ఒకసారి బండిలో వెళ్తుంటే 'ఆ బండిక్రిందబడి చస్తానేమో' ననుకొంటూ ఒక కీటకం దడదడలాడిపోయి తప్పుకొంటుంది. వ్యాసుడు దాన్ని చూచి, ఈ కీటకపు బ్రతుకు నెందుకు నిలుపుకోవాలనుకుంటావు" అంటాడు. ఆ కీటకం తాను పూర్వ జన్మలో మనుష్యుడై అన్ని దుర్మార్గాలు చేయడంచేత ఈ పుటక కలిగిందనీ-తల్లిని ఆదరించి భక్తిచేసి యున్న కారణంగా ఈ పూర్వ జ్ఞానం తనకు కలిగిందనీ చెప్తుంది. వ్యాసుడు కరుణించి "ఇక నీవు శూద్ర వైశ్య క్షత్రియ తత్త్వాల ననుసరించి సుఖాలు పొందుతావుగాక అని వరమిస్తాడు. ఆ కీటకం అలాగే నరుడుగా పుట్టి ఆయా కర్మలుచేసి తత్త్వాన్ని గ్రహించుతాడు క్షత్రియుడుగా వ్యాసాశ్రమం వచ్చి ఆయనకు నమస్కరిస్తే-వ్యాసుడు ధర్మం కోసం యుద్ధంచేసి చనిపోతే ఉత్తమ స్థితికి పోగలవని చెప్పాడు. ఆ క్షత్రియుడలాగే ధర్మయుద్ధంలో చనిపోయాడు. ఉత్తమ యోగం స్థితీలను పొందాడు.

కనుక సంగ్రామంలో చనిపోయినవాళ్ళు ఉత్తమ స్థితికె వెళ్లారనటం చెప్పచ్చు.

ధర్మరాజు : విద్య, తపను, దానం వీటిలో ఏది గొప్పది?

భీష్ముడు : మైత్రేయుడొకసారి వ్యాసునికి చెప్పాడు- ధర్మకోటి అన్నింట్లో భోజన దానం గొప్పది. దానివల్లనే తానెప్పుడూ ఎంతో సంతోషపరుడై ఉండగలుగుతున్నది అన్నాడు. తపమూ విద్యా పూజనీయాలే కాని దానం వాటిని పోషిస్తుంది. దానాల్లో అన్నదానం గొప్పది.

ధర్మరాజు: స్త్రీ సంసారంలో ఎలా మెలగాలి చెప్పండి.

భీష్ముడు : స్త్రీ కుటుంబంలో ముఖ్యమైన సభ్యురాలు. కుటుంబ క్షేమం చూసుకునేది ఆవిడె. వయసు మళ్ళిన అత్త మామల సంక్షేమం-అందుకె-ఆమెకు పరమ ముఖ్యమవుతుంది! వారి ఇష్టానికి వ్యతిరేకం ఆమె చేయరాదు. దేవ పిత్ఱు అతిథి పూజనలు చేయడంలో ఆమెకు అలుపుండరాదు. పతికి భక్తి చేయాలి. బిడ్డలను శిక్షణ చేయాలి- పతిపత్నులు వేరుకాదు. ఒకరు ఇంకొకరి

ఇష్టానికి వ్యతిరేకం కాకుండ ప్రతికై సాధనం చేయాలి. స్త్రీ అందుకై తనకు వేరుగా ఏదో ప్రియమున్నదనుకొనక పతిరక్షణా రక్షణల తెలిసివారి ప్రియమె తన ప్రియంగా నడుచుకోవాలి. ఇంటి గోవుల్నీ, ధనాన్నీ రక్షించుకోవాలి. అగ్నిని రక్షించాలి. గర్భవతి అయితే పథ్యమైనవి తినాలిగాని చవికయినవాటిని తింటాననరాదు. ఇలాంటి వారికి ఇహమూ పరమూ కూడ కలిసి వస్తయి.

ధర్మరాజు : సర్వశాస్త్ర సారమైనదేది?

భీష్ముడు : పుండరీకుడనేవాడికి నారదుడు తనకు నారాయణమూర్తి చెప్పిన తత్త్వాన్ని చెప్పాడు ఈ విషయాన్ని. ఈ శరీరంలో 24 తత్త్వాలున్నాయి. దశేంద్రియాలూ పంచ భూతాలూ పంచ తన్మాత్రలూ మనో బుద్ధ్యహంకారాలూ ప్రకృతీ అనేవి! 25వ తత్త్వం శరీరానికి వేరైన జీవుడు. ఇతడ్ని పరమేశ్వరుడుగా తెలిసికొనడమె సర్వశాస్త్ర సారం. ఆ జీవుడే పరమేశ్వరుడు. తాను శరీరానికి పరిమితమైనట్లు భ్రాంతిలో పడ్డాడు. అందుచేత అతడ్ని జీవుడంటున్నాం. ఆ భ్రమను వదలితె తాను పరమాత్మ అనే అనుభూతిని పొందగలడు ఇదె అనుష్ఠేయం. శ్రేష్టతమమైన అనుష్ఠేయం. అతడె నారాయణుడు. విష్ణువు. ఇది భావాద్వైతం మాత్రమె! నేను దేవుణ్ణి గనుక నిన్ను ముంచేస్తాననె దురాచార క్రియ అరంభించుమని కాదు. క్రియాద్వైతం కాదు చెప్పేది. ఆ నారాయణుణ్ణి తలచి తానే పరమాత్మననే సుగతికెక్కాలి-అదీ సాధన. సర్వశాస్త్ర సారమున్నూ. విష్ణుమూర్తిని గూర్చి కలలో కన్నవాడు కూడ ఉద్ధృతికి వెళ్ళకలుగుతాడు ఈ క్షరాత్మికమైన ప్రపంచంలో! అంటే మనను ఎప్పుడైనా-ఆ విష్ణుమూర్తిని చేరటమె పరమసాధన!

ధర్మరాజు: ప్రియవచనాల వల్ల ఫలముందా. ఏమిటది?

భీష్ముడు : ఉంది. ఒక బ్రాహ్మణుడు ఒకసారి నిర్మానుష్యమైన అడవిలో ప్రయాణిస్తున్నాడు. అతడ్ని ఒక రాక్షసుడు పట్టుకొంటాడు తినేద్దామని. ఆ బ్రాహ్మణుడు కలవర పడక చిరునవ్వుతో తాను మాట్లాడాలనె సూచన చూపుతాడు. రాక్షసుడాశ్చర్యపోతాడు. చావంటే భయపడక ఇంత ప్రేమతో తన్ను చూస్తున్నాడేమని!! బ్రాహ్మణుని ప్రియభాషణంతో తృప్తుడై-నా శరీరం శ్రమవల్ల బాధపడుతోంది ఏమిటి కారణం' దీనికి సమాధానం తృప్తిగా చెప్తే నిన్ను వదిలేస్తానంటాడు.

అప్పుడా బ్రాహ్మణుడు చెప్పిన మాటలు నిజాలూ ప్రియవచనాలూకూడ. అతడంటాడు : నీకు ఈ ముసలితనం శరీరం వాలిపోవటం జుట్టు తెల్లబడటం ఇవన్నీ, నీ ఆశ్రమా ఎందుకొచ్చినవో చెప్తాను- బహుశః నీవు చుట్టాల్ని దురుసుతనంతో వదలుకొని ఇప్పుడు పశ్చాత్తపుడవై ఉండచ్చు. లేమి దినాల్లో దుర్లభమైన ధనాన్ని కోరుకొని ఉంటావు. ఎవరికో ఉపకారంచేస్తే అతడు తన ఘనకార్యం వల్లనే ఆ లాభం కలిగిందని నిన్ను ఉపేక్షించి ఉండచ్చు. కుమతులు నిన్ను పొగడుతుంటే గొప్పవాళ్ళకూడ నిన్ను పొగడాలి అనే ఆశ పెంచుకొని ఉంటావు. అందుకని నీకు ముసలితనం వచ్చేస్తోంది. ఇలాటి కారణాలు ఎన్నో ఉన్నాయి :

ఉచితంగా సభలో మాట చెప్తావు - సభ ఆమోదించదు. ఆ బాధకూడ ఒక కారణము. నీవు చేసిన పొరపాటు నీ భార్యకూ, స్నేహితునికీ తెలిసిపోయినందుకు దాని నుంచీ నీవు తప్పుకోటానికిగాను పడె మనఃక్లేశం కూడ ఇంకో కారణం. నీ సొమ్మును మరొకడు ఆశిస్తె దాన్ని రక్షించే ప్రయత్నం మరొకటి. నీచుడు నిన్ను దూషిస్తె కులస్థులు అది నిజమనుకొంటే అదీ ఒక కారణమె అవుతుంది. గోప్యం అని నీవు దాస్తే స్నేహితుడు నిన్ను మోసగాడనటం మరొకటి. వీటిలో దేనివల్లనైనా కార్శ్యపాండురత్వం కలుగుతుంది.

అంతేకాదు. భార్య, పుత్రుడు, అల్లుడు అర్య ప్రవృత్తి మానితేనూ, తలిదండ్రులూ సోదరులూ బాధపడితేనూ, దేవబ్రాహ్మణుల సొత్తు నీవు హరిస్తేనూ గోబ్రాహ్మణుల్ని పూర్వ జన్మలోనైనా చంపినందువల్లనూ ధన నష్టంవల్లనూ బంధు నష్టంవల్లనూ, కీర్తినాశంవల్లనూ, ప్రయత్నించిన కార్య విఫలమవడం వల్లనూ నీకు కలిగిన దుఃఖం బయటబెట్టకపోతె- నీ శరీరం శుష్కించి తెల్లబడిపోవచ్చు.

ఇదంతా రాక్షసుడు విని- అవును నిజమెనని ఆ బ్రాహ్మణుని వదలివేశాడు. కనుక, ప్రియవచనాలవల్ల బ్రాహ్మణుని ప్రాణం దక్కిందనేది స్థూలంగానూ, ఎదుటివారికి ప్రియం కలిగిస్తే తప్ప జరామరణాల్ని దూరంగా ఉంచటం కుదరదనేది సూక్ష్మంగాను తెలిసి గ్రహించు.

ధర్మరాజు : కల్మషాలను పోగొట్టకలిగె పుణ్యకథను చెప్పండి.

భీష్ముడు : ఒకసారి శ్రీకృష్ణుడు రుక్మిణితో తపను చేయడానికి హిమాద్రికి వెళ్ళాడు. ఆయన అక్కడ నారదాది ఋషుల ఎదుట ఆసీనుడై ఉన్నాడు. ఆయన ముఖంనుంచీ హఠాత్తుగా అగ్నివచ్చి బ్రహ్మదేవుడ్నిచేరి ఆయన్ను సేవించి తిరిగివచ్చి ఆయన ముఖంలో చేరుతుంది. ఋషులాశ్చర్యపడుతారు. అందుకు శ్రీకృష్ణుడు చెప్తాడు. నేను బ్రహ్మ ఆశీర్వచనంపొంది తిరిగివచ్చాను నాకు మన్మథుడనే కుమారుడు కలిగేటట్లు నన్ను ఆయన ఆశీర్వదించాడు అన్నాడు. పుణ్య కథ ఏదైనా చెప్పమని ఋషుల్ని కోరుతాడు. అప్పుడు నారదుడు చెప్పాడిలా-

"నేను ఒకసారి మహాదేవుని సమక్షానికి వెళ్ళాను. ఆయన సిద్ధ సాధ్య విద్యాధరులతో గోష్ఠి వింటున్నాడు. అప్పుడు గౌరి వెనుకనుంచీ కమల రేకుల వంటి తన చేతుల్తో శివుని కండ్లు మూసింది. శివుడు మూడో నేత్రం తెరిచాడు. వెంటనే అక్కడి వనాలు తగులబడినయి. ఆమె ముందుకువచ్చినమస్కరిస్తుంది. హరుడు ప్రసన్నుడవుతాడు, ఆమె ఆ మూడో నేత్రం తెరిచిన కారణ మడుగుతుంది. ఆయన చెప్తాడు.

"నాకు లోకాత్మకముంది. లోకాలు చీకటిలో మునిగిపోతాయని నీ చేతుల్ని తీసేయడం ఇష్టంలేక ఆ కన్ను తెరిచి ఆదరించాను" అంటాడు. తన యందు ఆయనకు గల సన్నిహితత్వం ఆమె తెలిసినదై అప్పుడెన్నో ప్రశ్నలడిగి శివతత్త్వం తెలిసికొంటుంది. ఆయన వ్యక్తిత్వాన్ని గూర్చిన ప్రశ్నలె అడుగుతుంది. "నీకు నాల్గు ముఖాలెలా కలిగాయని-కంఠంలో నలుపెందుకనీ- పినాకమెక్కడిదనీ - ఈ నంది ఎలా వచ్చిందనీ - స్మశానవాసమెందుకనీ - ఈ జడలు- ఈ చంద్రుడు ఇవన్నీ ఎలా ఎందుకు వచ్చాయో చెప్పమంటుంది.

శివుడు చెప్తాడు : సుందోప సుందులకు పరస్పర స్పర్థ కలిగించడానికి మయుడు తిలోత్తమ అనే సుందరిని చేశాడు ఆమె నాకు ప్రదక్షిణం చేస్తుంటే నాల్గు ప్రక్కలా ముఖాలు ధరించి ఆమె నాశీర్వదించాను. సముద్ర మథన సమయంలో విషం పుట్టింది. సంసార సాగరంలో నున్న విషాన్ని భరించాను కనుక దేవదానవులు దాన్నుంచి తమను రక్షించాలన్నారు, దాన్ని గొంతులో ఉంచేసి అనుభవానికి రాకుండా ఉంచేశాను. అదీ ఈ నలుపు. కణ్వుడు తపను. చేస్తుంటే ఆయనమీద పుట్టలు పెరిగి దానిమీద వెదురుపొద పెరిగింది. బ్రహ్మ

ఆ ఋషికి ప్రత్యక్షమైన తరువాత ఆ వెదురుతో మూడు ధనస్సులు చేశాడు ఒకటి నాకు ఇంకొకటి విష్ణుకు మూడోది అగ్నికి ఇచ్చాడు. ఇదె పినాకము.

లోకహితం కోసం తపసు చేస్తుంటే అవుపాలు త్రాగిన దూడల మూతుల నుంచీ నురుగు వచ్చి నాపైబడి ఏకాగ్రత భంగపరచింది. కోపగించితె ఆవు లన్నీ నలుపెక్కిపోయినయి. బ్రహ్మాదులు వచ్చి ఈ వృషభాన్ని కానుకగా నా కిచ్చి ఆవులకు వరాలిప్పించారు. ఈ నందె ఆవృషభం. ఇక స్మశానమంటావు! ప్రపంచంలో క్రూరత్వాన్ని నియంత్రించడానికి ఏకాగ్రతకు నిర్జన ప్రదేశంలో ఉంటేనేగాని సాధ్యంకాదని అక్కడచేరి అక్కడినుంచీ సర్వలోకాలనూ అలో కిస్తూ నియంత్రిస్తున్నాను, మనోబుధ్యహంకారాలను దాటి పైకి వెళ్ళటం అలాంటిచోట్ల తేలిక. అందుకని స్మశానంలో ఉంటూ ఉంటాను ఎప్పుడన్నా అలాగే ఈ బూడిద పూసుకొని ఈ పాముల్ని చుట్టించుకొని ఉంటూ ఉండటం ఎందుకంటె సుఖాల్ని విష్ణూ, దుఃఖాలు పోగొట్టటం నేనూ ప్రసాదించే పనుల్ని పంచుకొన్నాం - ఒకటి నాకు వచ్చింది కనుక ఆ కర్తవ్యం చేస్తూ ఉండటం అలవాటుగా చేస్తున్నాను.

ఈ చంద్రుడ్ని దక్షయజ్ఞ సందర్భంలో వీరభద్రుడు కాలిక్రింద ఉంచి త్రొక్కడం జరిగింది. ఇప్పుడతడ్ని ఆదరించి తలపై పెట్టుకొన్నాను.

గౌరీ సిద్దసాధ్యులూ కూడ ఎంతో సంతోషిస్తారీ మాటలకు. అప్పుడు గౌరి ఎన్నో ధర్మ విషయాలు శివుని చెప్పమని కోరుతుంది.ముఖ్య మైంది వర్ణా శ్రమ ధర్మాల్లో విడివిడిగా చెప్పిన ధర్మాలవల్ల ప్రజలు విడిపోయి పోట్లాడు కోరా? అంతర్య మేమిటి చెప్పమంటుంది. శివుడు చెప్తాడు.

"మానవుడుగా జన్మించిం తర్వాత మోక్షంపొంది తిరిగి పరమాత్మలో చేరడానికి ప్రయత్నించడమె పరమ కర్తవ్యం. ఈ కర్తవ్యం రెండు రకాలు. ఉపనిషత్తుల్లో చెప్పిన - వర్ణించిన - పరమాత్మను ఎరిగి ఆయన్ను ఆశ్రయించి ఆయనలో లీనం కావటం మొదటిది. ఉపనిషదాంతర్యాన్ని అన్ని గుణాలవారూ గ్రహించలేరు. అందుకని వారికి రెండవ మార్గమయిన సమాజసేవ అనేదాన్ని ఇమిడ్చి - వేదాలు కర్మకాండను చెప్పినయి. కర్మలు చేస్తూఉంటే ఉపనిష త్తుల్లో చెప్పిన దృష్టి కలుగుతుంది. స్తోత్రాలు, యజ్ఞకర్మలు, వేదప్రోక్త మైంది ఆ ఉపనిషత్సంబంధమైన జ్ఞానం వైపునకు మనోబుద్ధులు మొగ్గి అసక్త కర్మవల్ల ఉన్నతినందాలనె. ఆ మనః ప్రవృత్తిని కలిగించుకో కలిగిన వాళ్ళ

సత్త్వ గుణాత్మకులు కనుక వారిని తప్పక యజ్ఞ యాగాదులు చేయుమంటూ శాస్త్రాలు చెప్తున్నాయి. కనుక ఉపనిషద్దృష్టిలేనివారు వేదధర్మాన్ని అనుసరించి తీరాలి. ఆ నియమాలనె వర్ణాశ్రమ ధర్మ మంటారు. అందులో వర్ణం అనే మాటకు గుణకర్మ వశమైన వర్ణమేకాని పుట్టుకవల్ల కలిగిన వర్ణము అనే అర్థం లేదు.

అందుచేత ఆ ధర్మాలు. విడగొట్టటానికి కాదు చెప్పబడింది. విడివిడిగా వున్న మనుష్యుల్ని వారి నుండి భగవంతుడివరకూ గల ఆయా దోవల్లో నడిపించి అనుగ్రహించడానికేనని తెలియాలి.

ఇది చతుర్థాశ్వాసము



# మహాభారత కథలు

అనుశాసనిక పర్వం- పంచమాశ్వాసము

## 1. వర్ణాశ్రమ ధర్మము

హిమాలయంలో శ్రీకృష్ణుడు ఋషులతో గోష్ఠిచేస్తూ నారదుడు శివ పార్వతుల సంభాషణను చెప్తుంటే వింటున్నాడు. "సృష్టికి ముందు ఏమీ ఉండేదికాదు. మనసే శరీరంగా కలిగిన దేవతలూ బ్రహ్మమానస పుత్రులూ ఉండేవారు. వాళ్ళు సర్వహుతమనే యజ్ఞం చేశారు. ఆ యజ్ఞం కేవలం మాన సికమె. పదార్థాలింకా అప్పటికి సృష్టికాలేదు. దేవతలకు పరమాత్మపైగల మక్కువ కారణంగా ఆ యజ్ఞాన్ని వారు చేశారు. ఆ యజ్ఞంలో విరాట్ పురు షుడుదయించాడు. ఆ విరాట్‌లోనే సర్వపదార్థాలూ, జంతువులూ, జీవులూ, గుఱ్ఱాలూ, మేకలూ కలిగినయి. ఒక లోకమయింది. లోకహితంకోసమె బ్రహ్మ మనుష్యులనుకూడ సృష్టించాడు. వారిలో సత్త్వగుణులు, రజోగుణులు, సమ్మిశ్రితులు, తమోగుణులు ఉన్నారు. పేరుకు మూడు రకాలంటున్నాంగాని సమ్మిశ్రత కారణంగా వారంతా కొన్ని లక్షల రకాలై ఉన్నారు. మానవ సమాజమయినారు వారంతా. ఈ సమాజానికి ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. వ్యక్తి కంటె ప్రత్యేక ప్రతిపత్తి. వ్యక్తి శ్రేయస్సేగాక సంఘ శ్రేయస్సుకోసం ధర్మాలు- మోక్ష మార్గంగా ఇలా చెప్పవలసి వచ్చింది.

సత్త్వగుణులు ఆ విరాట్‌నకు ముఖ మన్నారు. రజోగుణం సత్త్వ గుణం కలిగినవాళ్ళను ఆ విరాట్ భుజాలన్నారు. అ విరాటు ఊరువులు రజస్త మోగుణాల మిశ్రమవంతులన్నారు. తమోగుణులు ఆవిరాట్ పాదాలన్నారు. బ్రాహ్మణోஉస్య ముఖమాసీత్-బాహూరాజన్యః కృతః ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత" ఇదంతా పురుష సూక్తంలో చెప్పడమైంది.

బాబాయి చెప్తున్నాడు. ఇది అప్పటి సివిలుకోడువంటిది. ఇప్పుడు మనకు వందలాది చట్టాలున్నాయి కాని అప్పుడొకే ఒక్క వర్ణాశ్రమ ధర్మమనే శాసన ముండేది. అది యేమిటో శాంతిపర్వంలో విన్నారు మీరు. ఐనా మళ్ళీ చెప్తాను.

కోపంబులేమి సత్యాలాపము నిజదారవర విలాసము శుచితా గోపనము నద్రోహంబు—

ఇవి సర్వపక్ష నియత గుణాలు. అంటే వర్ణాశ్రమాలతో సంబంధం పెట్టుకోకుండా నర్వులూ వీటిని పాటించాలి అనేదొక్కటే నిశ్చలమైన ధర్మం.

ఆ తరువాత ప్రత్యేక గుణాలు కలిగినవారికి ప్రత్యేక కర్మలు చెప్పారు. వాటిని పాటించటంవల్ల త్వరగా మోక్ష సామ్రాజ్యాన్ని పొందగలుగుతారు జనులన్నారు. ఈ ధర్మాన్ని రాజు అమలుపరచాలన్నారు. ఎలా అమలుపరిచేది? ఎవరు ఏగుణం కలిగి ఉన్నాడనేది తెలిసే సమస్యను విడదీయగలవారెవరు.

మనువు రాజై ఒక మంచి మార్గం ఆలోచించాడు. ప్రస్తుతం చలామణీ అవుతున్న బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రులకు కలిగే సంతానానికి, తండ్రుల ఆస్తులతోపాటు వంశ హక్కులతోపాటు కులంకూడ సంప్రాప్తిస్తుంది. తండ్రి యేయే కర్మలు చేస్తుంటే పుత్రులుకూడ సాధారణంగా అయా కర్మలనే చేస్తూ ఉంటూ ఉండండి అని-హక్కులనేర్పాటుచేసి ఆ విధంగా వర్ణాశ్రమ ధర్మాన్ని అమలు చేస్తున్నామన్నాడు.

ఈ పద్ధతి జీవనానికి ఒకానొక వికాసాన్ని ఇచ్చిందిగాని, మోక్షానికి చెప్పిన వేదమార్గం మరుగుపడుతూ వచ్చింది. జ్ఞాని కుమారుడు శూరుడుగా పుట్టినప్పటికీ క్షత్రియుడనటం జరుగటల్లేదు. శూద్రుని కుమారుడు పరమపవిత్రుడైన వాడైనా బ్రాహ్మణుడనే పిలుపేదు. అలా అంటే రాజశాసనం ఉల్లంఘించినట్లె అయింది. దీంతో ప్రచలితమయే ప్రపంచం స్వార్థ భూయిష్టమైన జీవన సరళిలో మునిగి తేలలేక సతమతమై మోక్ష విషయమే గాలికి వదలివేయటం జరుగుతోంది.

అందుకనె శివుడు పార్వతికి విడమర్చి చెప్పవలసి వచ్చింది-వేదాల అంతర్యం! అన్నాడు బాబాయి.

శివుడు పార్వతికి వినిపిస్తున్నాడు :

విప్రులు జ్ఞానలోకానికి ఆధారం. వారిని పరాభవించటంవల్ల చేటు కలుగుతుంది. వారి సొమ్ము పుచ్చుకొనంటంవల్ల, శివుడైన నా సొమ్ముతిన్నంత దుష్ఫలి

తం కలుగుతుంది. విప్రులు కఠిన ధర్మాలను పాటించాలి-అధ్యయనం, యజనం, దానం, అధ్యాపనం యాజనం ప్రతిగ్రహం; ప్రశాంతి, తపస్సు, సత్యం, శౌచం అగ్నికార్యం-ఇన్నిటిని నడపాలి. ఆపదలో తప్ప వాణిజ్యం చేయరాదు. ఇవేకాదు ఇంకా నియమాలున్నాయి-శూద్రాన్న వర్జనం, నిజదారతోనే సంగమం, రెండు ప్రొద్దులే భోజనం, హింస మానడం. ఇల్లు పరిశుభ్రంగా ఉంచుకొనడం అతిథుల్ని ఆదరించడం, తపస్సు చేయడం-వీటన్నిటిని పాటిస్తారు గనుకనే- పాటిస్తేనే-బ్రాహ్మణులు గొప్ప అవుతారు.

క్షత్రియులకు విప్రరక్షణముఖ్యం. ధరణి మొత్తాన్ని రక్షించాలి. అది ధర్మమని వెంటనె చెప్పారు. దాని అర్థం ఇతరుల్ని రక్షింపవద్దనిగాని కూడదని గాని కాదు. ఇవిగాక అధ్యయనం, యజనం, దానం సాధుపోషణం చేయాలి. వేదాన్ని ఇతర్లకు చెప్పడం మాత్రం వీరికిలేదు-దుర్జనుల్ని శిక్షించటం, ఉత్సాహం, కలిమి, ధృతి-ఇవి వారికి ఉండాలి. పంటలో ఆరోవంతుకు రాజుహక్కు కలిగి ఉంటాడు. వివాదాలు పరిష్కరించాలి. రాజరికంలో ఉన్నవారి కవి ధర్మాలు. రాజరికంలో లేని క్షత్రియ స్వభావులు విప్రరక్ష, అధ్యయనం, యజనం సాధుపోషణాదుల్ని అనుసరించాలి,

వైశ్య స్వభావులు కృషి, బేహారం, పశుపాలనం, అధ్యయనం, యజనం దానాలను చేయాలి. ఐతె తిలలు, గంధం, పాదరసం ఇవిమాత్రం విక్రయింపరాదు.

ప్రత్యేకంగా చేయాల్సిన కర్మలు ఈ మూడు రకాల వారికె చెప్పి; మిగిలిన వృత్తులన్నీ శూద్రస్వభావులకె కేటాయించారు. అవన్నీకూడ సమాజానికి వ్యక్తిగా చేయాల్సిన సేవలు, కుమ్మరం, కమ్మరం పంటివి. పౌరోహిత్యమూ యజనము రక్షణ బేహారాలూకూడ సేవలె సమాజానికి. అవి కానట్టి మిగిలిన సేవలన్నీ శూద్రస్వభావులకన్నారు. ప్రజలు తమ తమ బ్రతుకుల్ని ధర్మపరంగా నడుపుకోవడానికిగాను వారివారి అంతరంగ స్వభావాన్ని బట్టి ఈ ఏర్పాట్లు చేశాయి ధర్మశాస్త్రాలు! ఇందులో జన్మ ననుసరించివచ్చే జాతులకు ప్రత్యేకించిన కర్మలులేవు. కేవలం స్వభావాన్ననుసరించి చేయవలసిన కర్మలను మాత్రమే చెప్పారు. శూద్రస్వభావం కలిగినవాడు బ్రహ్మక్షత్రియ వైశ్య కులాలో జన్మించినా అతడికి నౌకరీ, రవాణా సేవలు, ఇతరవృత్తులూ చేయవచ్చు.

ననేభావం. అలాగే బ్రహ్మ పదార్థ తత్త్వ విషయ జ్ఞానులు శూద్రకులంలో జన్మించినా వారి స్వభావాన్నిబట్టి నియమాలు పాటించి తపనుచేసి సత్యం పాటించుమనేగాని-కేవలం శూద్రకర్మలనే చేయాలని కాదు.

ఆశ్రమ ధర్మాలు విను :

బ్రహ్మచర్యాశ్రమస్థులకు- బ్రహ్మచర్యనిష్ఠ, గురు సేవనం విద్యాభ్యాసంగం, అగ్నికార్యం, గురువుకొఱకై సంచారం, భైక్షకత్త్వం ఇవి ధర్మాలు.

గృహస్థులకు-శుచి, నిజదారవల్ల సంతుష్టినందటం పంచయజ్ఞాలు, వేదమునందు రతి, దానం, హోమం, దయ అతిథి సన్మానం-ఇవి.

వానప్రస్థులకు-వనవాసం, కందమూలాదుల భోజనం బ్రహ్మచర్యం జటాజినం ధరించటం-పరమాత్మసేవ ఇవి ధర్మాలు.

యతికి కోపరాహిత్యం, సంగత్వం లేకుండటం, అకించనభావం ఓర్పు, విప్రవాసము, ప్రశాంతి, ఋజుత్వం, శౌచం సద్వ్రతనిష్ఠ భిక్షాభోజనం, నేలమీదనే నిద్రించడం, దయ, తత్త్వ విచారణలు- లక్షణాలు.

ఈ ప్రత్యేక లక్షణాలను పాటించేది ప్రత్యేక స్వభావాలు ఆయా విధగాం కలిగిఉన్నవారు. మిగతా అందరూ వర్ణాశ్రమ ధర్మమనే ధర్మాన్ని పాలిస్తూ ఉండాలి—కోపంబులేమి, సత్యాలాపము, నిజదారపర విలాసము శుచితాగోవనము అద్రోహమనేవి కచ్చితంగా పాలిస్తూ జీవితాలు నడపాలని అర్థం. అన్నాడు శివుడు.

గౌరి అప్పుడడుగుతుంది : తపసు అంటే ఏమిటి? దాన్ని ఏ స్వభావం కలిగినవాళ్ళు చేయాలి? మిగతావాళ్ళు చేయరాదా?

శివుడు : తపసంటే ఇంద్రియ నిగ్రహం. ఈ నియమం అందరూ పాటించాల్సినదే. వానప్రస్థులయితే వనాల్లో ఉండి కందమూలాలు మాత్రం తింటూ పరమేశ్వర ధ్యానంచేసి తపసు చేస్తారు.

గృహస్థులుకూడ నియమపాలనంవల్ల తపసుచేసిన వాళ్ళవుతున్నారు. ధర్మం ప్రధానంగాచేసి అర్థాన్ని కామాన్నీ అనుభవించడమె వారి నియమం.

భూతదయ సత్యదృష్టి ఇంద్రియ విషయాల్లో విరాగం ఉండాలి. యోగం నడు పుతుండాలి. అతిథి సేవ చేయాలి. ఈ తపసు మిగిలిన ఆశ్రమాల్లో చేసే తపసు కంటె పదహారురెట్లు గొప్పది. జననీ జనకుల ఆరాధనం, స్త్రీకి పతివ్రతాధర్మం బ్రహ్మచర్య మేమరకపోవడం ఇవి పరమ ధర్మాలు. గృహస్థ పంచపర్వాల్లో మాత్రం లైంగికంగా కలువకుండా ఉండాలి. మిగిలినప్పుడు భార్యనుతృప్తి పరుస్తూ ఉండచ్చు. సంపాదించిన ధాన్యం, పక్షులూ ఎలుకలూ తింటున్నా అవీ బ్రతుకపలసిందేకదా అన్న మనః స్థితిని సంతరించాలి.

సన్న్యాసి ఎక్కడ ఎట్లా ఉన్నా ఏమిచేసినా అన్ని సంగమాలనూ మన సునుండీ వదలి ఉండటం తపం.

తపసు మూడు రకాలు–శారీరం, వాచకం, మానసికము అనేవి. ఈ మూటినీ సర్వులూ ఎప్పుడైనా పాటించదగినవె. రాజైనవాడు పక్షపాత రహి తంగా ధర్మయుతంగా రాజ్యం చేయడంలోనే సంయమనం కలిపి ప్రజారక్ష ణం చేయచ్చు. అలాగే ఇతర్లు తమ తమ స్వధర్మాల ననుసరిస్తూనే ఈతపస్సు చేయాలి.

## 2. ధర్మసందేహాలు

పార్వతి శివుని ప్రశ్నిస్తుంది : రకరకాలవారు రకరకాలైన ప్రత్యేక ధర్మాలను పాటించాలనేది వారు, వారి స్వభావాన్నీ స్వధర్మాన్నీ ఆధారం చేసికొని మోక్షమార్గంలో ప్రగతి గడించాలనె భావం అంటున్నారు. అయితె, అంతరాంతరాల్లో ఈ ధర్మం అందరికీ ఒకటేనా? అయితె ఆధర్మ రహస్య మేదో చెప్పండి.

శివుడు చిరునవ్వు నవ్వి అంటున్నాడు. చిరునవ్వునవ్విన కారణం బహుశ–"సర్వుల సాధనలకూ ఫలితాలనిచ్చి అంతిమంలో నన్ను చేర్చుతూ ఉండే తల్లి, అయినా చూద్దామని అడుగుతున్నట్లుంది" అనుకొని ఉంటాడు. సమాధానం ఎదుటనున్న ఋష్యాదులకు తెలియాలనె చెప్తున్నాడు :

"ధర్మ రహస్యం అహింసే. దాన్ని సర్వులూ పాటించటమె ధర్మం. నిజానికి హింసను పూర్తిగా వర్జించిన వారెవరూ ఉండరు. నేలపై చీమలు

ఆకాశంలో తిరిగే దోమలు నల్లులు పేలు వీటిని చంపకుండా ఉండడు మనిషి. అది హింసె. కాని చెట్ల పండ్లనుకూడ కోయకుండా పండి రాలినవాటినేతింటూ బుద్ధిసిలిపి నిశ్చలంగా బ్రతికె పుణ్యులుంటారు. వారు అహింసాత్మకులు. ఎవరి బుద్ధి పరిపక్వాన్నిబట్టి వారు అహింసను అవలంభించాలి. బుద్ధి పరిపక్వం సంగతివిను. అంతరాంతరమైన ధర్మం తెలియడమవుతుంది.

"విధివశం చేత చనిపోయే జంతుజాలాలను మనిషి అహంకారంతో "నేను చంపాను" అనుకోవడంవల్ల, ఈ హింసకు బాధ్యతను పొందినవాడవు తున్నాడు, మనిషి. దీపం పెట్టితే కీటకాలు వచ్చిదాన్ని అంటుకొని చస్తాయి. దీపం పెట్టినవాడు హింస చేసిన వాడనటం ధర్మమా? అతడు అందుకు తానే కారణమనుకోవటము సరికాదు. ఈ అహంకారపరమైన కర్తృత్వమెపాపం. ఆ పాపానికీ ఈ హింసకూ తేడాలేదు. ఇదీ ధర్మసూక్ష్మం. రంతిదేవుడు చేసిన యజ్ఞంలో వేలాది గోవులె స్వయంగా వచ్చినయి-యజ్ఞ పశువులుగా! రంతి దేవుడు వాటితో యజ్ఞం చేశాడు. తాను వాటిని హింసించుతున్నా ననుకోలేదు. గోలోకానికి వాటిని పంపించాననె భావించాడు. అవి గోలోకానికి వెళ్ళినయి. చివరకు తానూ వెళ్లాడు గోలోకం. ఆయన హింసచేసినవాడు కాలేదు. అలాగె యుద్ధంలో శత్రువధ, వేటలో మృగవధచేసి సమాజసేవ చేయడంవల్ల, దండ నార్హుని దండించడంవల్ల-హింస చేయడంకాదు. యజ్ఞంలో పశువిశసనం హింసకాదని వేదంలోనే చెప్పారు. కనుక అహింస అనే నియమంలోని సంయమనమె సర్వమైన బ్రతుకులోనూ ఆచరించడమే ధర్మాల అంతరాంతర మైన ధర్మం" అన్నాడు శివుడు :

గౌరి-అప్పుడంటుంది. ప్రజలు కొందరు సంపన్నులూ, కొందరు దౌర్భా గ్యంతో దుఃఖించేవాళ్ళు, ఇంకా కొందరు నిష్కారణంగా అసంతృప్తితో సత మతమయేవాళ్ళూను! ఇదెందువల్ల, ఎవరికివాళ్ళే వాళ్ళ యీ స్థితుల్ని తెచ్చు కొంటున్నారా?

శివుడు : జీవులు కర్మఫలాన్ని అనుసరించి సుఖదుఃఖాలను పొందుతుం టారు. అలా ఆ కర్మఫలాలను అనుభవించడానికె దేవతలుగా జంతువులుగా మనుషులుగా పక్షులుగా జీవులు పుట్టటం కలుగుతోంది. అంటే జీవులు ఆయా స్థూల శరీరాలను పొందటం కలుగుతుందని చెప్తున్నాను. ఆ జీవుల రకాల్లో

ఎన్నింటికో బుద్ధి అనే నిర్ణయ శక్తిలేదు. మనుష్యుడికిఉంది. ఆశక్తిని అవధరించి ఆత్మోన్నతి నందగలిగిందీ మనుష్యుడే. అధః పతనమయేదీ అతడే. విద్యనూ నేర్వగలడు. అవిద్యలోనూ మునుగగలడు. స్వధర్మ కర్మను ఇతరులకన్యాయం కలుగకుండా నెరవేర్చి వచ్చిన సుఖదుఃఖాలననుభవించినవాళ్ళు ఎక్కువ సౌభాగ్యాన్ని పొందుతారు. ధర్మమార్గం తప్పినడచినవాళ్ళు తరువాతి జన్మలో కూడ నికృష్ట జన్మనే పొందుతారు. ఈ ధర్మాధర్మాలు కేవలం మనుష్యులకేగాని జంతువులకు లేవు. ఎందువల్లనంటే వాటికి నిర్ణయశక్తి కలిగినబుద్ధి ఉండదుగనుక. ఒకవేళ భగవదనుగ్రహంవల్ల లేదా పూర్వపుణ్యవశంవల్ల అలాంటి బుద్ధి వాటికి ఉంటే తత్ఫలితంగా అవి పుణ్యం పాపం చేస్తూవాటిని సంతరించటం సత్యమె. అందుకె పుణ్యం ఎలా సంతరించాలా అని సాధారణ మానవుడు చూస్తుంటాడు. ఉత్తరోత్తరా సుఖాన్ని పొందటానికి మార్గంఅదె. ఈ కారణంవల్ల మనుషులు వారివారి సౌభాగ్య దౌర్భాగ్యాలను వారే కర్మంద్వారా రచించుకొంటూ ఉంటారు.

దయవల్ల లేదాకర్తవ్యమనే బలాత్కారంవల్ల భిక్ష పెట్టినవాళ్ళూ, కష్టాల్లో ఉన్న చుట్టాలనూ స్నేహితులనూ ఆదరించినవాళ్ళూ సంపదనే పొందుతారు. లోభులయి మనితె వారికి దౌర్భాగ్యమె కలుగుతుంది. అది-ఈ స్థూలశరీర జన్మలోనూ కావచ్చు-తరువాతి జన్మల్లోనూకావచ్చు, ఈ జన్మలన్నిటిలోని జీవుడూ ఒకడె-అనుభవాలు వేరై అనుభవింపబడుతూ ఉంటయి అంతె. ఇప్పటి ఈ జన్మకి ఇంకెప్పటిదో ముందుజన్మకీ సంబంధమేమిటి అనరాదు. ఈ పుట్టుక చావులు కేవలం శరీరానికి సంబంధించినవి. జీవుడెల్లప్పుడూ ప్రయాణిస్తూ ఉంటున్నాడు.

ఒకొక్క మనిషి-అతడికి ధనం ఉండాలేదా అనేదానితో నిమిత్తం లేకుండానే ఎంతో సుఖపడుతూ ఉంటారు. దీనికి కారణం వాడు పూర్వజన్మలో దరిద్రుడైనా ఇతరులకు పెట్టడానికి సంసిద్ధులై పెట్టినవాడనచ్చు. క్రిందటి జన్మలో బలవంతాన ఉపకారం చేసినవారు ఈ జన్మలో సంపదకలవారైనా లోభులై కడుపునిండా తినలేకపోతారు. క్రిందటి జన్మలో ఇతర్లను పిల్చి పెట్టినవారు అనుకోకుండానే ఎంతో ధనం సంపద కీర్తిలను సంతరించినవారవుతున్నారు.

ఈ విధంగానే ఇతర విషయాల్లోనూ సాదృశమైన విధానం నడుస్తూ ఉంటుంది. మాంసంతిననివాళ్ళ సౌందర్యవంతులై పుట్టుతారనీ-భార్య లేదా భర్తను సంతోషపెట్టనివారు తరువాతి జన్మల్లో సభలలో అవమానాలను పొందుతారనీ- నాస్తికులు దరిద్రులై రోగాలతో బాధపడుతారనీ అంటారు.

శివుడు ఇలాటి పెద్దజాబితా గౌరికీ ఋషులకూ చెప్పాడు. చేసిన తప్పునకు రాజదండనం ఇక్కడ అనుభవిస్తే తరువాతి జన్మలోని దుష్ఫలం కొంత శమిస్తుంది.

ఇంతకూ చేసిన కర్మఫలం అనుభవించక తప్పదనేది ముఖ్యమైన మాట. ప్రజలు కొందరు సుఖాన్నీ కొందరు దరిద్రాన్నీ అనుభవించటం వారి వారి కర్మలతో వారు రచించిన ఫలితాలే అని తెలిసికొను."

"అదేమిటి? చెడుకర్మ చేసినప్పుడు ప్రాయశ్చిత్తం చెప్పారుకదా ఇంకా చెడు ఫలితం రావడంలో అర్థమేమిటి అని శంక కలుగుతుంది. కాని, కామమే కారణంగా చేసిన కర్మలకు అసలు ప్రాయశ్చిత్తమేలేదు. చెప్పిన ప్రాయశ్చిత్త కర్మలన్నీ అకామకృతాలైన కర్మల దుష్ఫలితాలను రాకుండ చేయడానికే. అందుకని ఈ దుష్టపు పని చేసివచ్చి ప్రాయశ్చిత్తం చేద్దామనటం తెలివిలేమి అవుతుంది. ఆ ప్రాయశ్చిత్తానికి ప్రభావమె ఉండదుకదా!

గౌరి : గ్రహబలమంటారు - మరి దానికేమీ సంబంధంలేదా ఈ సుఖ దుఃఖాలు?

శివుడు : ఈ సుఖదుఃఖాలకు జీవుడే కారకుడు అనేది ఖాయం. శుభ గ్రహాల సమయంలో తన పూర్వ పుణ్య ఫలాన్ని పొంది సుఖపడతాడు. దుష్ట గ్రహాల సమయంలో పూర్వ పాపాన్ని అనుభవిస్తూ దుఃఖ పడుతాడు. అంతే సంబంధం.

గౌరి : 'చావు' అంటే యేమిటి?

శివుడు : మనసు, బుద్ధి, అహంకారం ఈ మూడూ కలిసి సూక్ష్మ శరీరం. ఈ శరీరం స్థూల శరీరంలో నుంచి విడిపోవటమె చావు అంటాము. జీవుడు సూక్ష్మశరీరాన్ని ఆశ్రయించుకొని ఉంటూనే ఉంటాడు - స్థూల శరీరం కుళ్ళి

నశిస్తుంది. సూక్ష్మశరీరం ఇంకో స్థూల శరీరాన్ని చూసుకొని కర్మఫలితాలనను భవిస్తూ ఉంటుంది.

గౌరి : 'పుట్టుక' అంటే?

శివుడు : స్థూల శరీరంలో చేరిన జీవుడు (సూక్ష్మ శరీర సహితంగా) "నేను" ఇదుగో ఈ శరీరమె అనటం పుట్టుక.

గౌరి : చావు ఎందుకు వస్తోంది. ఆయుష్షు వృద్ధి చేసుకోగలమా? ఎలా?

శివుడు: చావు పంచభూతాలయిన శరీరానికి! అది కుళ్ళిపోతే సూక్ష్మ శరీరం దాన్ని వదలిపోవటం చావు. కర్మలు ఆయుష్షను తగ్గింపనూగలవు నిలువనూ గలవు. సత్యం కృప శౌచం గురుభక్తి కలిగి ఉంటె ఆయువు వృద్ధి అవుతుంది. కోపం, బొంకు, క్రూరత అశుచివల్ల తగ్గిపోతుంది. తపను, బ్రహ్మచర్యం, మితహిత ఆహారాలవల్ల అయుర్దాయం పెరుగుతుంది. ఈ మంచి వాటిపై బుద్ధి చొరడమె పూర్వజన్మ కర్మ ఫలంమీద ఆధారపడి ఉంటుందనే వారున్నారు. పూర్వజన్మ అంటే స్థూల శరీరజన్మ అని మాత్రమె కాదు. సూక్ష్మ శరీరంలోని మనసూ బుద్ధీలు మారినపుడల్లా క్రొత్త జన్మ వచ్చినట్లె. ఇవి మారిన మాత్రం చేత శరీరాన్ని వదలిపోవుగాక. అందుకని అది చావు అనము గాక. కనుక మనసూ బుద్ధిన్ని మెట్టు నెక్కించాలి. అందుకు సాధన చేయాలి. మెట్లు నెక్కించేపని మాత్రం మనసూ బుద్ధులదే. ఎలా ఎక్కించటం అంటావు. జ్ఞానం ఎరిగితె ఎలా లెక్కించడమో ఎరుగవచ్చు. వేదాల్లో ఉపనిషత్తుల్లో చెప్పిన జ్ఞానం విని, మననం చేసి, జీవితంలో వర్తింపజేసి జ్ఞాపకం పెట్టుకొని అనుసంధానం చేయాలి. అదె విజ్ఞానం. అది మోక్షానికెంతో అవసరం. అప్పుడిక చావూ పుట్టకలుండవు!

గౌరి: సర్వమూ మనిషె కారణంగా జరుగుతుంటె ఇక భగవంతుడు చేసే పనేమిటి?

శివుడు : జీవుని కర్మ ఫలాల్లో కొన్ని మంచివి కొన్ని చెడువి కలిపి, ఈ ఫలాని జన్మలో అనుభవించు అని సుదుట గీత గీయటమనేది భగవంతుడు చేసిందేనని జ్ఞాపకముంచుకొనాలి. ప్రారబ్ధం ఫలాన అనే గీటు అవతు గీస్తాడు అంతకు మించి ఇంకే పుణ్య పాపాలూ అనుభవానికి రావాజన్మలో.

గౌరి : పాప పుణ్యఫలాలు అనుభవించేది ఈ స్థూల శరీర జన్మల్లోనేనా? స్వర్గం నరకం అనే లోకాల్లో కాదా?

శివుడు : అనుభవాలు జాగ్రతలోనివి మాత్రమె కావు. స్వప్నంలో కూడ అవి కలుగుతునే ఉంటయి. స్వప్నంలో స్థూల శరీరం నిద్రపోతున్నా సూక్ష్మ శరీరం ఎన్నో సుఖాలూ దుఃఖాలూ అనుభవిస్తూ వుంటుంది. అలాగే స్థూల శరీరం చచ్చిన తరువాత సూక్ష్మ శరీరం పుణ్య కర్మ ఫలాలూ పాపకర్మ ఫలాలూ కూడ అనుభవిస్తుంది. ఒకటి స్వర్గం అనీ ఇంకొకటి నరకం అనీ- లోకాలని అంటాము. కనుక ఆ అనుభవాలూ నిజమైనవే. శరీరికి ఉంటయి.

గౌరీ : పాపమేది? - పుణ్యమేది?

శివుడు : పాపం ముడు రకాలు. 1. మానసికం 2. వాచికం 3. కాయకం పరధనాపేక్ష, పాపాన్ని అమోదించటం, ధర్మద్వేషం ఇవి మానసిక మైన పాపాలు. అబద్ధం, పరుషం-ఇవి మాట్లాడటం వాచికమైన పాపాలు. ఇక వధ బంధించటం, కూడని పదార్థాలు తినటం ఇతర స్త్రీలతో రమించటం, మద్య పానం ఇవి కాయకమైన పాపాలు. మద్యపానం అన్నిటినీ మించిన చేటు తెచ్చి పెట్టుతుంది. ఎందుకనంటే వివేకం నశించి, ఇంద్రియాల్ని వాటిష్ట ప్రకారం వదలి వేయటమవుతుందిగనుక!

పుణ్యాలూ మూడు రకాలు! ౧పరమికము 2. నిరుపకరణము 3. సోప కరణములు. పాపం చేయకుండా ఉండటమె మొదటిరకం, దీనికి ధృతి బలంగా ఉండాలి. ఇంద్రియాలను నియమించాలి. దీనినె దమం అంటారు. రెండవ రకమైన పుణ్యమేమంటె శౌచం, సత్యం, శాంతి, దాంతి ఆర్జవం వ్రత సిద్ధి సముపవాసం బ్రహ్మచర్యం - ఇవి కలిగి ఉండటం, శాంతి అంటె బుద్ధి అనె ఇంద్రియంలో సన్నివారణం ఉండటం. దాంతి అంటే కర్మేంద్రియాల యోగ్య ప్రవృత్తి. ఇక మూడవది- దానం, దేవ పైతృకాది పుణ్య కార్యాలు చేయడం తన్ను తాను పొగడుకొనకుండటం ఇవి.

గౌరి : దానం ఏవే వస్తువుల్ని చేయవచ్చు?

శివుడు: అన్నిట్లోకీ అన్నదానం, నీటిదానం గొప్పవి. గోదానం, భూ దానం, కన్యాదానం విద్యాదానం, కూడ చేయదగినవే. యజ్ఞంకోసం ఇచ్చే దానం ఎంతో గొప్పది.

గౌరి: యజ్ఞమంటే యేమిటి? చచ్చినవారు తిరిగి పుట్టుతుంటే ఇంకా పితృ యజ్ఞాల ఆశయం ఏమిటి?

శివుడు : యజ్ఞాలను వేదం చెప్పినట్లుగా నిరాడంబరమైనట్టి అనక్తి లేనట్టి దృష్టితో చేయటం వల్ల భౌతిక ఆధ్యాత్మిక ఫలాలు కలుగుతవి. పితరులు పితృ లోకంలో కొంతకాలం ఉంటారు. ఆ తరువాత తిరిగి జన్మిస్తారు, వాళ్ళు తిరిగి జన్మించే ఉంటారనిగాని మోక్షం పొంది ఉంటారనిగాని ఊహించి క్రతువుల్ని మానేయరాదు. ఉన్న పితురులంతా క్రతువులు చేసినవాళ్ళకు శుభాలనిస్తారు. పితృయజ్ఞాలు మనిషికి విధ్యుక్త కర్మలు. వాటి నత్ఫలం మనుష్యులకె, పితరులకు కలిగే ఫలం సామాన్యం.

గౌరి : ధర్మాలనేక విధాలంటారు అవేమిటి ? పరమధర్మ మేమిటి?

శివుడు : ధర్మాలు అయిదు రకాలు- జాతి ధర్మాలు - దేశధర్మాలు-కుల ధర్మాలు-గణ ధర్మాలూ- ఆపద్ధర్మాలూ అనేవి. జాతి దేశ కుల గణ భేదాల్నిబట్టి మొదటి నాల్గున్నూ! శారీరక వికృతుల వల్లనూ, కాల విపర్యయం వల్లనూ మార్పు అయినవి ఆపద్ధర్మాలు అని తెలిసికొనాలి.

ధర్మార్థ కామ మోక్షాల్లో నాల్గవదె పరమధర్మం! దాని విషయం వేదంలో ఉపనిషద్భాగంలో చెప్పారు. మోక్షం సాధన చేసి పొందవలసి ఉంది. నంసారంలో విసుగు కలగక శోకమోహాలతో తిరుగడు పడుతున్నంత కాలం మోక్షాన్ని ఎవరూ పొందలేరు. మోక్షసాధన మేమంటే, గృహస్తుగా దేవఋణం పితౄణం, ఋషిఋణం తీర్చి సాంఖ్యయోగం ఎరిగి వనాలకు పోవాలి. ఏకాధికరణం మనసుకు అలవాటు చేయాలి. ధ్యానపరుడై ద్వంద్వాలను దాటి, బ్రహ్మచర్యం లఘ్వాశనం కలిగి అంతరాత్మను చూస్తూ భక్తితో అధియజ్ఞుడైన అహం అనే గురువు నాశ్రయించి పరమాత్మను చేరటమె మోక్షం. ఈ భూత ప్రత్యేక స్థితి స్థిరమైంది కాదని యెరిగి ఆశను త్రుంచివేసి వగపును మాని బ్రతకాలి. సుఖదుఃఖాలు ఒకదానివెంట ఒకటి రావటం మామూలు. పెద్ద లాభాల నాశించి తపించేకన్న దేనికయినా సిద్ధమైన స్థితిని సంతరించాలి. ఆశయం కోసం ప్రయత్నం చేయాలి. మోక్ష సాధనం చేయుమనడమందుకె. కర్తవ్యంగా పనులు చేయటం అభ్యాసం చేయడంతోనే సాధన మొదలు. ఫలంమీద దృష్టి

పెట్టుకొని పనిచేయకుండా, కర్తవ్యం కనుక చేస్తే వచ్చే కర్మఫలం భగవంతు డిచ్చేదే అని ఆయనకు త్యాగం చేయాలి. అదె కర్మఫల త్యాగం.

అలా త్యాగంతో గాక కేవలం భోగాలనుభవించిన తర్వాతనే మరొకటి అని నడచుకొంటే ఆ ఆశ తెగిపోయేదికాదు. డబ్బు ఆశలో చిక్కుకొన్న మనిషి అడవిలో తిరిగి ఎప్పుడో పులివాత పడేవానితో సమానం. జరామరణాలను దాటాలంటే మార్గం ఇంద్రియాలను విచ్చల విడిగా పోనీక ఉంచాలి. మోక్షమె ప్రశాంత స్థితి. దానికి కారణమైంది వైరాగ్యమె. మోక్షమందిన వారికి జరా మరణాలుండవు. సాంఖ్యం తెలిసి భక్తి చేయటమే మోక్ష మార్గం.

అలా శివపార్వతుల సంవాదం పుణ్య కథగా భీష్ముడు ధర్మరాజాదులకు చెప్పాడు.

## 3. సాంఖ్యయోగం

పార్వతి శివుని సాంఖ్యయోక విషయం చెప్పమంటుంది. శివుడు చెప్తు న్నాడు: సాంఖ్య మనేది చావు పుట్టుకల సంస్కృతికి చికిత్స వంటిది. సాంఖ్యులు జ్ఞానం అనుభూతి చేసి దేవుని ధ్యానించడంద్వారా ముక్తిని పొందుతారు. శారీ రకమైన తపసు వాళ్ళకు ముఖ్యంకాదు. వారు సంతరించే జ్ఞానం ఈ శరీరం ఎలా వచ్చింది? పరమాత్మ దెవరు అనే విషయాలకు సంబంధించి ఉంటుంది.

ఈ శరీరం ప్రకృతిలో భాగమె. ప్రకృతిలో 23 తత్త్వాలున్నాయి. దశేంద్రియాలూ, పంచభూతాలూ, మనసు అహంకారం, బుద్ధి అనేవి మూడు శబ్ద స్పర్శ రూప రసగంధాలనే తన్మాత్రలూ మొత్తం 23. ఈ ఇరువయి మూడూ కలసి ఒకటిగానై త్రిగుణాల్ని సంతరించుకొంటాయి. ఇవన్నీ కలిపి ప్రకృతి అంటారు. ఈ ప్రకృతికి ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నది. అందుకని దాన్ని 24వ తత్త్వమనాల్సి వచ్చింది. ఇది అవ్యక్తంగా ఉంటుందొకప్పుడు. ఆ త్రిగుణాలతో చేరి వ్యక్తమవుతూ ఉంటుంది.

ఆ సత్త్వ రజస్తమోగుణాత్మకమైన ప్రకృతినె అవ్యక్త స్థితిలో దేవి అంటారు! శక్తి అంటారు! పరమేశ్వరి అంటారు!!! నీవే అన్నాడు శివుడు. పార్వతి "నేను" అంటూ శివుని హృదయం తాకింది!! శివుడు అపును 'నేను'

అన్నాడు. శ్రీకృష్ణుడు "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం జీవభూతాం మహా బాహో యయేదం ధార్యతే జగత్" అన్నాడు ఆమెనే!!

ఈ జ్ఞానాన్ని అనుభూతి చేస్తూ సాంఖ్యులు భౌతిక శరీరంపై మమకారం తగ్గించుకొంటారు. జడంగా ఉన్న మొదటి 23 తత్త్వాలూ చైతన్యమయింది పరమేశ్వరివల్లే. ఆ అవడం సత్త్వ రజస్తమో గుణాత్మకమైంది. ఈ మూడు ఎక్కణ్నుంచి వచ్చాయో ఎవరూ చెప్పలేరు. పరమాత్మకు అవి లేనేలేవు. అందుకని ఈ పరమేశ్వరి అంటే పరమాత్మ శక్తి వాటిని ఉద్భవింపజేసి నియంత్రిస్తోంది అంటారు. ఈ గుణాల ఫలితం వల్లనే స్వభావం కలిగింది. అలా ఆ ప్రకృతి వల్లనె ధృతి, విజ్ఞానం శ్రద్ధ అసంమోహః దయ, హర్షం, సత్వం, క్రోధం కామం, లోభం, అనృతం, ద్రోహచింత వాదాదులు, సంశయం, విషాదం, జడత, నిద్ర, తమస్సులు, ఇవన్నీ కలుగుతున్నాయి. వీటిని గ్రహించుతున్నది మనస్సు. ఈ మనసు కేవలం గ్రహించినందువల్ల ఏమీ ఫరవాలేదు. కాని అహంకారమనే తత్త్వం వీటిని తనవిగా లేదా తనవి కానివిగా అనుభూతి చేయటంతో చిక్కువచ్చి పడుతున్నది. ఎవరికి? ఈ వచ్చి పడుతున్న చిక్కు అనేది చింతించాల్సినట్టిది. జీవుడనే 25వ తత్త్వానికి. ఈ 25వ తత్త్వం, శరీరంకాదు-ప్రకృతికాదు అనేది జ్ఞాపకముంచుకోవాలి. ఈ చిక్కులో తగుల్కొన్న కారణంచేతనే - నిజానికి పరమాత్మ తత్త్వమైనవాడు [illegible] జీవుడుగా పిలువబడుతున్నాడు. ఈ చిక్కును అతడు విడిపించుకొంటే అతడే పరమాత్ముడవుతాడు-పరమాత్మ తత్త్వం 26వ తత్త్వం.

ఇదేమిటి పరమాత్మ ఇలా ఎందుకు దిగజారాడు జీవుడుగా [illegible] పరమాత్మకు సత్-చిత్-ఆనందాలు లక్షణాలు. సత్ అయిన ఆయన చిత్‌లో నిమగ్నుడై తానెవరు అని పృచ్ఛ చేసికొంటూన్న సమయంలో, ఆనందపరవశుడై ఉండటం చేత, తానే ఆ 'చిత్' అనే అర్థంలో ప్రతిఫలించి ఆ ప్రతిబింబమే తాననుకొనే స్థితిలో పడ్డాడు. తాను పరమేశ్వరుడుగా ఉండి, ప్రతిబింబ రూపంలో జీవుడుగా పిలువబడుతున్నాడు. పరమేశ్వరుడు, తనకు కనపడ్డ బింబానికే తనను పరిమితం చేసికొనటంవల్ల ఈ చిక్కు అతడికి వచ్చి పడింది. ఈ విధంగా పరిమితం చేసికొనుటమనేదాన్నే అహంకార మంటాము. అలా పరిమితం చేసికొన్నని స్థితిలో బుద్ధి అంటాము. ఈ బుధ్యహంకారాలు పై

చెప్పిన 24 తత్త్వాలలోనివె. జీవుడు ఈ బుధ్యహంకారాల గారడీనుంచి విడి వడినప్పుడు పరమాత్మ తానుగా తెలిసికొంటాడు. ఇదే మోక్షం పొందటం.

అందుచేత మనను గ్రహిస్తున్న విషయాలను అహానికీ స్వయమని అను భూతి కలుగజేయకుండా చేయాలి. దానినే అమనస్కత అంటారు. దీనిని సాధిస్తే మోక్షమార్గం అవుపడుతుంది. జీవుడు పరమహంస అయి తానే పరమా త్మతనే ఎరుక కలిగినవాడవుతాడు. ఈ విజ్ఞానమె శాంతి సాధ్యము. పరమ శాంతిప్రదము.

ఇది కపిల మహర్షి చెప్పిన సాంఖ్యము. ఇక యోగమేమిటో చెప్తాను విను—యోగమంటే కలియడం. ఈ యోగమనేదానిలో ఇంద్రియాలు, మనసు బుద్ధి ఏకం కావాలి. బుద్ధి అనేది పరమాత్మయొక్క చిత్ స్వరూపం కదా-అందులో నుంచె అంహంకారం పుట్టి 24 తత్త్వాలుగల ప్రకృతి అయింది. ఆ బుద్ధి జీవుని పరంగా ఇంకా నిచ్చి ఉంటూనే ఉన్నది. అ బుద్ధిని దింపి తెచ్చి మననూ ఇంద్రియాలతో చేర్చటం కాదు ఏకం చేయడమంటె. ఆదే జరిగి పోయిన ప్రమాదం! దానినుంచి ఉద్ధరించడానికె, ఇంద్రియాల్ని మనసులో నిలిపివేసి, మనసును బుద్ధితో కలిపివేసి అనుభూతి చేస్తే జీవుడు పరమాత్మ అవడం యోగవిషయం. ఇలా చేయడానికిగాను సాధనలున్నాయి. అవన్నీ యోగంలో భాగాలే. అవేమిటంటే, అగ్ని సమారాధనం, అధిక వాగ్వివర్జనం, సత్యం, దానం, అధ్యయనం, శౌచం, సత్త్వాలను కలిగి పాపాలు చేయకుండటం అనేది. మనసును నిలపడమనేది ముఖ్యమైన సాధన. అందుకు శుచి అయినచోట జనములేనిచోట ఉండినవాడై నేలపై కూర్చుండి శరీరం నిలువుగ నుంచి మనసులో ఇంద్రియాల్ని నిలిపేసి అంటే వాటి పనులను ఆపివేసి - మనసు బుద్ధివైపు త్రిప్పితె బుద్ధి ఆత్మను చూడగలుగుతుంది. ప్రాణాపానాలు చేసే పనులను కూడ నిలిపితేనేగాని మనసు పూర్తిగా బుద్ధిలోనే ఉండిపోజాలదుగనుక వాటిని కూడ నిలుపడం అభ్యసించాలి. అప్పుడు యోగసాధనకు సిద్ధి కలుగు తుంది.

ఈ నిలిచిన ప్రాణాపానాలు ఏచోట నిలుస్తున్నవనేది మనోబుద్ధులతో చూస్తుంటే జీవుడే పరమాత్ముడై దర్శనమిస్తాడు. ఈ స్థితి వచ్చేటప్పటికి ప్రాణా పానాల సంచార స్థితి శిరస్సులో అనిపిస్తుంది. అప్పుడే జీవుడు పరమాత్ముడై

ప్రకాశించేది. ప్రాణాపానాలను నిశ్చలం చేసే సమయంలో దేహ మధ్యమం లోని అగ్ని కారణాన ఈ వాయువులు ఎగిరినవై వెళ్ళి శిరస్సులో చేరుతవి. ఆ స్థితిని పొందటమే యోగము.

ఈ మాత్రం పని ఎవరైనా చేయవచ్చుగాదా అనిపించటం నిజం. కాని ఆ సిద్ధి కలిగేది కొందరకె.ఎందువల్లనంటె అలసట, చిత్తజడత్వము, అతి భోజనము, రోగము, స్వప్నము, కామక్రోధ లోభాలు విషయాసక్తి ఉన్నవాళ్ళకు ఆ సిద్ధి కలుగదు. అధిక నిద్ర, బొత్తిగా నిద్రలేనితనం అతిభోజనం చేసేవాళ్ళు ఈ సాధనకు పనికిరారు.

ఇలా శివుడు చెప్పిన దానిని విని పార్వతి శివసాయుజ్య ప్రాప్తి సాధనలేమిటో చెప్పవలసిందని అడుగుతుంది. ఆయన చెప్తాడు.

## 4 శివసాయుజ్య ప్రాప్తి

శివుడనైన నేను ఆలోచనకు అందని వాడను. దేవతలూ మునులూకూడ నన్ను ఆలోచించి తెలిసికొనలేరు. ఈ యోగమూ సాంఖ్యమూ అనే పాతాలు నేను తయారు చేసినవే. ఈ ఇరవయి ఆరు తత్త్వాల సంగతిని కాచివడపోసిన వాణ్ణి కావడంచేత ఈ సాంఖ్య యోగ విషయాలు నాకు కరతలామలకాలు "నేను"ను ప్రసన్నుడుగా జేసికొన్న ఏ వ్యక్తిన్నీ పొందరానిది లేదు. అంతే యోగసిద్ధి కావాలనుకొంటే నాకు నైష్ఠికతతో ధ్యానస్తుతివందనాలు మొదలైన వివిధ భజనాదులను చేయవలసి ఉంటుంది. పాశుపత మహావ్రతమని ఉన్నది. దాని సంగతి పూర్వ మొకప్పుడు చెప్పేఉన్నాను. దానిచేతనూ, వీబూది రాచుకొని కపాలధారులై బ్రహ్మచర్యం చేస్తూ భిక్షచేసికొని తిండితింటూ మనసును ఆనందంగా ఉంచుకోవటంచేతనూ సాధకులు పరమానందైకతను - అనుభవింపకలుగుతారు. ఇదె సాయుజ్యమందే స్థితి. శివలింగ స్థాపనము చేసి దానియందు నన్ను భావించటం శుభదం. శివలింగాన్ని పాలతోగాని నీటితోగాని అభిషేకం చేసి, భక్తితో గంధమాల్య ధూపదీపాలతో అర్చించి నైవేద్యమిచ్చి గాఢ సమర్పణం చేసికొన్నట్లయితె సిద్ధి కలిగి ముక్తినందుతాడు వ్యక్తి.

ఇలా చెప్పి పార్వతిని, "ఇప్పుడు- కాంతా ధర్మాలేమిటో నీవు చెప్పు వినేను నింటా" నంటాడు శివుడు. అప్పుడు పార్వతి పతివ్రతా ధర్మాలు

చెప్తుంది. చుట్టూవున్న మునులుకూడ విని సంతోషిస్తారు. అంతే కాకుండా పతివ్రతకు అనర్థమైన పనులేవో అదీ విశదీకరిస్తుంది. ఇన్ని చెప్పి సిగ్గుతో "అయ్యో మీకు నేను తెలిసిన దానినిగా ఏవో చెప్తున్నాను క్షమించాల్సిం' దంటుంది. శివుడు "నీనా ఈ సంవాదం విన్నవారు ఎవరైనా అమర వైభవాన్ని పొందుతారుగాక" అంటాడు.

ఈ ఉమామహేశ్వర సంవాదం నారదుడు శ్రీకృష్ణునికి చెప్పిన కథను భీష్ముడు ధర్మరాజాదులకు చెప్పటంతో అక్కడివారెంతో సంతోషం పొందారు.

తరువాత ధర్మరాజు భీష్ముని అనేక ప్రశ్నలు వేస్తాడు. అందులో దారిద్ర్యవ్యాధి శోకాలకు శాంతిసంపాదింపగలిగే జపం ఏదైనా చెప్పుమంటాడు. మోక్షంగాని, శివసాయుజ్యంగాని కోరేవారు గాక-ఐహిక లంపటులై ఉండే వారికి కలుగుతుండే దారిద్ర్య వ్యాధి శోకాలు పోవటానికి కేవలం జపం చెప్పమనటం ధర్మరాజుకు మనవంటివారందరియందు కలిగిన ఆదరణ అనిపిస్తుంది. అప్పుడు భీష్ముడు అందరు దేవతలనూ తాను ఉచ్చాటనం చేసి మేలు చేయండని ప్రార్థించి ఈ జపాన్ని చెప్తాడు- "ఓం నమో భగవతే వాసుదేవాయ-నమః పురుషోత్తమాయ-నమస్సర్వ లోక గురవే-నమస్సర్వ లోకపిత్రే నమస్సర్వ లోక పితామహాయ-నమస్సర్వలోక ప్రపితామహాయ-నమస్సర్వలోక ప్రధానాయ-నమస్సర్వలోకేశ్వరాయ- నమస్సర్వలోక విశిష్టాయ నమస్సర్వలోక సుఖప్రదాయ-నమస్సర్వలోక కర్త్రే। నమస్సర్వలోక భర్త్రే। నమస్సర్వ లోక హర్త్రే నమస్సర్వలోక నిధయే। నమస్సర్వలోక నిధానాయ। నమస్సర్వ లోక హితాయ। నమస్సర్వలోక హితకరాయ। నమస్సర్వలోకోద్భవాయ నమస్సర్వలోకోద్భవకరాయ నమో విష్ణవే ప్రభవిష్ణవే" అని పఠించదగినదే మహా జపం అని చెప్తాడు.

దీనిని ఇలా జపం చేయడంవలన పాపాలు, భయాలు, ఆపదలు తొలగి పోతవి. శుభాలు కలుగుతయి. ధర్మతత్పరత కలుగుతుంది అన్నాడు.

ఈ బోధ విని, యుధిష్ఠిరుడు, ఈ లోకాల కన్నిటికీ మహనీయుడైన దేవుడెవరు? అతడ్ని ఎలా స్తుతిచేసి శుభాన్ని జనుడు పొందవచ్చు? ఇది ప్రత్యేకంగా ఎవరికోసమో చెప్పటం గాక, మీ మనసుకయిన మతం ఏదో అది

తెలియ చెప్పవలసిందంటాడు. ఉత్తమం అని భీష్ముడు తనకై తానుగా అను-
కొని అనుసరించే జపం సంగతి చెప్పుమంటాడు ధర్మరాజు నిర్మొగమాటంగా!

భీష్ముడప్పుడు విష్ణుమంత్రధ్యానమే అనుష్ఠేయమని తాను నమ్ముతున్నట్లు చెప్తాడు. ఆ ధ్యానం వేయి నామాలతో కూడుకొని ఉన్నదంటాడు. విష్ణు సహస్ర నామ స్తోత్రం జపించటమె పరాయణం. ఈ నామాలు సనాతన కాలం నుంచి ఎంతో కీర్తనీయమై వెలసి ఉంటున్నాయి. దీనిని జపించినవాడు ఇహమూ పరమూ కూడ జయించి శుభాన్ని పొందుతాడు అన్నాడు. ఎవరికి కావలసిన ఉద్ధృత శుభాలు వారికి కలగాలంటే ఈ జపమే పరాయణమంటాడు. అందుకె మనము కూడ విష్ణు సహస్రనామ స్తోత్రం నిత్యమూ జపించటం కర్తవ్యం.

ధర్మరాజు : స్వామీ పూజా నమస్కారాలకు ఎవ్వరు తగినవారు?

భీష్ముడు : బ్రాహ్మణులే తగినవారు. బ్రహ్మపదార్థ తత్త్వజ్ఞులను పూజించటంవల్ల అఖిల శుభాలు కలుగుతయి. వారికి కీడు చేస్తే దుఃఖమే కలుగుతుంది.

ధర్మరాజు: బ్రాహ్మణులలో వర్ణనీయమైన వర్తనమే వుండటంచేతనా అలా అంటున్నారు?

భీష్ముడు : ఒకప్పుడు సహస్రబాహార్జునుడు తనతో సమానమయిన వాళ్ళెవరూ లేరని అనుకొన్నాడు. ఒక భూతము కన్పడి అందరికంటె బ్రాహ్మణులు అధికులుగదా అంటుంది. రాజు "నాకు కోపం వస్తే సమస్త భూతాల్నీ నాశనం చేస్తా"నంటాడు. ఆ భూతం వెళ్ళిపోతుంది. గాని దేవుడు ఆ రాజుకు అవుపడి "బ్రహ్మశక్తివల్లనె రాజులు ప్రజారక్ష చేస్తున్నారు. గౌతము డలిగితె ఇంద్రుడంతటి వాడు కీడు పొందాడు - అగస్త్యుడు సముద్రాన్ని మ్రింగేశాడు. భృగువు ఉచథ్యుడు అత్రి చ్యవనుడు మొదలైనవారిశక్తి సామర్థ్యాలు అద్భుతమైనవి. బ్రాహ్మణులన్న వాళ్ళు కేవలం రాజాశ్రయంలో బ్రతికేవాళ్ళేగదా అని అలా అనటం సరికాదు. బ్రహ్మ పదార్థతత్త్వ జ్ఞానంవల్ల మహత్తరమైన శక్తి కలి వారుంటారు వారిలో. అలాంటి వారి సంతతినంతనూ మనువు ఒకే కుంగా చేసిన మాటయితె నిజమె. వారిని దైవ స్వరూపంగా భావించవలెందన్నది -వారిలో ఆ తత్త్వజ్ఞులుంటారనే భావంతోనె-అది ఒక మార్గంగా

చెప్పారు. అందుకు వ్యతిరేకభావం మనుశాసనానికి వ్యతిరేకంగా నడిపించ గలుగటం మాత్రం నిజం. దాని ప్రధాన సూత్రం జ్ఞానులను పూజింపుమనె!

ధర్మరాజు : బ్రాహ్మణ మహానుభావత్వం ఏది? ఎక్కడున్నది అది?

భీష్ముడు : ఆ సందేహం, వేదాలచే కూడ స్తుతింపబడే భగవంతుడైన ఈ శ్రీకృష్ణుడే తీర్చాలి. నేనిక చెప్పలేను, చాల శ్రమగా ఉన్నది." అని ఊరు కొన్నాడు.

## ౫. ధర్మసూక్ష్మం తెలియడమెలా

శ్రీకృష్ణుడప్పుడు ధర్మరాజుకు సమాధానం చెప్తున్నాడు. "విప్రులు అన్నప్పుడు తెలిసినవారనె అర్థం. అలాటి వారిని పట్టుకోవాలి. వారెక్కడుంటె అక్కడ మీ శ్రద్ధ చూపి అర్చించాలి. వారి మహాత్తు తమంత తాము మనకు చూపితె అర్చించటం తేలిక. అలావారు తెలియజేయరు. కేవలం జడుల్లా ఉంటారు. వారిని తెలిసుకోవల్సిన బాధ్యత మనది.

ఒకసారి దుర్వాసుడు వచ్చి పామరుడులా క్షణంలో కోపం క్షణంలో సుముఖత చూపిస్తూ నేను తిననంటూ తినేస్తూ చేసిన పదార్థమంతా ఇంకెవ్వరికి మిగలకుండా తినేస్తూ నేలమీద నిద్రిస్తూ పరుపుపై పడుకొంటూ ఎక్కడికో వెళ్ళిపోతూ మళ్ళీవస్తూ ఇలా చేస్తున్నారు. పాయసం చేయంతన్నాడు. రుక్మిణి చేసింది. దాన్ని వంటినిండా పూయమన్నాడు. పూశాము. ఆయన పాయసాన్ని రుక్మిణి వంటికి తాను పూశాడు. రథమెక్కి మా ఇద్దర్నీ దాన్ని లాగి ఊరేగింపుకు పదమన్నాడు. అలాగే మేము లాగుతుంటే కోలతో మమ్మల్ని పొడిచేశాడు అన్నిటికీ మేము సహించాము. ఎందుకంటే ఆయన మహాత్ముడని ఆయనమీద మాకెంతో భక్తి ఉంది. చిట్ట చివరకు ఆయన నాతో అన్నాడు. "నీవు కోపాన్ని జయించావు. కాని పాయసం అంతటాపూసి నా అరికాలుకు పూయలేదు కనుక నీ అరికాలు ద్వారానే నీకు అపాయం కలుగుతుంది సుమా! మిగతా శరీరానికింకేమీ భయంలే"దన్నాడు. పైగా బ్రాహ్మణ భక్తి కలిగి ఉంటు అన్నాడు. రుక్మిణిని ఆశీర్వదించాడు. ఆ తరువాత ఆ రథం వదలి మేము ఇంటికి చేరుకొన్నాం. అప్పుడక్కడ ఉంటున్న వస్తువులన్నీ పూర్వం కంటె బహుళమై మనోజ్ఞమై ఉండటం చూశాం. ఆశ్చర్యపడిపోయినాము. అంతశక్తిమంతులు ఉంటారు అవుపడకుండా బ్రాహ్మణులు!

ధర్మరాజు : దుర్వాసుడు సాధారణ బ్రాహ్మణుడు కాదనీ శివుని అవతారమేననీ అంటారు నిజమా ?

శ్రీ కృష్ణుడు : శివుడు పరుడు. ఆధ్యాత్మికంగా ఆయన ఎంతో గొప్పవాడు. ఆయన్ని మించేవారు లేరు. ఆయన కోపానికి దేవతలే తాళలేరు. త్రిపురాసుర సంహారాన్ని ఆయన ఒక్క బాణంతో చేశాడు. ఆ బాణాన్ని తన వద్దనుంచుకొన్నాడు. ఆ తరువాత అది ఒక బాలుడైంది. అతడే దూర్వాసుడు. మాయింటికి వచ్చి అంత చేసినవాడతడె. క్షరాత్మిక ప్రపంచంలో అతడు చాలా శక్తిమంతుడైనాడు. ఆ రుద్రునకు అతడు ఆ విషయంలో సముడె!

ధర్మరాజు భీష్ముని అడుగుతున్నాడు మళ్ళీ. – ధర్మాలు అనేక ప్రకారాలుగా ఉంటున్నాయి. పరమానుష్ఠేయమైన ప్రకారమేది?

భీష్ముడు : ధర్మమనేది ఒక నూయి వంటిది. దాని చుట్టూనూ దానిలో నుంచీని పెరిగిన గడ్డి – ప్రజలకు సూక్ష్మచిత్తత లేకపోవటాన్ని సూచిస్తుంది. సూక్ష్మ చిత్తత లోభ మత మోహాలతో నున్నవారికి కలుగదు. అందువల్ల వారు ధర్మాన్ని అధర్మంగా అర్థంచేసికొంటారు. అభిమానమనెదానివల్ల, ఎదుటివాడు ధర్మం చెప్తున్నా అతడు తనవాడని తోచకపోతె అధర్మమె చెప్తున్నాడనిపిస్తుంది. పైగా, నిజమైన ధర్మం తెలిసికొనాలంటే పరిత్యాగంచేసిన బుద్ధిమంతులవల్లనె తెలిసికొనాలి. లోభమోహాలతో నిండినవారివల్ల అది తెలియదు.

ధర్మార్థ కామాల్లో అర్థకామాలు కేవలం మోహాన్ని పెంచేటటువంటివి. ఈ మాట హృదయంతో నమ్మి ధర్మంతో మాత్రమే నిలచినవారు సరిగా చెప్పగలరు. ఎల్లప్పుడూ స్వాధ్యాయం, యజ్ఞం, నిష్ఠలనుండి తప్పిపోనివారు నడిపేదేదో అదె ధర్మ సూక్ష్మంగా తెలియాలి. అన్నాడు భీష్ముడు.

• ధర్మరాజుకు ఒక మార్గం దొరికినట్లయింది – మహానుభావులైనవారు నడచే మార్గాన్నె తాను గమనిస్తె ధర్మ సూక్ష్మం తెలుస్తుంది – అనేది. మళ్ళీ ఇలా అన్నాడు.

"వేదం చెప్పిన విషయం, ప్రత్యక్షంగా చూస్తున్న విషయం సమాచరణమూ – ఈ మూడూ సూచించే మార్గాలు వివిధంగా ఉండటంచేత ధర్మం ఇదేను అని నిశ్చయింపలేకుండా ఉన్నాను."

అందుకు భీష్ముడు :- "నాయనా, ఈ మూడున్నూ ధర్మానికి ఆధారాలు. వీటిలోని ధర్మసూక్ష్మతను మునులు తెలియకలిగారు. వారు చెప్పింది అనుమానింపకు. సంశయాత్ముడు నశింపునే పొందుతాడు. అహింస దానం సత్యం, అక్రోధం ఇవి పాటించటమె ఉత్తమ ధర్మం. బ్రాహ్మణారాధన తత్పరుడవు కావాల్సింది. ఇతరమైన అలోచనల్ని వదలివేసెయి రజస్తమో గుణాలతో వికల్పితులైనవారు ధర్మద్వేషాన్ని పొందుతారు. సత్యవరాత్ములే ఎల్లప్పుడూ ధర్మాన్ని ఉపాసిస్తారు.

ధర్మరాజు :- సాధువుల నెలా తెలియటం? అసాధువులంటే ఎవరు?

భీష్ముడు :- అసాధువు తమంత తాము ధర్మాన్ని ఎఱుగనూలేరు. ఇంకొకరు చెప్పినా వినరు. తాము యోచించి తెలిసికొంటూ ఇతరులు చెప్పిందాన్ని అర్థంచేసికొంటుండేవారె సాధులు. చిన్న విషయాల్లోకూడ వీరు ధర్మాన్ని అతిక్రమించరు. మలమూత్రాలనుకూడ కానిచోట విడవరు. అతిథుల, శిష్టుల భోజనాలకు ప్రాధాన్యమిచ్చి వారికి ప్రదక్షిణ పూర్వకంగా వెళ్తుంటారు. సత్యం ఆర్జవం వీటిని నడుపుతూ ఉంటారు. "శరణుజొచ్చిన కాతురు సరత గుప్తివరులు వారు నిజదారతృప్తులు గురుపూజ చేయువారు అమల హృదయులు సర్వదా సంతోషులు." ఇంద్రియ విభ్రాంతిని పోగొట్టుకున్నవారు. ప్రకటన లేకుండా ధర్మమాచరిస్తూ ఉంటారు. అఖిలభూతదయాళులై ఉంటారు. వీరిని పరికించి తెలుసుకోవచ్చు. వారు పాటించే ధర్మంచూసి ధర్మసూక్ష్మన్ని గ్రహింపవచ్చు.

ధర్మరాజు :- స్వామి!-ధర్మపరులైన వారికి ఎంత ప్రయత్నించినా అర్థసిద్ధి కలుగదు. ఇతర్లు కొందరకు తేలికగా అది కలుగుతుంది. చదివినా విద్య కొందరకురాదు. చదువకుండానే కొందరికి విద్య అలవడుతుంటుంది. కొందరు రోగాలతో సతమతమవుతుంటారు. కొందరు బలంగా ఉండీకూడ పూరిపుడక తగిలిచస్తూ ఉంటారు. ధర్మానికీ ఫలితానికీ సంబంధం లేదా?

భీష్ముడు :- నాయనా! నీవుకూడ ఈ ప్రపంచాన్ని ఎవరో దేవుడు ఆధారంలేకుండా ఇలా అమర్చి ఉంచుతున్నాడనుకొనకు. అది అజ్ఞానం! విత్తు వేయందే మొలకెలావస్తుంది? సిద్ధికీ అసిద్ధికీ ఎప్పుడూ కారణం ఉంటూనే

ఉంటుంది. కంటికి అవుపడకపోవచ్చు. కన్ను శరీర జన్మలోని కొన్ని సంగతుల్ని మాత్రమె చూడగలదు. జీవుడుచేసే అనంతమైన ప్రయాణంలో అతడేమేమి చేశాడనేదాన్నిసర్వాన్నీ చూడనేలేము. పూర్వజన్మ ఫలం, ఇప్పటిజన్మలోని ప్రయత్నఫలం తెలిస్తేగాని అతడి ప్రస్తుతస్థితికి కారణం ఎఱుగలేము. ఈ పని చేశాడుగా ఆ ఫలితం రాలేదేమనటం సరికాదు. ఈ స్థితికి పూర్వంచేసిన అనేక కర్మల ఫలం ఉండగా ఒక కర్మకు ఫలాని కారణం కలుగలేదేమంటే ఎలా?

ప్రతి ఫలితంకూడ సంచితకర్మా ఇప్పుడు చేసిన కర్మల సమష్టి కారణమె. ఆ ఫలంలో కొంతభాగమెకూడానవచ్చు. దానిఫలంవల్ల ఈ స్థితి కలిగిందని అంటున్నా ఆసంచితం పూర్తిగా నశించిందనే వీలులేదు. కొంత పోయి ఉండచ్చు. మిగిలింది ఆ తరువాతి క్షణాలకు సంచిత కర్మగా ఫలితం ఇవ్వడానికి సిద్ధంగా ఉండచ్చు.

అందుచేత దానం, తపం, వృద్ధసేవనం అహింస-ఇవి నియతమైన ధర్మకృత్యాలు-వాటిని మనసులో నిలుపుకొను.

ఇంకో ముఖ్యవిషయం విను-ధర్మంపై ఎప్పుడూ మనసుగలవానికి ధర్మతత్త్వప్రబోధాన్ని కాలమె కలుగజేస్తుంది. సుస్థిరమైన భావశుద్ధితోకూడిన తపస్సు శ్రుతం, దానం, జపం, దేవతాపూజలు వీటిని పాపాన్ని వర్జించి ఆచరిస్తూ ఉండాలి. అతడికే ధర్మయోగం కలుగుతుంది. పరమమైనమాట చెప్తాను_ నీకు ఆదర్శంగా శ్రీకృష్ణుడూ వేదవ్యాసుడూ ఉన్నారు. వారినిచూచి నీవు ధర్మసూక్ష్మతను తెలిసికోవచ్చు"-అన్నాడు భీష్ముడు.

## 6 భీష్మ స్వర్గారోహణము

అప్పటికి ధర్మరాజుకు సమాధానమయింది-ధర్మం ఆచరించటం ముఖ్యమనీ. అది ఆచరిస్తేనే అది ధర్మమెందుకయిందో తెలియగలుగుతామనీ-ధర్మపరులైన శ్రీకృష్ణ వేదవ్యాసులు దాన్ని పాటిస్తున్నారు గనుక వారినుంచీ ధర్మం ఎఱిగి పాలించవచ్చనీ-ఆశ్చర్యకరమైన సంతోషాన్ని పొందాడు. దుఃఖితుడై భీష్మనిచేరిన ధర్మరాజుకూ ఇప్పుడీ ఆశ్చర్యమైన ఆనందంపొందిన ధర్మరాజుకూ ఎంతతేడా!

ఇది గమనించి శ్రీకృష్ణుడు భీష్మునితో అంటాడు : ధర్మరాజు తెలివిని పొందాడు. ఇప్పటికి ఆయనన్ను ఇంటికి పంపెయి. మళ్ళీ మేమంతా తిరిగి వస్తాము. ..

భీష్ముడు వాత్సల్యంతో పాండవుల్ని పంపేస్తాడు. 'ఉత్తరాయణం రాగానే నావద్దకు తిరిగిరండి' అంటాడు.

ధర్మరాజాదులు వెళ్ళి రాజ్యపాలనం ధర్మప్రకారంచేస్తూ ఉంటారు. ఉత్తరాయణం వచ్చిందని శ్రీకృష్ణుడు గాంధారీ కుంతీ ధృతరాష్ట్రుల్ని పాండవుల్ని తీసికొని తన తమ్ముల్ని తీసికొని వచ్చి భీష్మునికి నమస్కరిస్తాడు. భీష్మునికి తన ప్రయాణంలో మైలురాయిని దాటిపోవాలని అర్థమయింది. శ్రీకృష్ణ భగవానుడాశీర్వదించి తనను వెళ్ళిపొమ్మంటున్నాడు. అదే ఆయనకు పుణ్యఘడియ. అది మానవుల కొలతబద్దలో మాఘశుద్ధ ఏకాదశి కావచ్చు-మరొ కటికావచ్చు. భీష్ముడు శ్రీకృష్ణుని అనుజ్ఞకోసం అ ంచాడు. అది అందింది. ధృతరాష్ట్రాదుల్ని ఆదరించి, శ్వాసనూర్ధ్వగతి చేశాడు భీష్ముడు. శరీరంలో గ్రుచ్చుకొని ఉన్న బాణాలు అంతా చూస్తుండగా క్రిందికి వాలిపోయినయి. ఆయన శరీరంలోంచీ ఒక వెలుగు నిర్గమించి అదృశ్యమైపోయింది.

పాండవులు భీష్ముని శరీరానికి అగ్ని సంస్కారాలు చేస్తారు. గంగా తీరంలో తిలోదకాలు వదలుతారు. గంగ స్త్రీ రూపంలోవచ్చి కన్నీరు కార్చుతుంది. వ్యాసుడామెను ఓదార్చుతాడు. "భీష్ముడు వసువుగానై ఉచ్చస్థితి పొందాడు-నీవెందుకు దుఃఖిస్తున్నావమ్మా" అంటాడు. ఆమె ఆనందాశ్రువుల్ని వదలుతుంది.

ఇది అనుశాసనిక పర్వం



# మహాభారత కథలు

## అశ్వమేధ పర్వము- ప్రథమాశ్వాసము

## 1. అంతశ్శత్రు జయం ముఖ్యం

భీష్మ నిర్యాణమయింది. ధర్మరాజు మళ్ళీ దుఃఖంలో మునిగిపోతాడు. తిలోదకాలు వదలివచ్చిం తర్వాత వ్యాసుడూ శ్రీకృష్ణుడూ ఎన్నోమాటలు చెప్పి చెప్పి-"ఇంకా మూర్ఖుడులా శోకించటం నరికా" దన్నారు. "అశ్వమేధ యాగం చేయించటం రాజువైన నీకు కర్తవ్యం. నీ ధనాగారంలో ధనం లేక పోతె-హిమవత్పర్వతానికి దక్షిణాన మరుత్తుడు బ్రాహ్మణులకు ధానం చేస్తే వారు మోసుకుపోలేక వదలిపెట్టిన ధనాన్ని ఆ చోటినుంచే తెచ్చి అశ్వమేధం చెయ్యి" అన్నారు. "అది చేయడం రాజుకు ప్రాయశ్చిత్తకర్మ. అందుచేత నీకు కర్తవ్యం" అన్నారు.

'అంత బంగారం మరుత్తుకెలావచ్చింది? అక్కడ ఎందుకలా వదిలేశాడు- ఆ కథను చెప్పు' మని ధర్మరాజడుగుతాడు. వ్యాసుడిలా చెప్పాడు: మనువు మునిమనుమడైన ఇక్ష్వాకుకు మునిమనమడైన ఖనీనేత్రుడి మునిమనుమడు ఈ మరుత్తు. ధర్మవిదుడు. అతడెన్నో యాగాలు చేశాడు. బృహస్పతి యాజకుడుగా చివరకు అశ్వమేధయాగం చేయాలని సంకల్పించాడు. ఇంద్రుడు బృహస్పతిని ప్రార్థించి ఆ అశ్వమేధ యజ్ఞానికి యాజ్ఞికుడుగా వెళ్ళకుండా చేస్తాడు. అందుకని బృహస్పతికి బదులు మరొక యాజ్ఞికుడు కావల్సివచ్చాడు.

అప్పుడు నారదుడు 'సంవర్తుడే' అందుకు తగినవాడని మరుత్తుకు చెప్తాడు. "అతడ్ని పట్టుకోవటం కష్టం. అతడు వెఱ్ఱివాడిలా తిరుగుతూ ఉంటాడు కాశీలోనూ చుట్టుపట్లాను! అందుకని కాశీపట్నం ద్వారంవద్ద ఒక శవాన్ని పెట్టుకొని నీవు కూర్చో. అతడు వస్తె దాన్ని చూచి వినుక్కొని తిరిగి వెళ్ళిపోతాడు. అప్పుడు వెళ్ళి అతడ్ని ప్రాధేయపడు-ఈ పద్ధతినెవరు చెప్పారంటే నారదుడని చెప్పినా అతడెక్కడున్నాడంటే మాత్రం నిప్పులోదూకి వెళ్ళిపోయాడని చెప్పు"మన్నాడు. మరుత్తు అలాగేచేసి సంవర్తుని పట్టుకొని తనకు యాజ్ఞికం చేయవలసిందనీ బృహస్పతి తనను ఇలాంటి స్థితిలో వదిలేశాడనీ చెప్తాడు.

సంవర్తుడు బృహస్పతికి అన్న కుమారుడె. బృహస్పతి ఆయన్ను ధిక్కరించి పంపివేయడంచేత వైరాగ్యం అవలంబించి అలా తిరుగుతున్నాడు. అతడు మరుత్తుని అశ్వమేధానికి యాజ్ఞీకం చేయడానికి ఒప్పుకొంటాడు కాని ఏ సందర్భంలోకూడ మరుత్తు సంచలించకుండా స్థిరంగాఉండి యజ్ఞం చేయాలి. తాను ఆ యాగానికి ఉపదర్శనం చేయిస్తుంటే ఇంద్రుడూ బృహస్పతీకూడ ద్వేషించి రోషం చూపవచ్చు. అయినా మరుత్తు చలించరాదు. ఈ షరుతుపై అంగీకరించి ఆస్థానానికి వస్తాడు.

ముందుగా మరుత్తును ధనవంతుడుగా చేయాలని, హిమమత్పర్వతాన శివుడు విహరించేచోటుకు మరుత్తును తీసికొనిపోయి శివుని స్తుతించి అక్కడి శుద్ధకాంచనమయ శిలాస్థూలవాలుకా ప్రభాజాలాన్ని త్రవ్వి బంగారం చేరవేయిస్తాడు. మరుత్తు ఆ బంగారాన్ని హిమాలయాల దక్షిణానికి తీసికొనివచ్చి అక్కడనే యజ్ఞం చేస్తాడు.

సంవర్తునిపై స్పర్థతో బృహస్పతీ, తన పదవిని మరుత్తు సంగ్రహిస్తాడేమోనని ఇంద్రుడూ మరుత్తును భయపెట్టుతూ సందేశాలు పంపుతారు. ఆ సందేశాల్ని తెచ్చిన అగ్నిని సంవర్తుడు "మళ్ళీ ఆ మాటలు చెప్పావంటే నిన్ను కాల్చేస్తా" నంటాడు. అగ్ని భయపడి వెళ్ళిపోతాడు. ఇంద్రుడు ఇంకొకరిని పంపి వజ్రాయుధాన్నికూడ పంపుతాడు. వజ్రఘోష వినవస్తోంది! సంవర్తుడు మరుత్తుకు ధైర్యంచెప్పి వజ్రాన్ని స్తంభింపచేస్తాడు.

ఇంద్రునికి తెలుసు-బ్రాహ్మణ శక్తి జయింపగలికింది కాదని! కాని ఎలాగయినా ఈ యజ్ఞం నేను ఆపలేనా అని మత్సరించి అలాచేశాడు. యజ్ఞం తిరిగి సాగించేముందు సంవర్తుడు మరుత్తును వరం కోరుకో ఇస్తానంటాడు. మరుత్తు "ఈ యజ్ఞానికి ఇంద్రుడు సహసంతోవచ్చి హవిస్సులందేటట్లు వరమివ్వ" మంటాడు. సంవర్తుడు సంతోషించి నేను మంత్రంచేత పిలుస్తుంటే అతడు రాకుండా ఎలాఉంటాడు అని యజ్ఞం సక్రమంగా చేయిస్తాడు. ఇంద్రుడు సహా దేవతలువచ్చి హవిస్సుల్ని పొందారు.

ఆ యజ్ఞాంతాన మరుత్తు బంగారాన్నంతనూ బ్రాహ్మణులకు దానం చేశాడు. వారు మోసికొనిపోగలిగినంత తీసికొనిపోతూ మిగిలింది భూమిలో దాచి అది ఎవరికి దొరికితె వారిదేనని ప్రకటించి మరీ వెళ్ళిపోయినారు. ఈ కథను

వ్యాసుడుచెప్పి "నీవువెళ్ళి ఆ బంగారాన్ని వెదికితెచ్చి అశ్వమేధయాగంచెయ్యి" అంటాడు. శ్రీకృష్ణుడు "అది కర్తవ్యం.ముందు దాన్నిచెయ్యి! వగపును నిర్మూలింపకపోతె నీవు నిర్వీర్యుడవని అర్థం. అది అంతశ్శత్రువు. దాన్ని జయించటమె ముఖ్యం. మర్చిపోవద్దు" అంటాడు. ఇంద్రుడూ వృత్రుడూ యుద్ధం చేసిన కథ విను అంతశ్శత్రువు సంగతి గ్రహింపవచ్చు"అని శ్రీకృష్ణడప్పుడు చెప్తాడు.

"వృత్రుడు ఇంద్రునకు శత్రువు. (ఇంద్రుడంటె మనసు). (వృత్రుడు వృత్తికి ప్రతీక) ఆ వృత్రుడు భూమిలో ఉండేవాడు. సర్వమూ ఆక్రమించి గంధమనే రూపంలో ఉన్నాడు. జితేంద్రియుడైన ఇంద్రుడు కఠినమైన తన వజ్రంతో కొట్టి గంధాన్ని నిర్జించాడు. రాక్షసుడు వెంటనే జలంలోదాగి అందులోని రుచిగా నైనాడు. ఇంద్రుడు రుచినికూడ జయించాడు వజ్రపు ధృతితో. వృత్రుడు అగ్నిలో చేరి రూపమనేదిగా భాసించాడు. దానినికూడ ఇంద్రుడు వజ్ర జ్వాలతో, ధారతో-జయించాడు. అతడాతరువాత వాయువులో స్పర్శగా ఉండటం గమనించి అతడ్ని వాయు నిరోధంచేత జయిస్తాడు. ఆకాశంలోకూడ ఉన్న వృత్రుని ఆ తరువాత తటిల్లతతో విక్రముడై జయిస్తాడు. ఇన్ని చేసినా వృత్రుడు వచ్చి తనలోనే అహంకారంగా ప్రవేశించి ఉన్నాడని ఎరిగి మూర్ఛపోతాడు ఇంద్రుడు. అప్పుడు వశిష్ఠుడు ఇంద్రుని బోధితుడిగా చేస్తాడు, వెంటనే ఇంద్రుడు అదృశ్యమనే వజ్రంతో తన శరీరాంతర్గతుడైన వృత్రుని వధిస్తాడు. అదీ చేయాల్సిన పని. అది అనుభూతి చేతనే సాధించాల్సిన విషయము వృత్రుని మనసు జయించాలి.

"శత్రువెవరో కాదు- శరీరానికి వ్యాధివచ్చినట్లె మనసుకు వచ్చె వ్యాధి అది! వాతపిత్త శ్లేష్మంవల్ల శరీరానికి సత్త్వరజస్తమో గుణాలవల్ల మనసుకూ వ్యాధులు వస్తాయి. నీ మనః పరిస్థితిని బట్టి కూడా వాతాదులు పొంగి వడిపోతుంటయి. మనసును సరిగా ఉంచుకొంటె శరీర వ్యాధుల్ని జయించటం సులభం."

"ద్రౌపదిని ఏక వస్త్రగా సభకు ఋషులు తెచ్చారనీ, అరణ్యంలో మీరవస్థలు పడ్డారనీ దైన్య పడుతుంటే నీ మనసు నీరసించి నిన్ను ఇరుకున పెడ్తేస్తుంది."

ఇంత పెద్ద యుద్ధం చేశాననుకోవద్దు. అది మిథ్యా యుద్ధం. సత్య యుద్ధం వేరే ఉన్నది. అది "మమ" కూ "నమమ" కూ మధ్య యుద్ధం. అందులో బంధు సహాయమేమీ రాదు. మనసె - కించతోనున్న మనసె శత్రువు. దాన్ని జయిస్తే సర్వమూ అధీనమవుతుంది. లేకపోతే ఏమవుతామనేది నేను చెప్పక్కర్లేదు. ఈ యుద్ధంలో జయించడమె బ్రహ్మాన్ని చేరడం. ఓడిపోవడమె మృత్యువు. అవె మమ-నమమ అనేవి!

'మమ'ను జయించి చతుస్సముద్రమధ్య రాజ్యాన్నంతనూ పాలించినా దురితాలు ఉంటాయి. లేదా మృత్యు ముఖవర్తి అయిపోతాడు మానవుడు. అందుకె కామాన్ని – (అంటే మమతను) జయించాలి. అందుకు "పనులను కర్తవ్యం గనుక చేస్తాను" అనే మనః స్థితిని సంతరించాలి. దైవీసంవత్తు అనే దానికి దోవ అదే. దాన్ని సంపాదించేందుకు వీలుగానే వేదాలు వర్ణాశ్రమ ధర్మమని చెప్పాయి. గుణకర్మ విభాగికమైన వర్ణాలకు వారి స్వభావాన్ని బట్టి స్వధర్మం చెప్పి దాన్ని అనుసరించుమన్నారు. దైవీ సంపత్తిని వృద్ధి చేసుకోమన్నారు.

కోరికనుబట్టి పనులు చేయటమయిందంటె కాముని జయించటం కష్టం. ధృతితో కాముణ్ని నాశం చేస్తాను అంటాడు సాధకుడు. అది మాత్రం కోరిక కాదా నేనెక్కడ చచ్చాను? అంటాడు కాముడు. తపను చేసే వానికి తపో కామన ఉంది. నన్నెవరు చెరపగలరు? అంటాడు. మోక్ష కామం కూడా నేనే నంటాడు. అందుకే కోరిక కోసంగాక ఇది నా కర్తవ్యమని వర్ణాశ్రమ ధర్మం చేస్తూ ఉంటే కాముణ్ని జయించవచ్చు- వృత్రుని ఇంద్రుడు జయించినట్లు!

## 2. అనుగీతలు (మోక్షసాధన)

కురుక్షేత్ర యుద్ధ మయిపోయిన తర్వాత కూడ శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థంలో ఉండి అర్జునుడితో తిరుగుతూ ప్రకృతి సౌందర్యాలు తిలకిస్తూ ఉంటాడు.

ఒకనాడు వారు సభా భవనంలో కూర్చున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు అన్నాడు: "అర్జునా! నేను ద్వారక నొదిలి వచ్చి ఎన్నాళ్ళో అయింది. మా తండ్రిగారిని చూడాలనిపిస్తోంది. మీ అన్నగారినుంచీ నేను వెళ్ళానికి అనుమతి ఇప్పించు. నేను ఇక్కడ ఉన్నప్పుడు చెప్పు" అన్నాడు. మిత్రుడు వెళ్తాననే

టప్పటికి ఇన్నాళ్ళు అయింది అతడొచ్చి - అనేటప్పటికి, అర్జునునకు జ్ఞాపక మొస్తుంది - ఈ మహానుభావునివల్ల తనకు జయం - జ్ఞానం కలిగింది. ఎంత గొప్ప విషయాలో అప్పుడు చెప్పాడు. ఈయన్ను అవి మళ్ళీ చెప్పమని అడుగు తాను అనుకొంటాడు. అప్పుడంటాడు.

"అలాగే అడుగుదాము కృష్ణా! కాని ఆ యుద్ధారంభంలో ఎంతో మహత్తరమైన విషయాలు చెప్పావు. నేను కొన్నిటిని వాటిలో మరచి ఉంటాను - నాకు అవి మళ్ళీ చెప్పవా?"

"ఆ మాటల్ని మర్చిపోయినావా అర్జునా? అవి మర్చిపోతగినవా? అవి మళ్ళీ చెప్పాలంటే సాధ్యమా?' ఆ తత్త్వాన్ని వివరించే కథ చెప్తాను విను - అన్నాడు.

కశ్యపుడనే బ్రాహ్మణుడొకడున్నాడు. అతడు ఒక సిద్ధుడ్ని తత్త్వ విషయం చెప్పమని అడిగాడు ఇలాగే. అప్పుడు ఆ సిద్ధుడిలా చెప్పాడు. నేను ఎన్నో పుణ్యకర్మలు చేసి స్వర్గ భోగాలనూ, పాప కర్మలు చేసి నరకయాతన్లనూ, అనుభవించాను. ఎన్నో జనన మరణాలు పొందాను. ఎందరో తలిదండ్రులకు పుట్టానుగాక. విసిగిపోయాను. ఆ తరువాతనె, ఆత్మ ప్రసాదంచేత ఈ సిద్ధిని పొందాను. ఇకముందు ఇంకా మంచి దశలను పొందుతాను. ఇక బ్రహ్మానందం పొందటం సులువు. ఇప్పుడు నీకు మేలైనదాన్ని చెప్తాను విను. "నా" సంగతి ముందు నీకు చెప్పాలనె చెప్పాను. 'నేను' అనేది శాశ్వతం. ఈ పుట్టుకలూ మరణాలూ శరీరాలకెగాని నేనుకు లేవు— ఈ జన్మల అశాశ్వతను 'నేను' అనే దాని నిత్యత్వాన్నీ ముందు తెలిసికొను.

ఎందుకీ శరీరాలు ఇలారావటం అంటావేమో "చూడు నాయనా! ఈ శరీరం కర్మానుభవంకోసం ధర్మ సాధనం కోసమూ వచ్చింది. ధర్మం చేయడమనే ప్రక్రియ ఈ శరీరం లేకపోతె దేవతలకైనా చేతకానిపని! ధర్మం వల్లనెగాని జ్ఞానం కలుగదు. ఆ కారణం చేతనే ముమ్మందుగా ఈ తనువును రక్షించుకొనాలి. పొరపాట్లు కలుగకుండా రక్షించుకొనాలి. పొరపాట్లనేవి ఏమిటి అంటావేమో-చెప్తాను విను." తన శక్తి బలం సంగతులు చూచుకోకుండా అయినవి కానివి అయిన ఆహారం తీసికొనటం-అతిగా తినడం, అసలే తినక పోవడం-అపక్వమైన ఆహారం తినడం- దుష్టమైన ఆహారం - తిన్న తరువాత

వెంటనే మళ్ళీ తినటం నిద్ర పగటిపూట పోవటం - రతియందే ఉంటుండడం-ఇవి పొరపాట్లు. వీటివల్ల దోషత్రయాలకు శరీరం గురి అవుతుంది.

'అవసరమైన కర్మలను చేయకపోవటం, శరీరానికి అపచయాన్ని కలుగజేస్తుంది. అనవసరమయిన భోగాలు రోగాన్ని కలుగజేస్తవి. కామం. రోషం- వీటివల్ల శరీరం శిథిలమవుతుంది. పైత్య వికారం ఎక్కువై శరీరంలో మర్మ భిన్నం చేస్తుంది. శ్లేష్మం. పిత్తం, వాతం ఇవీ ఆ వికారాలు! శ్లేష్మం గొంతుకకు అడ్డంపడి ఊపిరి సలుపనీక జీవుణ్ణి శరీరంనుంచి వెళ్ళగొట్టేందుకు సిద్ధమవుతుంది. వాయువు అంగాలన్నింట్లో వ్యాపించి నొప్పిని కలిగిస్తూ సంధుల్ని విడగొట్టి శరీరాన్ని క్రూనుగా చేస్తుంది. ఇవన్నీ భరించుతూనే ఇక భరించలేనంటూనె జీవుడు సూక్ష్మ శరీరంతో పాటు ఈ శరీరం వద్దని వెళ్ళిపోతాడు. పాపాలు నరకంలోనూ పుణ్యాలు స్వర్గంలోనూ అనుభవించేస్తాడు. ఈ పాపాలూ పుణ్యాలు మనసుకు సంబంధించినవి. సూక్ష్మ శరీరానివి. ఈ రోగాలూ, సుఖాలూ స్థూల శరీరానికి సంబంధించినవి.

'స్థూల శరీరాన్ని మళ్ళీ పొందుతాడు. ముక్తిని పొందితే తప్ప ఈ సంసరణం ఇలా నడుస్తూనే ఉంటుంది. అందుచేత ముక్తిని పొందటానికి ప్రయత్నించాలి. దానికి కావలసినవేమంటే - దానం, శమం, దమం, బ్రహ్మచర్యం, వ్రత పరిరక్షణం, దయ, పరధనదార వర్జనం, నియమం, యమం, ఇంద్రియ నిగ్రహం, జననీ జనక గురు పూజనం, దేవతాది పితృదేవతార్చనం, సత్యం, శౌచం, ధైర్యం, క్రౌర్య నిరసనం, పుణ్యవృత్తం, శుభసంవిధానం. ఇవి ఆధారంగా మోక్షాన్ని పొందవచ్చు. ఇవి పాటిస్తే మనోబుద్ధులు శుద్ధమవుతయి. అంటె అవి అంతర్గతమైనవై, ఆత్మవైపునకు తిరిగి ఆనందాన్ని అనుభవించడానికి తగినవవుతయి. అప్పుడు ఇక ధర్మాచరణ నుండి మోక్షం కలుగుతుంది. ఇది సూక్ష్మమైన విషయం. బుధజనులను అడిగి అనుసరించి తెలియవలసినట్టిది.

'ఆ స్థితిలో వ్రతనిష్ఠ, ఇంద్రియ విజయం, శాంతి, బ్రహ్మైక భజన తత్పరత నిలిచి అతడి అంతర్యంలో ఉంటవి. అప్పుడతడికి సర్వమూ బ్రహ్మమయంగా అవగతమవుతుంది. అతడిక హర్ష శోకాలచేత కొట్టబడడు. మోహాం

ధకారంలో పడడు. సంసారంలో నిస్సంగం కలుగుతుంది. అలాటి నిస్సంగత్వం కలిగినప్పుడు తత్త్వజ్ఞానం దర్శనమిస్తుంది.

తత్త్వజ్ఞానమంటే 'తత్' ఎలా 'త్వం' గా అయినావో అది. పరమాత్మే నీవుగా ఎలా అయినావో 'అద'ని అర్థం. బ్రహ్మ పరమాత్మ స్వరూపుడు. ఈ వ్యక్తమై అవుపించే ప్రపంచం, ఈ ప్రపంచాన్ని చైతన్యపంతంగా చేస్తుండే శక్తీ కూడ బ్రహ్మలోని భాగాలె. ఈ ప్రకృతినె ప్రధానమంటారు. అవ్యక్తమంటారు. చైతన్యాన్ని బ్రహ్మ ఈ ప్రపంచంలోకి తెచ్చి చేర్చే వరకూ ఉంటున్నదె అవ్యక్తం. చైతన్యాన్ని చేరంగానే వ్యక్తమవుతున్నదంటాము. అందుకె ఆ బ్రహ్మ అనేది అవ్యక్తమూ, వ్యక్తమూ కూడాను అనటం! కాని ఈ వ్యక్తమైన ప్రపంచం ఎల్లప్పుడూ మార్పు చెందుతూనె ఉంటుంది. ఈ క్షణాన గల ప్రపంచం మరు క్షణాన మారినదౌతోంది. ఇంకో విధంగా చెప్పాలంటె ఈ క్షణాన గల ప్రపంచంలోంచె మరుక్షణాన గల ప్రపంచం పుట్టుతోంది. మొదటి ప్రపంచం తరువాతి ప్రపంచానికి అవ్యక్తస్థితి అనచ్చు. ఇలా అవ్యక్తమూ వ్యక్తమూ అయిన బ్రహ్మమె ఎల్లప్పుడూ సర్వత్ర ఉంటున్నదనేది గమనీయం. ఆ బ్రహ్మమేదో ఎప్పుడో పూర్వకాలంలో అవ్యక్తం నుంచి వ్యక్తాన్ని చైతన్యయుతం చేసి వెలయించాడు- అంతటితో ఆతడి పని లేదా ఆ అవ్యక్తం పని అయిపోయిందనుకొంటె ఏమీ ప్రయోజనం లేదు సాధనకు బ్రహ్మ సర్వత్ర ఈ అవ్యక్తం వ్యక్తం కావట-మనే ప్రక్రియా రూపంలో ఎల్లప్పుడూ నిల్చి ఉంటున్నాడనేది గమనీయం.

'వ్యక్తమై ఉన్న ప్రథానం- చేతన లేనట్టిది- క్షరమన బడుతుంది. చేతనము అనేది అక్షరము. అమృతము, ఈ రెంటి కలయిక చేతనే- అంటే చేతనా చేతనాల కలయిక చేతనే భూతాలుద్భవించుతున్నాయి. అఖిల భూతాలకూ పుట్టటానికయిన బీజాలు ఈ రెంటిలోనే ఉన్నాయి. ఈ చేతనం అచేతనంలో చేరిన క్షణాన తాను సర్వత్ర ఉంటుండే చేతనమని లేదా బ్రహ్మమనీ ఈ సంగతులను మరచి ఆ అచేతనానికి తన పరిధిని పరిమితం చేసికొని 'నేనెవడు?' అనుకొన్నప్పుడు ఈ చేతనానికొక పేరుపెట్టి "నేను ఫలాన" అని ఆ పేరునె అనుకొంటున్నాడు. ఆ పేరుతో పిలిస్తె పలుకుతున్నాడు. "'ఛీ' నేను ఇదికాదు నేను ఆ చైతన్యాన్ని వేదబ్రహ్మమను పరమాత్మను" అని అనుభూతి చేసిన క్షణాన, ఆ

జీవుడు ఈ ప్రకృతినీ ఈ చైతన్యలేశాన్నీ (చిత్ చైతన్యాన్ని వేదపరమాత్మ తత్వాన్ని) వేరువేరుగా గ్రహించి పరమాత్మతో ఐక్యం పొందుతాడు.

'ఈ జీవుడు అలాగాక, ఈ సుఖదుఃఖాలు తనవైన అచేతన శరీరాలకు కలుగుతున్నప్పుడు తను బుద్ధిచైతన్యంతోనే వాటిని అనుభూతిచేస్తూ-బాగుంది-ఇది బాగుంది అనుకొంటూ ఉంటే వాటికి వారికి తాను బ్రహ్మమనే విషయం తెలియనూ తెలియదు-తెలియవలసినదీ అక్కరలేదు. అక్కరలేనిదెందుకనంటే అతడు ఈ ప్రపంచంలో సుఖంగా ఉన్నాననుకొంటుంటే ఇక బ్రహ్మవిషయం అతడికెందుకు గనక!! ఈ శరీరం అశుచి అయిందని ఈ సర్వపదార్థాలూ నశ్వరమని కర్మలో పాలుకుపోవటం ఒక రోగమని "అయ్యబాబో నేను దీని నుంచి విడివడేదెల్లాగ"ని గోలపెట్టే స్థితిని పొందితే అప్పుడు తనమోహావేశాన్ని తొలగద్రోయటం ద్వారా మోక్షం పొందాలనీ, ఈ సంసారపు సంగతులను అవగాహన చేసుకొని దానికిదూరం కావాలనీ, ప్రయత్నిస్తాడు. అందాకా సాధన ప్రసక్తిలేదు. కాని అప్పటివరకూ మోహమంటే ఏమిటి దాన్ని తొలగద్రోయటం ఎలాగ అనే విషయాలు చర్చించుకొంటూ బోధను పొందజూడటం అవసరం! అలాకాకపోయినట్లయితే అస్థితి ఎప్పుడో శరీరత్యాగం చేయాల్సివ సమయంలోనో చాల బాధలలోనుండి-అప్పుడిక విచారణ చేయడానికి అవకాశం లేని సమయంలోనో-వచ్చినదైతె ఆ ఆపద దాటిన తరువాత ఆసంగతె మర్చిపోవటం జరుగుతుంది. ఆపద-సంపద-ఆపద-సంపద ఇలా సుళ్ళు తిరుగుతూ ఉండటం సంసరణం నుంచీ బయటపడకపోవటమూ జరుగుతుంటుంది.

'అందుకని ఈ జీవితం ఇటువంటిదనీ మోక్షం పొందవలెందనీ ఈ సంగతులకు చెందిన జ్ఞానం తెలియడానికి ప్రయత్నించటం మనీషుల కర్తవ్యం. ఐతే మరి ఇవి తెలిసినంత మాత్రాన మోక్షం వస్తుందా అంటే 'అ మాత్రాన రాదుగాని పై చెప్పినట్టివైన, బాహ్యవిషయికమైన సంగతులయందు రోత కలిగిన క్షణాన ఈ జ్ఞానంవల్ల మోక్షం కలగటం తథ్యం. రోత అంటే కేవలం తిట్టుకోవటంకాదు నిజమైన అనాసక్తత కలగటమనేదని గుర్తుంచుకోవాలి.

'మరో విషయమేమంటే, ఇవి తెలియటం ఆరంభించి, బుద్ధిని, మనసును మాత్రమేగాక శరీరాన్నికూడ సాధనకు గురిచేసి, తెలిసికొన్న విషయాలను స్థూలసూక్ష్మ కారణ శరీరాల మూటింటికి అనుభూతి అయేటట్టుచేస్తే అంతర్గత

మైన సాధనవల్ల మోక్షం పొందవచ్చు. నేను అలా అనేక అనుభవాల తరువాత అసంప్రజ్ఞాత సమాధిద్వారా నిరాకారుడైన పరమాత్మను శరణుపొంది లోక వ్యవహారాలను వదిలాను.

పర్యవసానంగా మోక్షం ఈ ప్రపంచ సుఖదుఃఖాలకంటె గొప్పదనీ, అక్కడ పరమమైన ఆనందాన్ని పొందవచ్చుననే, ఈ సంగతులు కార్యకారణ సంబంధమైన స్నాయువులతో బద్ధమైన బుద్ధికి అవగతమయితె,-మనోకాయాలక యిన సాధనను వ్యక్తి అరంభించడం సంభవం అవచ్చు. ఆ సాధనా ఫలితంగా బాహ్య సంసర్గాన్ని వదలి అంతర్దృష్టితో మోక్షపదాన్ని అందుకోవటం వ్యక్తికి గల అవకాశం! ప్రయత్నంవల్ల మోక్షం పొందవచ్చుననేది ఇక్కడిబోధ. ఇప్పుడు నాకు ఉత్తమసిద్ధి ప్రాప్తించింద"ని కాశ్యపునకు సిద్ధుడు చెప్తాడు.

'బుద్ధి నిస్సందేహంగా ఇప్పుడు చెప్పిన మోక్షం ఉన్నదనీ అదే తనకు కలుగగలదనీ నమ్మినట్లయితె వ్యక్తి చేయాల్సిన పనేమిటంటే- (1) పవిత్రమైన చోట కూర్చోవాలి. హృదయంలో అంటే-మనసులో-ఏచింతా లేకుండా వదలి వేయాలి. ఏవో ఊహలు వస్తుంటె సాధనను మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకొని మన సును తెచ్చి శ్వాసమీదనో ఎక్కడనో పెట్టుతూ ఉండాలి. అలా సాధనచేస్తే అప్పుడతడు అంతర్ముఖుడైనవాడై మోక్షాన్ని పొందగలడు: లేదా (2) సర్వ భూతాలకూ మిత్రుడుగా కావాలి. సర్వమునూ సహించకలగాలి. జితేంద్రి యుడు కావాలి. నిర్భయుడు కావాలి. కామక్రోధాలను వదలాలి. శమంకలిగి ఉండాలి. ఈ సాధనచేసినా మోక్షాన్ని పొందగలుగుతాడు. ఇది పరమేశ్వరు నిపైన వాని సర్వత్ర స్థితిపైననూ నమ్మకం కలిగినవానికే సాధ్యమనిపిస్తుంది. లేదా (3) మానాభిమానాలు వదల-ఇది చాల ప్రమాదకరమైనట్టిది-సర్వభూతా త్మకత్వ దర్శనం కలిగినవాడు కావాలి. (4) లాభా లాభాలు, ప్రియా ప్రియాలు, సుఖదుఃఖాలు సమానంగా భావించుతూ అనపాటు, అవజ్ఞతలేక, ధర్మ తంత్ర లోలుడుగాక ధర్మశీలుడై, దానినే కామించేవాడుగాక, తనకు వచ్చినవారనీ, నచ్చనివారనీ ఇతర్లను భావింపక, ధర్మార్థ కామాలు వదలి మోక్షమే పరమమని ఎంచుతూ అకర్మ భావంతో మెలగుతూ, తాపత్రాయాలు వదలి, వైరాగ్య సుస్థిరుడైనవానికే మోక్షం కలుగుతుంది. ఈ నాల్గు సాధనలలో దేనిని పాటించి నిల్చినా మోక్షం కలుగుతుంది. శుకుడు చెప్తున్నాడు. ఇంతే కాదు. "అసమాలంబ మశబ్దము, రసగంధ స్పర్శరూప రహితగుణ ముల్లసిత

గుణమగు వెలుగు, నభ్యసన నియతిపరుడొకండు వడయుంబున్రా” సర్వ సంకల్పములను వర్జింపకలిగి, చిత్తంలో వరమశాంతిని నెలకొల్పుకొంటె నిర్వృతిని పొందగలడు.”

‘ఇలా అసిద్ధుడు కాశ్యపునకు చెప్పాడు. పైగా యోగిజనాలకు అనువైన భావం చెప్తాను విను! యోగులు దానివల్లనె ఆత్మ దర్శనాన్ని పొందుతారు అంటాడు. అది ఏమిటంటే,—

‘ఈ శరీరం ముంజవంటిది. ముంజలోని నిషీకంవంటిది ఆత్మ! ఈ శరీరాన్ని వేరైనదిగా చూచి ఆత్మ తానసుకొంటె జనన మరణగతి తొలగి పోతుంది. ముక్తి పొందినవాడికి జరామరణాలుండవు. బ్రహ్మచర్యమనెదాని ద్వారా (పరమేశ్వర) భక్తులకు తనకు కలిగిన పదాన్ని ఈయడానికి శక్తుడవు తాడు.

‘తనయందే తనను (పరమేశ్వరుని) చూడగలిగినవాడు పొందే సుఖం ఇంకే దానివలనా కలుగదు! అది రావాలంటే ఒకానొక అనుష్ఠానాన్ని విసువు లేకుండా పాటించాలి. ఏమిటంటే—

‘మనసును అంతర్వర్తిగా చేయాలి. బయటకు పోనీరాదు. అది తన శరీరంలో ఎక్కడ అనువుగా నిలబడితె అక్కడనె నిలపాలి. తన దంతాలు—జిహ్వ-కుత్తుక-దవడలు-కంఠనాళం-హృదయం ఇంకా లోపల ఎక్కడ అను వయితె అక్కడ నిలపాలి మనసును.

‘పది పశువుల్లో ఎక్కడో పెట్టిన పాలకుండను తానెక్కడున్నా చూసు కొంటూ పశువుల నదలిస్తూ రక్షించుకొనె పశులకాపరిలాగా ఆత్మను ఎప్పుడూ చూస్తూ ఉండాలి. ఈ చూడటం ఇంద్రియాలతోకాదు. అతీంద్రీయమైన చూపుతో చూచుకోవాలి. సకల మలాలనూ వదిలిన ప్రదీప్త మనసుతో చూడాలి. శరీరంతో వేరై నిలిచియున్న ఆత్మనిగనటం అనేదె సాధన. దానిని చేయా ల్సింది.”

ఇలా శిష్యునకు చెప్పినట్లు సిద్ధుడు శ్రీకృష్ణునకు చెప్పాడు.

ఇది ప్రథమాశ్వాసం

# మహాభారత కథలు

## అశ్వమేధపర్వం - ద్వితీయాశ్వాసం

## 1. బ్రాహ్మణ గీతలు (అంతర్యాగం)

కృష్ణార్జునులు మయ సభా భవనంలో మాట్లాడుకొంటున్నారు. శ్రీకృష్ణుడు అనుగీతలు చెప్తూ మనసుతో ఎల్లప్పుడూ ఆత్మను చూస్తూ ఉండాలి. అదె బ్రహ్మవిద్యా రహస్యమని చెప్పి "ఇకపోదాం" అంటాడు. కాని, అర్జునుడు కదల్లేదు. విషయం ఇద్దరకూ ప్రియమై నడుస్తోంది కనక ఆ విషయంలో మునిగి ఉన్నాడు అర్జునుడు. అందుకని శ్రీ కృష్ణుడు బ్రాహ్మణ గీతలనే దాన్ని చెప్పనారంభించాడు. ఒక బ్రాహ్మణుడు తన భార్యకు చెప్పిన సాధననే బ్రాహ్మణ గీతలు అని పిలుస్తారు. ఆ బ్రాహ్మడెవరని చివరకు అర్జునుడడిగితే శ్రీకృష్ణుడు, "నా బుద్ధి! భార్య నా మనసు!" అన్నాడు, ఓహో ఇదంతా కేవలం తాను అనుభూతి చేసికొన్న విషయమన్నమాట అని అర్జునుడు గ్రహించాడు.

భార్య వచ్చి 'నాకు అధ్యాత్మ విషయం చెప్పండి' అన్నది. బ్రాహ్మణునితో. ఆ బ్రాహ్మణుడు చెప్తున్నాడు—

"కర్మల్ని, చేయచ్చు, చూడచ్చు, వినచ్చు, కర్మ చేస్తే ఫలాన్ని సమస్త సిద్ధుల్నీ పొందవచ్చనీ వేదవాద రతులంటారు. కాని అది నిజమైన [illegible] కాదు. అధ్యాత్మ విషయం - కర్మ వల్లగాక — అకర్మవల్ల అనుభూతి చేయాల్సి ఉంది. అకర్మకూడ మనసుయొక్క ఒకానొక స్థితే కనుక అది [illegible] నంటారు కొందరు. ఆ వాదం మనకక్కర్లేదు: బ్రహ్మ [illegible] అకర్మ స్థితి పొంది కర్మలు చేస్తూ అక్షరుడ్ని ఉపాసిస్తూ [illegible] పొందుతూ ఉన్నాడు.

"అక్షరమైనదాన్నిగూర్చి చెప్తాను [illegible] శబ్ద స్పర్శ రూప రసగంధాల్ని ఆధారంగా కలిగింది కాదు. [illegible] త్వక్ చక్షు జిహ్వాఘ్రాణాలుద్వారా దాన్ని గ్రహించలేము. [illegible] బుద్ధివల్ల మాత్రమే.

అక్షరుడ్ని గ్రహించగలము. బుద్ధి కా అవకాశమెందు కొచ్చిందంటే బుద్ధి మాత్మ చిత్ లోది. తన్మాత్రలుకూడ బుద్ధిలో నుంచీ పుట్టినవె. అందు బుద్ధికి ఈ అవకాశముంది.

'దేహాన్ని ప్రాణాది వాయువులద్వారా, ఆ అక్షరుడె నడిపిస్తున్నాడనేదా బుద్ధి గ్రహించాలి. దానికిగాను ఆ బుద్ధి, ముందుగా 'అమలినం' కావాలి. ఆ రుడు ఆకాశం. ఆకాశంలేకపోతే గాలి ఎలా వుంటుంది?" ఉండదు. అందుక ఆకాశం-అన్నిటికీ-జీవుని ప్రాణాలకు సహా ఆధారం! ఆ వాయువులు శరీరం చరిస్తున్నంతకాలమున్నూ వ్యక్తి అంతర్యాగమనేదాన్ని చేసి పరమాత్మ స్థి నందుకోగలడు. అంతర్యాగ ప్రకారం చెప్తాను విను.

'ఈ యాగం చేసేది మానవుడె- జీవుడు. ఈయాగానికి వైశ్వానరుడు శ రంలోని ఆత్మె. అతడు శరీరంలో సర్వత్రా వ్యాపించి ఉంటాడు. ఈ అగ్ని కూడ ఏడు నాలుకలున్నాయి. ప్రజ్వలిస్తూ ఉంటయి. అవేమంటే ప్రాణాల ఐదూ, మనసూ, రజోగుణంలో పుట్టిన బుద్ధీలనేవి. ఈ బుద్ధికీ చిత్ నుంచీ కల గిన బుద్ధికీ తేడా ఉంది. ఇంతకు ముందు చెప్పింది మొదటిది. ఇది రెండోది. ప్రజ్వలించే వీటికి వరసగా సమిధలేవీ అంటే వాసననిచ్చే ఘ్రేయం, తినబడ కలిగె భక్ష్యం, చూడబడగలిగే దృశ్యం, తాకబడగలిగే స్పృశ్యం, వినబడే శ్రావ్యం, చింతించబడె విషయం, బోధకాగలిగే బోద్ధవ్యం. ఈ ఏడు సమిధల్ని ఆ యేడు అగ్ని నాలుకలకూ ఆహుతి చేయాలి. అవన్నీ ఆ ఆత్మ అనే వైశ్వాన రునకె. అలా ఆహుతి చేయించటానికి ఋత్విజులే - ఇంద్రియ చైతన్యాలు. ఘ్రాణ చైతన్యం, రస చైతన్యం, రూప చైతన్యం, స్పర్శా చైతన్యం, శ్రవ్య చైతన్యం మంతనానికైన చైతన్యం బోధకమైన చైతన్యమూను. ఇవన్నీ మనసులో ఉన్నవె. వీటిని అలా ఆపరమాత్మకు అర్పణం చేయడమె సప్త హోత్ర విధానం.

అంటే మనం ప్రతి క్షణానా చేస్తున్న పనుల్ని యజ్ఞపరంగా చేయడమని అర్థం. సర్వమూ ఆ పరమాత్మకు క్షణక్షణానా అలా అర్పణం చేయడమె అంతర్యాగం. ఈ యాగం సర్వకాలాల్లో మనిషి చేస్తుండాలి. అంటె శబ్ద స్పర్శాదుల్ననుభవించే ప్రతి క్షణంలోనూ ప్రాణాది మనో బుద్ధులనే అగ్ని జిహ్వల్ని తలుస్తూ అంతర్దృష్టి పొందుతుండాలని బోధ.

కొందరు వైశ్వానరుడికి పది నోళ్ళు అంటారు. 1) దిక్కులు 2) వాయువు ) సూర్యుడు 4) చంద్రుడు 5) పృథివి 6) అగ్ని, 7) ఇంద్రుడు 8) విష్ణు ) ప్రజాపతి 10) మిత్రుడు అంటారు. ఈ జిహ్వలకు హవిస్సులు, శబ్ద, పర్శ, రూప, రస, గంధ, వక్తవ్యకర్తవ్య గంతవ్య విసర్గ ఆనందాలు. పత్విజులు-శ్రోత్రత్వక్, చక్షు, జిహ్వ, ఆఘ్రాణ వాక్ పాణి పాద పాయూ స్థలు. అనగా వీటి సహాయంతో ఆ సమిధలను పరమాత్మకు అహుతి చేయాలి ంనిషి. తనకు కాదనేది పరమైన సంగతి. ఇదీ అంతర్యాగం.

ఇదంతా బుద్ధి ద్వారా నడపాలి. వేదవాదరతులు చెప్పే యజ్ఞంవల్ల రాక్షం రావడం నిత్యసత్యమైన విషయం కాదు. ఈ పనులు ఈ అవగాహన సికొనడాలు అన్నిటినీ బుద్ధే చేయాలి. దానిని ప్రకాశమానం చేయడానికే ఈ ద్య నేర్పడం! బుద్ధికి ఈ అంతర్యాగాలు చేయకలిగిన బుద్ధి సంపాదించడానికే ; వేదకర్మలు చేయడమనే ఉపాయం!!

ఇంకా వినాల్సింది ఉన్నది యాగం గూర్చి ! విను :

యజ్ఞాల్లో 'ఓం' అనే ఘోష ముఖ్యమైంది కదా! ఆ ఓంకారంతో పాటె వాణి' కలిగింది. అది రెండు రకాలు ఘోషిణి అనీ అఘోషిణీ అనీ! వినుపడేదీ నుపడనిది అనేవి!! ఈ రెంటిలో అఘోషిణి గొప్పది. అదె అవ్యయ రూప వ్య ప్రభావోజ్వల బ్రహ్మవాదిని! ఆ అఘోషిణీ స్థితిలోనే జీవుడు బ్రాహ్మీ తిని పొందగలిగేది. మహానందకరమది! మనసు రెండు రకాలు ఒకటి స్థావరం- త్మకు దగ్గరగా ఉండేది. ఇంకొకటి జంగమం. వాక్కుకు దగ్గరగా ఉండేది. ఈ జంగమమయిన మనసుకంటె వాణి గొప్పది. వాణికంటె స్థావరమైన మనసు గొప్పది. వాణి నుంచే అక్షరాలు, మంత్రాలు, స్వరం, శబ్దాలు కలిగినయి. ఇందువల్లె దానిని (ఘోషిణి అఘోషిణి అనె ఓంను) వాణి అంటున్నాం.

ఈ వాణి ప్రాణ వాయువును పొందినదై నిలుస్తుంది. ఐతె ప్రాణా పానాలు విడిగా వుండవు! ప్రాణ వాయువును పొందంగానే అపానవాయువును చేరినదై వాణి బయటకు వినపడుతుంది. ఇది మామూలు. ఇక అంతర్యాగంలో ఈ ప్రాణా పానాలమధ్యనున్న ఉదానంతో కలిసి పోవాలి. అంటె ఇక బయ టకు వినపడే అవకాశం లేదు. అప్పుడు వ్యాన వాయువుతో శరీరం అంతటా

ఆక్రమించినతె, మనసు సమాన వాయువులో సుస్థిర మవుతుంది. అదె ము
కారణం. ఇది ఒక మంచి సాధన.

మనసు ఇంద్రియాలకంటె గొప్పది. స్థావరమైన మనసైతె అది వ
కంటె గొప్పది. అంటే 'ఓం' కంటె గొప్పదన్నమాట. కాని అది ఆత్మ
దరినె ఉన్న బుద్ధి అయి ఉంటాలి. అదె అమలిన బుద్ధి! ప్రాణాది వాయువు
దేనికది అది చేసే పని విషయంలో ప్రత్యేకత కల్గి ఉంటుంది. పురుషుని
సమానవాయువువల్ల శుక్లం, స్త్రీలో వ్యానవాయువు వల్ల శోణితం కలిగి సృ
కర్త అనుగ్రహంవల్ల కలిసి స్త్రీకి చూలునకు కారణమవుతయి! ఇక ప్రా
వాయువు పైకి చలిస్తే-అపాన వాయువు ఇంకో ప్రక్కకు చలిస్తుంది. ఈ రెండ
ఒక చోటే ఉంటయి. ఉదానవాయువు ఈరెంటి మధ్యా ఉండగలదు. అది అగ్
రూపంలో ఉంటుంది. అదె సర్వదేవాత్మకుడంటారు. ఉదాన రూపమంటారు.

ప్రాణాపానాలు అనేవి మన ఈ బయటి ప్రపంచంలో ద్వంద్వా
వంటివి. ద్వంద్వాలను, "ఛీ-వద్దు-పో" అన్నట్లె అంతర్యాగంలోగాని బహి
ర్యాగంలోగాని వీటిని వదలాలి. అందుకె గాలిపీల్చి కుంభకంతో ఉదా
వాయువుతో పాటు అనుసంధానం చేయాలి! అప్పుడు పరమశాంతిని పొంద
తాడు ఉపద్రష్ట - అంటే యజ్ఞకర్త! ఆ శాంతే బ్రహ్మ! ఆ బ్రహ్మె ఉదా
మనేది-మహా ప్రస్తవనేది అన్నాడు నారదుడె!

బ్రాహ్మణుడు బ్రాహ్మణితో:- "ఇంకోపరమ రహస్యం చెప్తాను విను"
అన్నాడు.

"మనం ఈ పంచేంద్రియాలతో పనులు చేస్తాము. ఈ కర్మలకు కారణ
మేమిటి అంటే వాసన చూడటం, తినటం, తాకటం వినటం చూడటం తలచడం
నిశ్చయించటం అనే ఏడు నేర్పులిన్ని సంతృప్తి పరచడమె! వీటిద్వారానే జీవుడు
విషయాను భూతి పొందుతూ ఉంటాడు. ఈ అనుభవం పొందంగానె కాంక్ష
అప్పటికి తీరుతుంది. ఈ కాంక్షలు వాసన రూపంలో ఈ మనో బుద్ధుల్లో దాగి
ఉన్న కారణంచేతనే ఇంద్రియాలిన్నీ ఈ శరీరాన్నీ సంతరించుకొని జీవుడి
సూక్ష్మ శరీరం పుట్టుతున్నది. అలాపుట్టి ఇలా తీర్చుకొంటున్నాడు వాసనలను.
పూర్వ పుణ్య పాపాల ఫలితాన్ననుసరించి!

"ఈ విషయానుభవాల్ని కోరడాన్ని మానడమె నిష్ఠ. అందుకోసం పుట్టామంటూ - మానేయుమంటే ఎలా అంటావు. పాత వాసనల్ని అనుభవించేయడం తప్పకపోవచ్చు. క్రొత్త వాసనల్ని చేకూర్చుకొనే పనిచేయవద్దనటమె నిష్ఠ చేయుమనటం. అలా ఎందుకు చేయాలంటె అదే మోక్ష హేతువు.

అ నిష్ట చేసేదెలాగంటే వివిధ విషయాలను స్రుక్కులో వేసి హవిస్సులుగా వైశ్వానరునిలో వ్రేల్చెయ్యాలి. ఆ స్రుక్కు ఈ అంతర్యాగంలో ఏమిటీ అంటే - అది ఉదాసీనము. అలా సమర్పించినపుడు ఆత్మ స్వరూపం ప్రజ్వలితమవుతుంది. అజ్ఞానమనే ధూమం రాదు. అంటే వాసనా ప్రభావం ఉండదని అర్థం. ఇదె మోక్ష ప్రకారం! ఈ అంతర్యాగానికి మోక్షమె పర్యవసానం.

మనిషి భోక్తగా అనుభవం కోసం పనులు చేస్తున్నంతకాలం అది బంధనమె. అలాగాక అంతర్యాగంలో ఉపద్రష్టగా (కర్తగా) నున్నట్లయితె అది మోక్షదం. ఈ యజ్ఞానికి సర్వసంగ పరిత్యాగమె దక్షిణ- దీనివల్ల సకలాత్మకైన నారాయణమూర్తి ప్రీతుడౌతాడు. అప్పుడు తానున్న స్థితె ముక్తి.

ఐతె ఇక్కడీ ప్రపంచంలో ఈ శబ్ద స్పర్శ రూప రసగంధాల్ని అనుభవించటం ఉండదా అని శంకిస్తారు. నీ మనోబుద్ధులప్పుడిక్కడ ఉంటేగదా! కేవలం ఇంద్రియాలిక్కడె ఉన్నా అవి ఇచ్చే విషయాలను నీ బుద్ధిపరమాత్మకు ఆహుతి చేస్తూ అంతర్యాగంలో నిమగ్నమయి ఉండటం చేత, ఈ క్షరాత్మికమైన ప్రపంచంలో కమల పత్రజల బిందువులా ఉంటాడు మనిషి. అంతర్యాగంలో పరమాత్మానుభవం గట్టిగా పొందుతూ ముక్తి పొందుతాడు"

బ్రాహ్మణుడు బ్రాహ్మణితో ఇంకా అంటున్నాడు. హింస కూడదంటున్నారుగనుక బాహ్య కర్మలు నేను వదలి వేశానని నీవనుకొంటున్నావు. ఈ బహిర్యజ్ఞాలు నేను మానిన కారణం అంతర్యాగం వల్ల తక్షణ ఫలం ఆధ్యాత్మికంగా కలుగుతుందనె! ఈ హింస- అహింసల విషయమంతా బయటి ఆలోచనలె. అది కూడ బుద్ధిచేస్తున్న కర్మ. అలా చర్చించటం కూడా క్షరాత్మికమైన అనుభవమెనని మరువకు!

యజ్ఞంలో పశు విశసనం హింసకాదా? అంటాడు ఒక యతి ఆ యజ్ఞం చేసే అయన-"వేదం చదివినవాడివలా అంటావేం? ఆ పశువు పుణ్యగతికి

పోతుం" దన్నాడు. కాని యతి "అది పుణ్యగతికిపోతే పోవచ్చు - వేదమేకదా హింస పాపమని చెప్పింది" అంటాడు. అప్పుడు అధ్వర్యుడు చిఱునవ్వు నవ్వి ప్రశ్నిస్తాడు.

"యతీ! నీవు సమాధిలోకిచేరి ప్రాణనిరోధంచేసి, మనోలయం చేసిం తరువాత యోగనిరతిని పొందుతావు! అది భగవంతుడు పుట్టించిన ఈ శరీరానికి చేస్తున్న హింస అవుతుందా కాదా?"

యతి చెప్తున్నాడు ఆశ్చర్యపోయి-"అయ్యోరామ! పరమతపం చేసి, పరిపాకమంది, చిత్ సుఖాన్ని పొంది స్మశానానికి పోనక్కర్లేని దివ్యస్థితిని హింస అనటం మూఢతేగాని బోధ అవుతుందా?"

అధ్వర్యుడు :- "యతీ! నేనూ ఈ పశుయజ్ఞం చేసేటప్పుడు మీరిప్పుడనుగ్రహించినట్లే దర్శనం చేస్తూ ఉంటానయ్యా! చిత్‌నూ అచిత్‌నూ విడగొట్టి. యజ్ఞంచేసేటప్పుడు కించిత్తయినా హింసఉండటం సంభవంకాదు స్వామీ!" ఇలా అంటూ ఆనందబాష్పాలు వదుల్తాడు అధ్వర్యుడు.

యతికూడ ఆ స్థితికివచ్చి ఆనందపడి-"కాని పశుయజ్ఞంకంటె తపోయజ్ఞం గొప్పదని చెప్పడానికి ఇలా మాట్లాడానయ్యా! ఏమంటావు?"

అధ్వర్యుడు,-"ఆ విషయం వాస్తవమె తపోయజ్ఞం గొప్పదె" అన్నాడు.

కనుకనే నేను ఈ తపోపరమైన అంతర్యాగంచేసి బాహ్యయజ్ఞాలను వదలుకొన్నాను-అన్నాడు బ్రాహ్మణుడు. ఈ అర్థాన్నె పరశురాముని కథ చెప్తుంది. ఆయన రాజులనందరినీ రోషంతో సంహరించి, ఆ రోషాగ్ని పరితృప్తమయేందుకు పిరాధ్వరం చేస్తున్నానన్నాడు. పరమేశ్వరుడనేవాడే పిరురంటె. వాని అర్చనె పిరాధ్వరం. అప్పుడు మునులు ఆ యజ్ఞంకంటే తపోయజ్ఞం గొప్పదని చెప్తారు. పరశురాముడు గొప్ప తపస్సుచేస్తాడప్పుడు. తపనుతోనే ఇంద్రియాల్ని జయించాలి అన్నారు మునులు. అలర్కుడలా జయించాడన్నారు. ఈ ఇతిహాసాలు చెప్పేబోధ సత్యమైంది!

గుణాలవల్లనె శత్రువులు ఉద్భవిస్తయి-సత్త్వంవల్ల స్తంభన, అతిమానం, హర్షం అనేవీ, రాజసంవల్ల- క్రోధం - సంరంభం-శోకములూ అనేవీ, తమస్సు

వల్ల మోహం-తంద్రత, స్వప్నాలు కలుగుతయి. ఈ 11 సీ, ఇంద్రియాలు ఐదింటినీ మనసునీ-మొత్తం 15 నింటినీ జయించాలి. దానికి సాధనచేయాలి. అంబరీషుడలా చేశాడు.

జనకరాజు కథవిను. ఆయన ఎన్నిటినో జయించి మనుతున్నవాడు. ఆయన యెదుట, యమధర్మరాజు ఒక బ్రాహ్మణుడై వచ్చి ఎదుటనే ఒక అనాచారమైన చెడ్డపని చేస్తూ అవుపడుతాడు రాజుకు. ఆరాజు "నావిషయాన ఉండనే వద్దుపో" మ్మంటాడు. బ్రాహ్మణుడు రాజుకళ్ళల్లోకిచూసి చిఱునవ్వి "నీవిషయ మెంతవరకో చెప్పు వెళ్ళిపోతానంటాడు రాజుకు వెంటనె తన పొరపాటు తెలిసింది. అప్పుడంటాడు "అవును నాకేమీలేదు. ఈ రాజ్యం నా అధీనంలో ఉన్నా దానిపై నాకు మమకారంలేదు, ఈ పంచభూతాల ప్రపంచమంతా చెడిపోయేదే గనుక-శాశ్వతుడైన 'నా'ది అనడమెలా? ఈ పంచభూతాల్ని దాటి నిన్ను పొమ్మంటంలో ఎంతపొరపాటు చేశాను!" అన్నాడు. యముడు దర్శన మిచ్చి ఆశీర్వదించి వెళ్ళిపోతాడు.

ఇదంతా బ్రాహ్మణుడు బ్రాహ్మణితోచెప్పి.-"ఇక నేను లోకంలో కలిసి వర్తించను. ఇప్పుడు నిజమైన బ్రాహ్మణుడనైనాను. జీవన్ముక్తుడనైనాను. సమస్త జగత్తునూ వ్యాపించి ఉన్నాను. నా స్థితికి స్వర్గంకూడ సమానంకాదు. నేచెప్పిన మాటల్ని మననం చెయ్యి. "వ్యక్తి-అరణి. గురువు ఉత్తరారణి తపమె మథనం. దీనివల్ల జ్ఞానవహ్ని పుట్టుతుంది. వ్యక్తి, నిర్గుణత్వ నిరూఢుడయిన క్షేత్రజ్ఞుడనేది తెలిసికొను"అన్నాడు.

శ్రీకృష్ణుడీ బ్రాహ్మణ గీతలను అర్జునునికి చెప్పంగానే అర్జునుడు చేతులు జోడించి "కృష్ణా ఎవరీ బ్రాహ్మణుడు ఎక్కడున్నాడు" అంటాడు.

శ్రీకృష్ణుడు నవ్వి-"బ్రాహ్మణుడు నాబుద్ధి-బ్రాహ్మణి నామనసు. ఇదంతా వారిద్దరిమధ్యగల మంతవ్యం!" అన్నాడు.

అర్జునుడు తెరచిననోరు మూయడానికి కొంతసేపు పట్టింది. అప్పుడు నిట్టూర్చి నాకు పరబ్రహ్మాన్ని ఎఱిగింపజేయవయ్యా!" అంటాడు. అధ్యాత్మ తత్త్వం తెల్పుమని అర్థం!

## 2. ఆధ్యాత్మ తత్త్వం

శ్రీకృష్ణుడు అర్జునుడికి అధ్యాత్మ తత్త్వం చెప్తున్నాడు :

"బ్రహ్మమనేది సత్యం. అది అబద్ధమనుకొనే వాళ్ళకుగాని 'ఉందో లేదో' తీసెయ్-అనే వాళ్ళకుగాని అధ్యాత్మ తత్త్వం అందదు. బ్రహ్మంలోనే భూతాలు పుట్టి దానిలోనె అణిగిపోతున్నాయి అనేది అర్థంచేసికొనటంవల్ల అధ్యాత్మం తెలుస్తుంది. ఆ బ్రహ్మాన్ని సేవించటమె అధ్యాత్మ తత్త్వం అని ముందు ఎఱుగాలి.

ఎలా పుట్టాయి ఈ భూతాలన్నీ బ్రహ్మంలో నంటె-ముందు ప్లానుగీచి నేలమీద గుర్తుపెట్టి తర్వాత మనం ఇంటిని నిర్మిస్తున్నట్లు రాళ్ళూ సిమెంటు ముందు తెచ్చిపెట్టుకొన్నట్లు బ్రహ్మము ముందుగా 24 తత్త్వాలను సంకల్పించి ప్రభవింపజేశాడు. వాటికి రూపమె ఈ ప్రపంచం! ఈ శరీరం!! ఈ సృష్టి రహస్యం సంపూర్ణంగా ఎఱుగటం సాధారణులకు అసాధ్యం. కాని త్రిగుణాలను దాటినవారికి సాధ్యమె! ఈ ప్రణాళికా భావమె అవ్యక్తమనేది! దాన్నె తెలిసికొనాల్సిందిన్నీ.

అది ఇంకా వ్యక్తంకాని స్థితిలో అవ్యక్తమంటాము దానినుంచీ మహత్ తత్త్వం ముందు పొడసూపింది. ఇది బుద్ధి, మతి, సంవిదులాగా గొప్ప గ్రహింపు కలిగినశక్తి! ఆ మహత్తత్వంనుంచీ అహంకారం పుట్టింది. అది చేస్తాను ఇదిచేస్తాను' అనే శక్తియుతమైన భావమిది! ఈ అహంకారంలో మూడు గుణాలుత్పన్నమై ఉన్నాయి. ఇవి విడివిడిగా ఉండవు. కలగలుపుగా ఉంటయి. ఈ గుణ తత్త్వాలతో అహంకారంలో ఆకాశతత్త్వం, అందులోంచి వాయుతత్త్వం, దాంలోంచి తేజస్తత్త్వం అలాగే జలతత్త్వం పృధ్వీతత్త్వం కలిగినయి. వీటి గుణాలె శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. వీటిని గ్రహించేందుకు భగవంతుడు ప్రణాళికలో శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా ఘ్రాణాల్ని ఊహించాడు. పృథివ్యాపస్తేజో వాయురాకాశాలూ ఊహించాడు. ఇవన్నీకలిపితె 20 తత్త్వాలయినయి. అవ్యక్తమని మొదటచెప్పినదొకటి. మనను బుద్ధి అహంకారము-ఇవన్నీ కలిపితె మొత్తం 24 తత్త్వాలు.

ఈ 24లో బుద్ధి మనసు వేఱుగా చెప్పిన కారణం, మలిన బుద్ధె మనసు-బుద్ధికి విచక్షణాజ్ఞానం ఉంది. అది ఆత్మవైపు తలుపుల్ని తెరువగలదు. మనసుతో కలిసి తిరగనూ గలదు. మనసు శరీరంలో ఉండటంతో పాటు అది ఇష్టానిష్టాల్ని పెంచుతూ మాలిన్యాలకు మూలమయి నిలుస్తోంది. భగవంతుడు సృష్టించిన ఈ జగత్తులోని పదార్థాలను యథాతథంగా గ్రహింపక వాటితో తన ఇష్టాఽయిష్టాలను జోడించటం వల్ల ఈ మాలిన్యం కలుగుతోంది. ఇష్టమైన వాటిని మళ్ళీ కావాలని కోరటం అయిష్టమైనవి వద్దె వద్దని త్రోసివేయటం- ఇలా- మలినాలు ద్విగుణీకృతం త్రిగుణీకృతం అయిపోయినయి.

ఆ మలినబుద్ధి వల్లనే సత్త్వ విషయం తెలిసికోవాలన్నా సాధ్యం కాదు. జీవుని ప్రక్కనే ఉన్న యీ మలిన బుద్ధి జీవుని భ్రమలోనే ఉంచేస్తూ ఉంటున్నది. ఈ జీవుడెవరనేది తెలియాల్సిందె. అది 25వ తత్త్వం. అతడె మానవుడనేవాడు. జీవుడే ఈశ్వరుడంటూ కుగదా! 25వ తత్త్వమనడమెందుకు అని శంక కలుగుతుంది! కాని 26వ తత్త్వమని చెప్పే పరమేశ్వరునికీ ఇతడికీ కొంచెమే తేడా ఉండటంచేత అలా తత్త్వాల్తోపాటు చెప్పారు.

పరమేశ్వరుడి లక్షణాలు సత్, చిత్, ఆనందాలు. ఆయన మహానందంలో ఉంటున్నపుడు చిత్ ప్రతిఫలించింది. ఆ చిత్‌లో తన ఉనికి చూసుకొన్నాడు పరమాత్మ: ఏం కన్పడింది? ఈ సర్వమూ అవుపడింది. సర్వ ప్రపంచాలూ అవుపడ్డయి. అరె! నేనెవరు అనుకొన్నాడు. ఆ చిత్ ఫలకంలోని ప్రతి అణువూ నేను ఫలాన. నేను ఫలాన. ఇంతవరకె ఆ పైది నేనుకాదు! అంటూ నామం రూపం స్థిరంచేసి చెప్పుతున్నట్లవుపడ్డది. పరమాత్మ నవ్వి-భేష్ జీవుడా!-నువ్వు వేరయితె ఏంచెస్తావో చెయ్యి. నీకర్మఫలం నీవనుభవించు అదొక సరదా! అన్నాడు. అభ్రమలో పడ్డ పరమాత్మ భాగమె జీవుడు. ఆ పృథక్ భ్రాంతి పోతె నిజానికతడు పరమాత్ముడె. పరమేశ్వరుని బింబానికీ కలిగిన ఈభ్రాంతి వల్లనె మలినబుద్ధి జీవుణ్ణి ఆపిస్తుంచటం కలుగుతోంది. 'నేను మగవాణ్ణంటాడు. నేను మాలవాణ్ణంటాడు. నేను బ్యాక్‌వర్డు క్లాసంటాడు. లేదా చాలా గొప్పవాణ్ణి బ్రాహ్మణ్ణేనంటాడు.

శరీర ధర్మాలన్నీ చెప్పి అవి నావేనంటాడు. నా శరీరానికని అంటే కొంత బాగుకు తిరిగినట్లె. ఆ 'నా' ఎవరో తెలియనటంవల్ల ...బుద్ధిని

మెట్టునెక్కించవచ్చు. చచ్చేది స్థూల శరీరం మాత్రమేనని తెలిసికొంటే-ఇంకా సూక్ష్మ శరీరంలో నేను ఉంటూనే ఉంటాను అని తెలిసికొంటే అది మరొక మెట్టు. ఆ తెలిసికొనేది అమలినబుద్ధి. ఇంద్రియాలూ, మనసూ తనను తమ వెంట ఈడ్చుకొనిపోకుండా స్థైర్యంతో నిలుపగలిగిన బుద్ధి ఆత్మ దరికిచేరితే ఆ మనిషి శుద్ధాత్మ అనిపిస్తుంది.

మలినబుద్ధియైన మనసులో తమోగుణపుపాళ్లు ఎక్కువయితే పాములు, తేళ్లు, దోమలు, పందులు, నక్కలు, చేపలు, కోళ్ళు, కాకులూ చేసేపనులవంటి పనులుచేసే ప్రవర్తిస్తాడు జీవుడు. రజోగుణం పాళ్ళు ఎక్కువయినప్పుడు కాంక్ష, బిడ్డలు చూపుతూ తమ సౌఖ్యాలకోసం అలమటించిపోతాడు-సత్వ గుణం పాళ్ళు పెరిగితే సంతోషం, ప్రకాశం, ఆనందం, కరుణ క్షమ సత్యం శౌచం ధృతి, ఆర్జవం తితిక్ష అహింసవంటి సద్గుణాల్ని కలిగి ఉంటాడు. ఈ సత్త్వగుణస్థులు మమత్వం, డబ్బుమీద దురాశ, కామార్తి, లేకుండా బోధను పొందగలరు. జ్ఞాన విషయం తెలియగలిగేది ఈ స్థితిలోనే. ఈ గుణాల్లో మునిగి ఉండక అసక్త కర్మలనే చేస్తూ ఉన్నవాడికి శుద్ధ సత్త్వ జన్యమైనస్థితి ఉంటుంది. ఆ క్షణాన ఈ గుణాలన్నీ తొలగిపోయినవని అర్థం కాదు. అన్నీ సమమై చదునై అద్దంలాఉండే వ్యక్తి గుణాలకు అతీతుడై ఉన్నాడని తెలుస్తుంది. ఈ స్థితి మంగళకరమైంది. అచలమైంది. శాశ్వతస్థితి నియతమైంది. సదా అనపేక్షిత అయినస్థితి. అతడప్పుడు నిరామయ స్థితినందుకోగలడు.

గుణాలపాళ్ళను క్రమంగా మార్చుకొనటమనే ఈ సాధన చాలముఖ్యమైంది. ఈ సాధనేగాక మరొకసాధనయేమంటే - ఈ జ్ఞానేంద్రియాలూ కర్మేంద్రియాలూ వాటికవి స్వతంత్రమై పనిచేయకలిగినవి కావని తెలియటం. శ్రోత్రానికి గ్రాహ్యమయ్యేది శబ్దం. దానికి అధిదైవం దిశలు. చర్మానికి స్పర్శం గ్రాహ్యం దాని అధిదైవం వాయువు. నేత్రానికి రూపం, సూర్యుడు-కారణం అధిదైవము. ఇలా ఈ అధిదైవాల వల్లనే సక్రమమైన శరీరాలూ పనిచేస్తుంటయి అనేది అనుసంధానం చేయాలి. ఈ బహిః ప్రపంచంలో ప్రవృత్తిని తగ్గించి అంతర్లక్షితమైన దృష్టితో మనాలి. ఇది మంచి సాధన.

తాబేలులా-ఇంద్రియాలు బయటకు ప్రవృత్తమై మనిషిని లాక్కుపోకుండా ఇంద్రియాలను అంతర్దృష్టికి మళ్ళించటమనేది ముఖ్యం. బయటకుపోయే భోగాలకు కూడ అధిదైవమున్నాడు అతడు కాముడూ క్రోధుడూను. అంతర్ముఖుడైనవాడే వీళ్ళను జయింపగలడు. ఇలా చెప్పే- ఐతే అంతర్ముఖుడు కావట మెలా అంటారు. ఆత్మ అనే దీపమె చూస్తూ దానివల్లనే అధిదైవాలు ఒక్కొక్కటీ ఈ అధ్యాత్మలైన అవయవాలను వెలిగిస్తున్నవనే విషయాన్ని అనుభూతి చేయాలి. అదే సాధనల్లో ఒకటి.

అన్ని సాధనలకూ పరమైంది సన్యాసస్థితిని మనసులో సంతరించటం. జ్ఞాన పూర్ణమైన సన్యాసమె పరమగతినిస్తుంది. ఈ సన్యాసమెలా నడపడ మనేది తెలియాలి. ప్రకృతి అంటే శరీరం. విజ్ఞమును కలిగి ఉన్నా లోపలి పురుషుడు అవిజ్ఞుడె. చైతన్య రూపంలో ఉంటాడతడు శరీరంలో. ఈ శరీరానికిగల గుణాలను, లక్షణాలను చూడటం మాని అంతర్గతుడైన పరేశ్వరుని అనుభూతి చేయగలుగడం నేర్వాలి ముందుగా ఈ సాధనకు! జ్ఞానమెరుగాలి.

జ్ఞానం అనే దానికి నాశంలేదు. అందుకె మనిషి అభిమానం, అహంకృతి మమత వీటిని వదలి నిర్మలుడు కావాలి. అప్పుడు జ్ఞానం వివృతమై తెలుస్తుంది. జ్ఞానం తెలిస్తె నిర్మలుడవుతాడుగదా మకొంటాము. అదీ అబద్ధంకాదు. ఏది ముందు ఏది వెనుక అనేది మనిషినిబ వానిపైగల భగవదనుగ్రహాన్నిబట్టి ఉంటుంది. అప్పుడతడు. మోక్ష మార్గాన్ని చూడగలడు.

బ్రహ్మచారులూ గృహస్థులూ వానప్రస్థులూ అధ్యాత్మిక విషయాన్ని పట్టించుకొని ఎలా ఉండాలో చెప్తాను విను. బ్రహ్మచారి, తల్లిదండ్రులకు గురువుకూ ప్రియమైన పనులు చేస్తూ అధ్యయనం, స్నానం, శుచి కలిగి బ్రహ్మచర్య వ్రతుడై, అతిగా మాట్లాడక, ధర్మ నిరూఢుడై శాంతుడై ఉండాలి. గృహస్థు నిజదార నిరతుడై నిర్మల ప్రచారుడై పంచయజ్ఞాలు చేస్తూ శక్తి ననుసరించి దాన శీలియై, శుచి మైత్రి స్వాధ్యాయం శుశ్రూష సద్వ్రతనిష్ఠ కలిగి క్షమ కలిగి వర్తించాలి. వానప్రస్థుడు గ్రామం విడిచి అరణ్యాల్లో పర్ణశాలల్లో ఉంటూ స్నానధ్యానాలు నడుపుతూ బ్రహ్మచర్యవ్రత భాసియై ఫలమూలాలూ శాకాలూ తింటూ నేలపై నిద్రిస్తూ అతిథుల నాదరిస్తూ ఇంద్రియాలను గెల్చి వర్తించాలి.

అలా ఉంటున్న ముగ్గురూ కూడ ముక్తిని కోరినట్లయితే జ్ఞానమూలకమైన యత్యాశ్రమాన్ని పుచ్చుకోవచ్చు. అతడికైతే సర్వభూతదయ ఉండాలి. లేని వస్తువులపై కోర్కెలుండరాదు. ఇంద్రియాలను జయించి భిక్షచేసి బ్రతుకుతూ ఒకేపూట తింటూ తిండీబట్టా తప్ప ఇతరులనుంచి ఇంకేదీ తీసికొనక, సమ స్కారం కూడ ఆశించక యతి మెలగాలి. అనసూయ, అక్రోధం, దమం, బ్రహ్మచర్యం, ఋజుభావం సత్యం అపైశునం అహింస అతడి వ్రతాలు. చెట్టు క్రింద పాడుపడ్డ దేవాలయాల్లో నదీ తీరంలో ఉంటూ వస్తువుల్ని కూడబెట్టక మనాలి.

సన్యాసమంటే - కేవలం జప, తప, యజ్ఞాలను రజస్తమో గుణాలను జారనీయకుండా చేయడమే: అచింత్యమూ అజరమూ అమృతమూ అయిన ఆ తత్త్వాన్ని (పరమాత్మను) తెలియడమే సన్యాసం. 24 తత్త్వాలన్నీ వచ్చింది -ఒక్కదానినుంచే అనేది ఎరిగి నానాత్త్వంలో ఏకత్వం చూడి నిర్ద్వంద్వుడు కావాలి.

ఇరవయి నాల్గు తత్త్వాలు అనేది ఒకచెట్టు. బుద్ధి దానికి బోదె. అహంకారం విటపం. మహాభూతాలు శాఖలు. ఇంద్రియాలు తొఱ్ఱలు. ఆశ చిగురు. శుభాశుభాలే ఫలాలు, ఆశల నుత్తరించితే వృక్షం పెరగదిక! జ్ఞానమనే శక్తితో ఈ విశ్వమనే వృక్షాన్ని నరికివేయాలి. అభిమానాన్ని దూరంచేయాలి. అప్పుడూ నిరవేద్యమైన ఆనందం పొందటం! ఈ ప్రకృతి పొందును వదిలించుకొని అలా ఆత్మను పొందాలి.

ఆత్మదర్శనం అనుమాన ప్రమాణంచేత కలిగించుకోవలసిందె. సత్యం సంతోషం అహింస ధృతి క్షమ ఆర్జవం సన్యాసం పరిత్యాగం విజ్ఞానం ద్వారా ఆత్మదర్శనం పొందవచ్చు. సత్యాన్ని చేరటం పరమఫలమైంది. దానికి గాను ధర్మాన్ని ఆచరించాలి. దానిని గూర్చి చెప్తాను వినండి అన్నాడు బ్రహ్మ మునులతో. 'అహింస ఉత్తమ జ్ఞానాన్నిస్తుంది' అసక్త కర్మ చిత్తశుద్ధినిస్తుంది! గుణాల్లో సత్త్వగుణం ఒకటే మంచిది! దాని సహాయంతో పరమాత్మను చూడాలి. రజస్తమో గుణాలు రెండూ ఇందుకు పనికిరావు. ఇంద్రియాలు గుర్రాలు. మనసు సారథి. సంసారమనే గుంటలోనికి పోనీక ముక్తి పథంలో వాటిని నడపాలి.

మోహం పోవడానికి తపసుమార్గం. మమతా అహంకృతీ లేకుండా తపసు చేయాలి. అగుణుడైన పరమాత్మను దర్శించి సత్త్వగుణాల్ని కూడ వదిలెయ్యాలి. మూడు గుణాలూ పోయినయిగనక ఇక కర్మలుండవు. ముందుగా మృత్యు సమానమైన 'మమ' త్వాన్ని వదలాలి! "నమమ" అనే అమృతాన్ని ఆశ్రయించాలి. అప్పుడె ఆత్మలో ఆత్మను దర్శించటం." అలా బ్రహ్మ మునులకు చెప్పాడు అన్నాడు శ్రీకృష్ణుడు. "బ్రాహ్మణుడూ భార్యా అని చెప్పాను కదా! అతడెవరోకాదు. నేనే. నా బుద్ధే! భార్య మనసే! అలా నీలో నీవే ఈ విచారణ చేయాలి."

ఇది ద్వితీయాశ్వాసం



# మహాభారత కథలు

## అశ్వమేథ పర్వము-తృతీయాశ్వాసము

### 1. ఉదంకాశ్రమం

శ్రీకృష్ణుడు అర్జునుడితో ప్రసంగిస్తూ ఆధ్యాత్మిక విషయాలెన్నో చెప్పి చెప్పి, తనకు తన తలిదండ్రుల్నీ, అన్నగారినీ చూడాలని ఉందనీ అందుకుగాను ద్వారకకు వెళ్ళాలనీ ఉద్దేశ్యం వెలిబుచ్చి, తాను అలా వెళ్ళడానికిగాను 'ధర్మరాజు వద్ద అనుమతిని గ్రహించి ఈవలసిందని అర్జునుని కోరుతాడు. తన భార్యా బిడ్డల్ని చూడాలని ఉంది అనకపోవటం ఇప్పటి సంస్కృతికి అప్పటి సంస్కృతికి గల తేడా అనిపిస్తుంది. ఆయనకు తన బిడ్డలూ భార్యాలపై ప్రేమ లేదా? అనద్దు, అది అర్థంలేనిమాట. లేకుండా ఎలావుంటుంది? మనుష్యునికి గల రాగద్వేషాలు మామూలే-కాని, అప్పటివారి ప్రవర్తనకు మాటల తీరునకు, తేడా ఉన్నదనేది గమనీయం.

అర్జునుడు సత్వరం అలాగేనని అంగీకరిస్తాడు. వెంటనే రథాలు తెప్పించి కరినగరానికి - ధర్మరాజువద్దకు - ప్రయాణం చేస్తాడు. దోవలో అర్జునుడు శ్రీకృష్ణుని ఎంతో పొగడి ఆరాధించినంత పనిచేస్తాడు. "నీవు మమ్మలను కష్టాలనుంచి ఉద్ధరించావు. మా మనుగడకు మూలమే నీవు!" "నీవే భగవంతుడవు. ఈ వాయువే నీ శ్వసనం నీ క్రోధమే లోకాలకు మృత్యువు. నీవు సర్వపతివి" అంటాడు. వీరు కరిపురం చేరి ముందుగా ధృతరాష్ట్రునకూ గాంధారీకీ నమస్కరించి తరువాత కుంతికి నమస్కరించి ధర్మరాజాదులను చూస్తారు. మరునాడెప్పుడో రాజపేరోలగంలో అర్జునుడు ప్రస్తావించి "శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళి వస్తానంటున్నాడు తలిదండ్రుల్ని అన్నను చూడాలని ఉన్నదట" అంటూ ధర్మరాజుకు మనవిచేస్తాడు.

ధర్మరాజు అందుకు అంగీకరించి శ్రీకృష్ణుని వెళ్ళిరావలసిందని చెప్తూ అశ్వమేథయాగ సమయానికి దేవకీ వసుదేవులనూ బలరామునీ ఇంకా బాంధవులందర్నీ తీసుకొని రావలసింది అని అభ్యర్థిస్తాడు. శ్రీకృష్ణుడు అంగీకరించి కుంతితో మాట్లాడి సుభద్రను తనతో ద్వారకకు తీసుకొని పోవడానికి అనుజ్ఞ

పొంది శుభనమయాన సాత్యకి సుభద్రలతో సపరివారంగా బయలుదేరుతాడు. ఊరిచివరివరకూ పాండవులంతానూ, ఊరివారూ వచ్చి సాగనంపుతారు. అది శ్రద్ధ! కన్పడుతున్నంతవరకూ పాండవులు ఆ మహానుభావుణ్ణి చూస్తూనే ఉండి పోతారు. శ్రీకృష్ణుడు తిరిగి వెనక్కి చూస్తూ అర్జున్ని తిలకిస్తూనే ఉంటాడు.

శ్రీకృష్ణుడు అలా దూరప్రయాణం చేస్తూ మధ్యేమార్గంలో ఉన్న ఉదంకాశ్రమంలోకి ప్రవేశించి ఆ మునిని చూస్తాడు. ఉదంకుడు ముని. గొప్ప దీక్ష-పట్టుదలకలవాడు.

ఉదంకుడు ఎంతోకాలం గురుకులంలో ఉండి శ్రద్ధానిష్ఠలతో అగ్ని దేవుణ్ణి, గురుదేవుణ్ణి పూజిస్తూ ఉండేవాడు. గురువు అనుగ్రహం కలుగలేదనే బాధతో ఉదంకుడొకసారి కళ్ళనీళ్ళు పెట్టుకొంటాడు. తను ఒక కట్టెల మోపు తెచ్చి తలమీదనుంచి క్రిందకు విసరివేసే సందర్భంలో తన తలలోని జట ఒకటి తెగి దానితోపాటు పడితే అది తెల్లజుట్టు కలిగి ఉండటం చూసి అలా బాధ పడ్డాడు. అందుకు గురువు ఆదరించి, "నాయనా! నీకు యౌవ్వనం కలిగిస్తాను. నా కూతుర్ని పెండ్లి చేసికొనుమం"టాడు. గురుపుత్రి అనే అపచారం కలుగకుండా వరమిస్తానంటాడు. చివరకు ఒప్పించి పెళ్ళి చేస్తాడు. ఉదంకుడు గురువునకు దక్షిణ నిస్తానంటూ వా కోరికను చెప్పవలసిందంటాడు. గురువు తనకు ఇంకేమీ అక్కర్లేదన్నా ఉదంకుడు ఊరుకోడు. కాని గురుపత్ని పౌష్యదనే రాజు భార్యకున్న కుండలాలు అడిగితెమ్మంటుంది. అతడు వెళ్ళిపోతాడు. గురువునకి సంగతి తెలిసి భార్యతో "అయ్యో! శాపం కారణంగా ఆ రాజు మనుష్యులను తినేవాడైనాడు. ఇతణ్నెందుకు పంపావు" అంటాడు. ఆమె తనకా సంగతి తెలియదని దుఃఖిస్తుంది. అప్పుడా గౌతముడు "[illegible]టట్లు చేస్తానులే" మ్మని ఊరడిస్తాడు.

ఉదంకుడు వెళ్ళి ఆ సౌదాస నరేంద్రుణ్ణి చూస్తాడు. [illegible] చేత మనుష్య మాంసం తినాల్సివస్తుంది. ఉదంకుణ్ణి చూడంగానే [illegible] నా కాకలిగా ఉన్న సమయంలో ఈ ఆహారం [illegible] వచ్చావు. [illegible] తింటా" నంటాడు. ఆ రాజు బ్రాహ్మణ భక్తి కలవాడే. కాని శాపం చేత, ఆకలి కారణాల చేత అలా తింటానన్నాడు. ఉదంకుడు "సరే. తిందువుగాని! కాని నేను గురువుగారి పనిమీద వచ్చాను. ఆ పని అయిన తరువాత తిరిగి వస్తాను.

అప్పుడు తిందువుగాక. నా మాట నమ్మవలసింది" అంటాడు. ఈతడు నిజాయితీపరుడైన బ్రాహ్మణుడుగా ఆ మనుష్యుల్ని తినే సౌదాసునకు తోచి కనికరం కలిగి నీ వచ్చిన పనేమిటంటాడు. ఉదంకుడు "నీ భార్యా కుండలాలు కావా"లంటాడు. అప్పుడు రాజు, "నీవే వెళ్ళి ఆమె నడుగు" మంటే, వెళ్ళి ఆమె నడుగుతాడు కూడ. కాని ఆమె "నా భర్తనుంచి ఆజ్ఞ తెచ్చినట్లు ఆనవాలు యేదైనా తెమ్మం"టుంది. మళ్ళీ రాజువద్దకు వచ్చి ఆనవాలిమ్మంటాడు. అందుకు రాజు "ఈ దోష క్షేమమని చెప్పడానికి వీలులేదు. ఇది గాక వేరేదోవా లేదు" అనే మాటలు అన్నానని చెప్పు మంటాడు. వీటి అర్థం ఉదంకునకు తెలీ లేదు. ఐనా ఆ రాజు భార్య వద్దకు వెళ్ళి అవి చెప్పి ఆ కుండలాలు పుచ్చుకొని రాజువద్దకు వస్తాడు. నీవు చెప్పిన సంకేతార్థం ఏమిటో చెప్పవలసిందంటాడు.

అందుకు రాజు. "అయ్యా! నేను శాపంవశంచేత ఈ అడవిలో ఉంటున్నాను. ఇది బ్రాహ్మణ శాపమే. బ్రాహ్మణులను కొల్చి శరణు అనటంకన్న నాకు వేరే మార్గంలేదు. నీవు బ్రాహ్మణుడవు. నీ పని చేయటం తప్పనిసరి. ఇది చేస్తే బ్రాహ్మణశాపం పోతుందనే నమ్మకం లేదనీ కాని బ్రాహ్మణునకు మేలు చేయక తప్పదనీ ఈ సంకేత రూపంగా తెలియజెప్పాను." అన్నాడు. ఉదంకుడు సంతసించి నేను ఈ కుండలాలు గురువుగారికిచ్చి తిరిగి వస్తానని చెప్తాడు. అప్పుడు రాజు అయ్యో మనుష్యులను తినే నా దగ్గరకెందుకు వస్తా నంటావయ్యా! ఇప్పుడు నాకు కావలసింది అదికాదు. నీ తపో మహిమచేత నా శాపం పోగొట్టు మంటాడు. ఉదంకుడు నా తపో బలం వల్ల నేను నిన్ను బాగు చేయడం కాదు! నీ మంచి గుణం వల్లనే నువు బాగుపడ్డావు అంటూ చేతితో ఆతడి శరీరం నిమిరినవాడై శుద్ధుని చేసి వెళ్ళిపోతాడు.

ఆ తరువాత ఆ కుండలాలను తక్షకుడు హరించితె, కొయ్య కర్రతో ఆ పామువెంటబడతాడు. ఆ తక్షకుడు పాతాళలోకానికి వెళ్ళిపోతె - కొయ్యతో భూమిని త్రవ్వనారంభిస్తాడు. ఇతడి పట్టుదలకు ఇంద్రుడు ఆశ్చర్యపడి వచ్చి సహాయం చేస్తాడు. అగ్ని దేవుడు గుర్రం రూపంలో వచ్చి నాగలోకం దద్దరిల్లజేసి, ఆ పాములు తమంత తామే కుండలాలు తెచ్చి ఉదంకున కిచ్చేటట్లు చేస్తాడు. చివరకు ఆ ఉదంకుని గుర్వాశ్రమానికి చేర్చుతాడుకూడ.

ఉదంకుడు అంతటివాడు. తనకోరిక తీరేవరకూ పట్టుదల వదలనివాడు. అతడ్ని శాంతపరచడానికే ఇప్పుడు అతని ఆ|శమానికి చేరాడు.

కాని ఉదంకుడు పైకి మర్యాదగానే (ప్రవర్తించి చివరకు శ్రీకృష్ణుని నిలదీసి అడుగుతాడు వెటకారం కలిపి—

"బంధువుల మధ్య యుద్ధం స్థిరంచేసి పక్షపాతంలేని నీవు మిగిలినవారిని వారి వారి రాజ్యాల్లో నిలిపావా?" అని అడుగుతాడు. అందుకు శ్రీకృష్ణుడు అతడి నిష్ఠూరమైన మాట (గ్రహించనట్లుగా-అపును నేనెంతో (ప్రయత్నంతో బంధువిషయమైన (ప్రేమ నుపన్యసించి సంధి చేయటానికి (ప్రయత్నించాను. భీష్మ(ద్రోణాదులు కూడ నే చేసిన (ప్రయత్నాన్ని భూషించారు. కాని దుర్యోధనాదులు లోభంవల్ల యుద్ధానికే తలపడ్డారు. అలాంటి పాండవుల్ని జయించటం శక్యమా! ఓడిపోయినారు" అన్నాడు.

ఉదంకుడు రోషపడి కౌరవకులాన్ని మిథ్యాచారుడవై నశింపచేశావు. నేను నీకు శాపమీయాలనుకొంటున్నాను. అంటుండంగానె శ్రీకృష్ణుడు- "ఆగు ఆగు నే చెప్పేది విను. నీకు గల కొద్ది తపశ్శక్తినీ, ఈ శాపాలద్వారా పోగొట్టుకొనకు నిజమైన విషయం చెప్తాను విను. ఈ సత్త్వ రజస్తమో గుణాలు, భూత భవిష్య ద్వర్తమానాలు స్వర్గ మధ్య పాతాళాలు 'నా' నుంచి పుట్టినయి. సర్వ పదార్థాల్లో వ్యక్తుల్లో దేవతల్లో "నేను" నిలిచి ఉంటున్నాను. అవరమనేది పరమనేదికూడ "నేనే". (క్రతువులు చేసేవారు ఫలం పొందటానికి - దోషవరులు (ప్రాయశ్చిత్తులై కృతాత్ములు కావటానికీ-కూడ నేనే కారణం. మననూ, ధర్మం, నా అధీనం! (బ్రహ్మ విష్ణు మహేశ్వరులరూపంలో కూడ "నేనే" పనులు చేస్తున్నాను. ఇది మొదటి విషయం అలాటి వాడినయినా సంధికి ఎన్నో (ప్రయత్నాలు చేశాను. వ్యావహారికంగా చేయవలసిన (ప్రయత్నాలు స్వయంగా నేనే చేశాను. ఇది రెండో విషయం - పరమేశ్వర పరంగా, కాలచ(క్రం నడిచింది. వ్యావహారికంగా నేను నడచుకొన్నాను. మొదటిదాంలో ధర్మాధర్మాలులేవు, రెండవదానిలో అధర్మం అనేది లేదు. కాల(ప్రవాహమె ధ్యేయం. ఇప్పుడు నీవేమిటి చెప్పాలనుకొంటున్నావు! చెప్పు" అన్నాడు.

ఉదంకునకు తెలిసింది విషయం. ఇంతవరకూ దేవాంశ సంభూతుడైన ఈ శ్రీకృష్ణుడు అఘటన ఘటనా సమర్థుడైన ఒక మేధావి అయిన మానవుడనే

నమ్మి ఉన్నాడు. సమర్థతకు కారణం దైవాంశ అయినా అతడు మనుష్యుడుగా ఆశించినట్లయితె సంధి కుదిర్చేవాడేననుకొంటున్నాడు. మనిషే దైవం అనే భ్రమలో పడ్డాడు. మనుష్యుడుగా మిథ్యాచారిగా సంధికోసం ప్రయత్నిస్తున్నట్లే ఉంటూ నిజానికిదాన్ని ఇచ్ఛగించలేదని నమ్మాడు.అందుకూ కోపం శ్రీకృష్ణుని మీద. కాని ఇప్పుడు అతడే దైవం అనీ, దైవేచ్ఛ యుద్ధం జరగాలని అయి యుండటంచేత, ఆ ఇచ్ఛను పెద్దమనిషిగానున్న శ్రీకృష్ణునకు అంటకట్టటం సరికాదని తెలిసింది. పైగా శ్రీకృష్ణుడె నిజంగా భగవంతుడన్నట్లయితె అతడు అధర్మానికి తలపడ్డాడనే అభిప్రాయమె అర్థం లేనిదవుతుంది - అని తెలిసి, తాను రోషకోపాల్ని పోగొట్టు కొంటాడు - కాని వెంటనె శ్రీకృష్ణుడు రెండుసార్లు విశ్వరూపం చూపాడని గుర్తుకొచ్చి తాను చూడటానికి తగినవాడనుకొంటె తనకు విశ్వరూపం చూపవలసిందని శ్రీకృష్ణుని కోరుతాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తాను అర్జుననకు చూపిన విశ్వరూపం ఉదంకునకు సందర్శింపచేస్తాడు. ఉదంకునకు ఇక సందేహం నశించింది. అప్పుడు శ్రీకృష్ణుని స్తుతిస్తాడు.

శ్రీకృష్ణుడు ఉదంకుని ధోరణి మారినందుకు తృప్తుడై “వరమేదైన అడుగవలసింది ఇస్తా”నని అతడితో అంటాడు. అందుకు ఉదంకుడు, “దేవా ఇది మరుభూమి. ఇక్కడ జలం ఉండేటట్లు అనుగ్రహింపవలసిం”దంటాడు. సరెనని శ్రీకృష్ణుడు వెళ్ళిపోతాడు. కాని క్షణంలో ఒక మాలవాడు కుక్కల తోనూ బాణాలతోను దిగంబరుడుగా మకిలపట్టిన శరీరంతో వస్తుంటాడు. అతడి వంటినుంచి నీరు కారుతుంటుంది. ఉదంకుణ్ణి ఆ మాలడు చూచి ఈ నీరు త్రాగు- దప్పిగా ఉన్నావు కదా అంటాడు. ఉదంకుడు అతడ్ని కసిరి కసిరి వెళ్ళగొట్టు తాడు. హఠాత్తుగా ఆ కుక్కలతో సహా ఆ మాలవాడు కనపడకుండ పోతాడు. ఉదంకుడు ఆశ్చర్యపడుతుంటే మళ్ళీ శ్రీకృష్ణుడు దర్శనమిచ్చి, “నా ప్రయత్నం వ్యర్థం చేశావయ్యా! నేను ఇంద్రుడ్ని అమృతం తెచ్చి నీకిమ్మన్నాను. ఇంద్రుడు “ఇస్తానుగాని మాలవాడులా వెళ్ళి ఇస్తానంటాను - దూషించి నన్ను వెళ్ళగొట్టితె నేను చేయగలిగిందేమీ లేదుగాక.మనుష్యులకు అమృతమెందుకూ” అంటూనె వచ్చాడు. ఉదంకుడు దాంతో ఇంకా సాధువయినాడు. “పోనీలె నీకు వర్షం ఎప్పుడు కావాలంటె అప్పుడు కురిసేటట్లు వరమిస్తున్నాను” అనిచెప్పి శ్రీకృష్ణుడు అనుగ్రహించి వెళ్ళిపోతాడు.

శ్రీకృష్ణుడు ద్వారక చేరేటప్పటికి అక్కడి ప్రజలు రైవతోత్సవం జరుపుతున్నారు. శ్రీకృష్ణ-సాత్యకి-సుభద్రలను చూచి వారు ద్విగుణితోత్సాహవంతులవుతారు. క్లుప్తంగా భారతయుద్ధకథను శ్రీకృష్ణుడు చెప్పి అభిమన్యుని సంగతినె ప్రస్తావించడు. అప్పుడు సుభద్ర జ్ఞాపకంచేసి ఆతడి సంగతిని చెప్పవలసిందంటుంది. అభిమన్యు మరణం విని యాదవులంతా గోలపెట్టి ఏడుస్తారు. శ్రీకృష్ణుడె వారిని మళ్ళీ సేద దీరుస్తాడు. పాండవులు చనిపోయినవారందరకూ అంత్యక్రియలు బాగా చేశారనీ భూరి దక్షిణలిచ్చారని చెప్తాడు. యుద్ధంలో పోయినవారంతా స్వర్గం అలంకరించి, సుఖిస్తున్నారని అంటాడు. శ్రీకృష్ణుడు ద్వారకలో కౌన్నాళ్లు బంధువుల సమక్షాన ఉంటాడు.

## 2. అశ్వమేధ యాగప్రయత్నం

కరిపురంలో ఒకనాడు ఉత్తర అభిమన్యుని తలచి దుఃఖించుతుంటే పాండునందనులు సహా అందరూ దుఃఖించుతుంటారు. ఆ సమయాన మళ్ళీ వ్యాసమహర్షి ప్రత్యక్షమై తగిన మాటలు చెప్పి చివరకు అశ్వమేధ యాగం చేయాడానికి ప్రయత్నం చేయవలసిందని చెప్పి వెళ్ళిపోతాడు. ధర్మరాజు అప్పుడు ధృతరాష్ట్రుని గాంధారినీ సంప్రదించి వారి అనుజ్ఞ తీసికొని కుంతికి చెప్పి ఆమె అనుజ్ఞతీసికొని, తన ఆస్థానంలోని యుయుత్సుని పిలిపించి అతడిని సంప్రతించి అతడిని నగరరక్షణకు నియోగించి దేవతలనూ పితృవులనూ పూజించి ఇంద్రునికి అర్చనచేస్తాడు. అగ్నివిషయమైన కార్యం ధౌమ్యునకు అప్పగిస్తాడు. తెల్లని దుస్తులు తెల్లని అలంకారాలతో బయలుదేడుతాడు. తమ్ము లందరూచేరి ఆయనతోపాటు కామగిరికి వెళ్ళతానికి ప్రయాణమవుతారు. రథాలతో బండ్లతో ప్రయాణమై హిమశైలం చేరుతారు. అక్కడి నుండి ధనం బంగారం తేవడానికిగాను వెళ్తున్నారు.

అక్కడకు మహానుభావుడైన వేదవ్యాసుడు వచ్చినాడై, పాండవులచే పూజలుపొంది, ద్రవ్యంబక పూజలు వారిచేత చేయిస్తాడు. ఈ పూజ హిమగిరిలో దాచబడిన ద్రవ్యం పొందటానికి ముందు చేయవలసినపూజ. వ్యాస మహాముని సహాయంతో నిధులు దాచబడినచోటకు ఆ పూజమునె తరువాత అంతా వెళ్ళి అక్కడ ఎఱ్ఱని పుష్పాలనూ మాంసాపూపాలనూ భూజలనూ బల్లి భూతృప్తి చేస్తారు. ఆ తరువాత త్రవ్వటం ఆరంభిస్తారు. అక్కడ అనంతమైన

బంగారము, బంగారుతో చేసిన యజ్ఞ పరికరాలు అవుపడుతవి. అందుకు ధర్మ రాజు సంతోషించి వ్యాసమహర్షిని తిరిగి పూజించి నమస్కరిస్తాడు. వ్యాసుడు ఆశీర్వదించి ఆ బంగారాన్ని ఎత్తించుకొనిపోవలసిందని చెప్పి అంతర్ధానమై పోతాడు.

ధర్మరాజాదులు బండ్లమీద, ఒంటెలమీద గుర్రాలమీద ఏనుగులమీదవేసి ఆ ధనాన్ని తీసికొని తిరుగుముఖమై ప్రయాణం చేస్తూ ఉన్నారు.

## 3. పరీక్షిత్ప్రాణదానం

ధర్మరాజాదులు అశ్వమేధ యాగం చేయడానికి కావలసిన బంగారం హిమవత్పర్వత ప్రాంతంనుంచీ త్రవ్వుకురావడానికి వెళ్ళినప్పటి రోజుల్లో చారులు వచ్చి ధర్మరాజు అశ్వమేధ యాగప్రయత్నాలు చేస్తున్నాడని చెప్పంగానే సకలబంధుమిత్ర పరివారంతోసహా శ్రీకృష్ణుడు బయలుదేరి కరివురం వస్తాడు. విదురుడూ యుయుత్సుడూ వీరందరున్నూ ఎదురుకోలువచ్చి ఆహ్వానిస్తారు. మహాభక్తితో పురంలోకి తీసికొని వెళ్తారు. శ్రీకృష్ణ బలరామాదులు ముందు ధృతరాష్ట్రుని తరువాత గాంధారినీ అలాగే కుంతినీ కలిసి నమస్కరిస్తారు. వారు శ్రీకృష్ణుని అతిథిగానూ భగవంతునిగానూ అర్చిస్తారు. సుభద్రను తనఇంటిలో ఉంచుకొని అందరకు విడివిడిగా విడుదులనేర్పాటు చేయిస్తుంది కుంతి. ధర్మరాజాదులు ఉత్తరగిరి ప్రదేశం వెళ్ళినవారై ఇంకా అప్పటికి రాలేదు.

ఆరోజుల్లో నిండుగర్భవతియైన ఉత్తర ప్రసవిస్తుంది. కాని ఆ పుట్టిన బాలుడు ప్రాణంలేనివాడుగా ఉంటాడు. అంతా శోకించి గోలపెట్టుతుంటారు. శ్రీకృష్ణుడు ఆ శోకనాదం విని సాత్యకిని వెంటతీసికొని వేదనాయుత చిత్తంతో కుంతిఇంటికి వస్తున్నాడు. ఆ పిల్లవాడు ధర్మరాజాదులకు మనుమడు గనుకనే అంత ఆరాటం!

కుంతి ఏడుస్తూవచ్చి శ్రీకృష్ణునిపట్టుకొని రోదిస్తుంది. "కృష్ణా రక్షించు రక్షించు. ఆ పిల్లవాడు అశ్వత్థామవేసిన మారణాస్త్రంవల్ల చనిపోయి నాడు. అప్పుడు నీవు వాడిని రక్షిస్తానని మాటనిచ్చావు. వీడొక్కడే ఈ వంశానికి వారసుడు! వీణ్ణి బ్రతికించకపోతే మేమంతా నశించినవాళ్ళమే. పాండవులూ

బ్రతకరు. ఈ వంశాన్ని రక్షించినవాడవునీవు. ధర్మరాజు యీ దుఃఖాన్ని భరించలేడు" అంటుంది.

శ్రీకృష్ణుడుగంభీరుడై అవును బ్రతికిస్తాను. మీరు దుఃఖించకండి. ఇప్పుడే బ్రతికిస్తా"నంటూ సూతికా గృహానికి దారితీస్తాడు. అక్కడ పడివున్న ఉత్తరకు ఇది తెలియంగానే లేచి మహా దుఃఖంతో వచ్చి శ్రీకృష్ణుని ప్రార్థిస్తుంది. "భగవాన్ నీవు నీ మేనల్లునిపై ప్రేమతో ఉంటే అశ్వత్థామ అస్త్రం వాడ్నేం చేస్తుందిగనక. నాకు పతి విహీనత కలిగింది. పుత్రహీనురాలిని కూడ అయితే ఎలా నే బ్రతికేది! నీవు రాగానే బాలుడ్ని తెచ్చి నీకు నమస్కారం చేయిద్దామను కొన్నాను. ఇలా అయింది. అంటూ పిల్లవాణ్ణి ఎత్తిచూపి, "నాయనా! చూడు తాత! లోక గురుడు!! దామోదరుడు! వచ్చాడు. లేచి మొక్కు నాయనా! మొక్కు-మొక్కు" ఆమె గొంతు బొంగురు పోయింది. అలానే మూర్ఛపోయింది.

వెంటనె శ్రీకృష్ణుడు తాను పాద ప్రక్షాళనం చేసి ఆచమనం చేస్తాడు. పిల్లవానిని అంకతలంమీద పడుకోపెడ్తాడు. ఆ పిల్లవాడ్ని చూస్తూ "ఇతడు బ్రతకాలి-బ్రతకాలి-అనుకొంటూ-పగవాళ్ళ విషయంలో కూడ నేను అబద్ధం చెప్పనివాడనే అయితే ఇతడు బ్రతకాలి - సధర్మరతుడనే అయినట్లయితే ఇతడు బ్రతకాలి. అర్జునునిపై ఎలాంటి విరోధంగాని నేను లేనివాడనయితె ఇతడు బ్రతుకుతాడుగాక - కంసాదులను నేను ధర్మపరంగా మాత్రమె చంపినవాణ్ణయితె ఇతడు బ్రతకాలి - మహిత సత్యం. పరమధర్మం నిర్మల బ్రహ్మచర్యం నిత్య సుప్రతిష్ఠితమై నాయందున్నట్లయితె ఇప్పుడే ఈ పిల్లవాడు బ్రతకాలి!" అంటాడు.

ఈ లక్షణాలున్నట్లయితె చనిపోయిన వారిని బ్రతికించటం వ్యక్తికి సాధ్యమేనని శ్రీకృష్ణుని భావం. చిత్రమైన విషయమేమిటంటే - "నేనే భగవంతుణ్ణయితె" అని అననే లేదు. మొన్న మొన్న ఉదంకుడితో కూడ నాకు భగవంతు డనే చెప్పాడు. అలా అన్నట్లయితే మనకది [illegible] చేస్తాము గాక. ఇలా బ్రతికించాడు గనక, అంతశక్తిని మనమూ ఆ లక్షణాలు సంతరించటం ద్వారా కూర్చుకో గలంగాక. ఐనా మనం అలా అనుకోలేకపోవటం [illegible]. అలా బ్రతికించాడు గనక అతడు భగవంతుడె నమ్మటం [illegible] పాటి అవటం మన ప్రారబ్ధం అనిపిస్తుంది ఒకొక్క [illegible].

ఇంతకూ పిల్లవాడు కదిలాడు. ప్రాణం వచ్చింది.

ఉత్తర చప్పున ఆ పిల్లవాణ్ణి చంకనేసికొని, మహోత్సాహంతో ఆనందంతో వచ్చి ఆ పురుషోత్తముణ్ణి చేరి ఆయన పాదాల దగ్గర తన తల భూమిపై తగిలేట్టు నమస్కరించుతుంది. శ్రీకృష్ణుడు సంతోషంతో అందరనూ పలుకరిస్తాడు. కానుకలు ఆ పిల్లవానికిస్తాడు. యదుశేఖరులంతా కూడ భూషణాలు ఆ పిల్లవానికిస్తారు.

ఆత్మకులం పరిక్షీణమైన తరువాత పుట్టినవాడు కావటంచేత ఆతడి పేరు పరీక్షిత్తు అని శ్రీకృష్ణుడు చెప్తాడు.

ఈ మహోకాండ అయిం తరువాత ధర్మరాజాదులు బంగారాన్ని ఎత్తించుకొని వస్తారు. ఈ మహత్కథను విన్న వారి ఆనందానికిమేరలేదు. ధృతరాష్ట్రినికి గాంధారికి కుంతికి విదురునికి యుయుత్సునికి సంతోషం చేకూర్చుతారు. కొన్నాళ్లయింది శ్రీకృష్ణునితో సహా అంతా ఒక రమ్య మంటపంలో ఉండగా వ్యాసమహర్షి వస్తాడు. ఆయన అశ్వమేధ యాగాన్ని మొదలెట్టవలసింది అంటాడు అప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణుని మొగమై "శ్రీకృష్ణా మా తల్లివి, తండ్రివి గురువువూ మంత్రివీ, స్నేహితుడవూ దయాపరుడవైన నీవు మాకేననేమిటి!! జగమంతటికీ - గతివి. నీవు చెప్పు. మమ్ము ఏంచేయుమంటావో" నంటాడు. శ్రీకృష్ణుడు-ఇంకా వేరే అనుమతేమిటి! నేనుకదా ఈ అశ్వమేధయాగం చేయుమని చెప్పిన వాడను. నీవు న న్నేపని చేయమంటే ఆపని చేస్తాను సందేహించకు అంటాడు.

వెంటనే ధర్మరాజు వ్యాసమహర్షితో తనకు దీక్ష నీయుమని కోరుతాడు. వ్యాసుడు యాజ్ఞవల్క్యునీ పైలునీ యాజకులుగా చేయుమనిచెప్పి చైత్ర పౌర్ణమినాడు ఒక అశ్వాన్ని విడచి అది భూమినంతనూ తిరిగివచ్చేటట్లు చేయవలిసిందంటాడు. యజ్ఞానికి కావలసిన ఉపకరణాలు అన్నీ తయారు చేయిస్తాడు. ఒక మంచి గుర్రాన్ని తెస్తారు.

పౌర్ణమినాడు ధర్మరాజుకు దీక్షనిచ్చి, గుర్రాన్ని విడుదల చేస్తూ దానిని రక్షించుతూ వెళ్ళడానికి అర్జునుని నియమిస్తారు.

అలంతి వసుల నన్నింటినీ అర్హులైన జనులకు అప్పగిస్తారు. పాండవులు గాంధారీ ధృతరాష్ట్రిల అనుమతిని పొందుతారు. కుంతిచేత అనుజ్ఞాతులవుతారు. అశ్వమేధ యాగాన్ని చేయడానికి ఉన్ముఖులవుతారు.

ఇది తృతీయాశ్వాసము

# మహాభారత కథలు

## అశ్వమేధ పర్వము-చతుర్థాశ్వాసము

## అశ్వమేధికం

బంధువులందర్నీ చంపి చుట్టూ చూసుకొని హోరున దుఃఖించిన ధర్మరాజుకు కర్తవ్య బోధ చెయ్యడానికి ఎన్నోరోజులు పట్టింది. ఇప్పటికి అశ్వమేధ యాగం చేయడానికి ఉద్యుక్తుడై వేదవ్యాస మహాముని ఆధ్వర్యంలో దీక్షను పుచ్చు కొంటాడు. జన్నిదం, కృష్ణాజినం, దండం ధరించి ఋత్విగ్జనాలతో కలిసి కనత్కాంచనాభరణ భూషితుడై-ప్రకాశ ప్రదీప్తుడై వెలిగిపోతూ ఉన్నాడు ధర్మరాజు.

హయాన్ని పూజించి వదలి దానిని రక్షించడానికి అర్జునుణ్ణి సపరివారంతో పంపిస్తారు. అర్జునుడు, శ్రీకృష్ణుని బోధలతో సత్త్వగుణాభిరాముడైనాడు. మహాభారతంకథలో అందరికంటె ఎక్కువ సత్ సంస్కారాన్ని సంతరించినవాడు అర్జునుడు. విదురుని బోధలతోను సనత్సుజాతుని బోధలతోనూ సత్త్వ సంపన్నుడైనవాడు ధృతరాష్ట్రుడు. శ్రీకృష్ణుని మాటలు చేతలతో సత్త్వ గుణానికి గమించినవాడు కర్ణుడు. వేదవ్యాసుని బోధలతో మహాస్థితిని పొందిన వాడు శుకుడు. భీష్ముని బోధలతో సంస్కారాన్ని వృద్ధి చేసికొన్నవాడు ధర్మరాజు. కుంతి, గాంధారి, ద్రౌపదులు కేవలం ధర్మాన్ని నమ్మి ఆచరించటం వల్ల సంప్రదాయ పూర్వకమైన జ్ఞానాన్ని పొంది ఉన్నారు. భీమ నకుల సహదేవులలో భీముడు మొదటినుంచీ జ్ఞాన పరుడైనవాడుగా మాట్లాడటం చూస్తాం. వట్టి బండమనిషి అనిపించే పనులు చేస్తున్నా అతడి మాటలుమాత్రం జ్ఞానివి వలెనే ఉంటాయి. నకుల సహదేవులు ధర్మరాజును అనుసరించి నడుచుకోవటంతో జ్ఞానపరులైనారనిపిస్తుంది. మిగతా మహాపురుషులంతా యుద్ధంలో చనిపోయిన వారే అయినారు.

అర్జునుడు హయంతోపాటు దేశాలు తిరగటానికి వెళ్ళినా, కక్షతో యుద్ధం చేసి భూమిని జయించడమనేది చేయలేడు. ముందుగా త్రిగర్తులువచ్చి హయాన్ని ఆపి యుద్ధానికి దిగుతారు. అర్జునుడు యుద్ధం చేయవద్దని ధర్మ

రాజు చాల గొప్పవాడనీ, తాను యుద్ధం చేసినట్లయితే త్రిగర్తులు గెలువలేరనీ పైగా ఎంతోమంది రాజుల్ని కోల్పోయిన భారతదేశం ఇంకా కొంతమందిని కూడ పోగొట్టుకోవలసిన దురదృష్టం పొందరాదనీ చెప్తాడు. ఐనా మూర్ఖంగా యుద్ధంచేసి, సూర్యవర్మ, కేతువర్మ ఇలా ఎంతోమంది అర్జునునివల్ల ఓడి పోతారు. వారిని క్షమించి గుర్రాన్ని తీసికొని వెళ్ళిపోతాడు అర్జునుడు.

కురుయుద్ధంలో తండ్రిని కోల్పోయిన వజ్రదత్తుడు యుద్ధంచేయాలని వచ్చి అశ్వాన్ని అడ్డుతాడు. అతనికి ఎన్నో చెప్పి యుద్ధం మాన్పించాలని అర్జునుడు చూస్తాడు "రాజుల్ని చంపవద్ద"ని ధర్మరాజు చెప్పిన సంగతిని పదేపదే జ్ఞాపకం చేసికొంటూ యుద్ధాలు చేస్తాడు అర్జునుడు. సింధు దేశంలో సైంధవుడి మను మలు అడ్డువస్తారు. అక్కడా ఎంతోసేపు యుద్ధం ఆపినా చివరకు యుద్ధం చేయటం తప్పలేదు. సైంధవుడి మనుమరాలి ముత్తవ వచ్చి మా వంశాన్ని రక్షింపుమని ప్రార్థిస్తె ఆమెతోపాటు తనూ దుఃఖపడి పసివాణ్ణి రాజుగాచేసి బయలుదేరి వెళ్తాడు.

హయం మణిపురికి వెళ్ళేటప్పటికి అర్జునుడికీ చిత్రాంగదకూ పుట్టిన కుమారుడు, బభ్రువాహనుడు వచ్చి తండ్రికి నమస్కరిస్తాడు. తాను సత్త్వ గుణాత్మకుడుగా సాధనచేసినప్పటికి అర్జునుడు తనకుమారుడు రజో గుణ విహీనుడుగా వచ్చి తనకు దణ్ణం పెట్టిపోవటం సహించలేదు. అప్పటి వరకూ ఎంతోమందిని యుద్ధంనుంచి వారించిన అర్జునుడు కొడుకుతో "ఓడిపో తామనే భయంతో మనసు మార్చుకొని వచ్చి దణ్ణంపెట్టి పోతున్నట్లున్నావు పిరికివాడివి" అన్నాడు. బభ్రువాహనుడు అదికూడ సహించి ఖిన్నుడై వెళ్ళు తుంటె అర్జునునికి ఇంకొక భార్య అయిన ఉలూచి నాగలోకం నుంచి వచ్చి బభ్రువాహనునికి కన్పడి, తాను వానికి సవతి తల్లి అనీ, తాను నాగలోక రాజ కుమార్తె అనీ చెప్పి వెళ్ళి అర్జునునితో యుద్ధంచేసి గెలిచి మెప్పించాల్సిందని పురికొల్పుతుంది. బభ్రువాహనుడు గాలి పీల్చుకొని తిరిగి సైన్యాన్ని కూర్చు కొని వెళ్ళి అర్జునునితో యుద్ధంచేస్తాడు. విధివశంచేత బభ్రువాహనుని బాణం అర్జునుని హృదయాన్ని చీల్చుకొనిపోతుంది. అప్పుడె బభ్రువాహనుడు, అర్జునుని బాణానికి మూర్ఛపోతాడు. చిత్రాంగదకు మణిపురవాసులకు దుఃఖానికంతులేక పోతుంది. ఒక కొంతసేపటికి బభ్రువాహనుడు లేచి తల్లుల్నీ చనిపోయిన తండ్రినీ కౌగలించుకొని ఏడుస్తాడు. చిత్రాంగద సవతియైన ఉలూచిని అభిశం సిస్తుంది-దీనికంతకూ కారణం ఆమేనని! ఉలూచి అప్పుడు ఆ అర్జునుడు చావ

లేదనీ - తాను బ్రతికిస్తాననీ చెప్పి, తన తండ్రినుంచి మణినొకదాన్ని తెచ్చి బభ్రువాహనునికిచ్చి ఆ అర్జునుని హృదయంమీద పెట్టవలసిందంటుంది. బభ్రువాహనుడలా చేస్తాడు. అర్జునుడు బ్రతుకుతాడు.

ఇదేమి చిత్రమైన సంగతి! యుద్ధంచేసి చంపను అని బయలుదేరిన అర్జునుడు, బభ్రువాహనుణ్ణిచూసి యుద్ధానికి ఎందుకు వెరుస్తున్నావని తిట్టటం! యుద్ధం చేసి అందులో తాను చచ్చిపోవటం. ఉలూచికి గలిగిన మహాశక్తుల కారణంగా బ్రతకటం ఇది భారతం చదివే మనకు ఎలా ఉపయోగించాలని వేదవ్యాసుడు అభిప్రాయపడ్డాడా అనిపిస్తుంటుందొకప్పుడు. యుద్ధం చేదామని ఒక మనిషి అనుకొన్న మాత్రాన ఆ యుద్ధం వచ్చిందనిగాని వద్దనుకొంటే మానిందనిగాని అనుకోవటం సరికాదని చెప్పడానికా? ప్రపంచమంతా ఏదో ఒక అతీతమైన శక్తి యొక్క రచన కారణంగా నడుస్తుందని చెప్పడానికా? అంతే అయి ఉంటుంది. ఎందుకనంటె-

అర్జునుడు నిద్రనుంచి లేచినట్లు లేచి మీరంతా – ఈ ఆడవాళ్ళ సహా ఎందు కొచ్చారు. ఎలా వచ్చారు ఇక్కడికి అని అడుగుతాడు. అప్పుడు ఉలూచి చెపుతుంది - "ధీరోత్తమా! నీవు వసువులలో ఒకడైన భీష్ముని శిఖండి నెపంతో చంపినందుకు నిన్ను శపించాలని వసువులు ఒకసారి గంగాదేవితోమాట్లాడుతూ ఉండంగా నేను గంగకు జలకానికై వచ్చి స్వయంగా విన్నాను-వెంటనె మా నాన్నకు చెప్పేశాను. ఆయన వారిని దర్శించి శాంతులను చేయాలని చూశాడు. కాని అర్జునుడు బభ్రువాహనునిచేత చిత్తుగా ఓడింపబడితే అప్పుడుమాకోపంతీరుతుంది లేకపోతె శపిస్తామన్నారు. అందుకని ఈ అశ్వరక్షణ ఆధారంగా నీకూ బభ్రువాహనుడికీ యుద్ధం రగుల్కొల్పి ఇలా చేశాను. ఇది నీ రక్షకోసం చేసిన పని. నీవు ఈ పిల్లవానితో యుద్ధం చెయ్యననకుండా ముందే వాణ్ణి పట్టిపిరికి పందవని తిట్టావు కనక ఇది జరిగిందిగాక అది భగవదిచ్ఛ- లేకపోతె ఇదంతా ఎలాజరిగేది" అంటుంది. అంతా సంతోషిస్తారు.

ఇంతకూ ప్రపంచంలో జరిగే పనుల్లో ఒకదానికొకటికి గల సంబంధం- అదేదో-పరమేశ్వరుడి రచన తప్ప మరొకటికాదు! కార్యకారణ సంబంధమనేది ఆపని అయిపోయిం తరువాత వర్ణింపజేయటానికి పనికివచ్చే మాత్రమే కాని అంతకంటె విజ్ఞానకరమైందికాదు. అసలైంది అతీతమైనశక్తి! దాన్ని

తెలియాలి. అదె జ్ఞానం. ఈ జ్ఞానంకోసమె ఇంతకథ మహాభారతంగా చెప్తున్నది వ్యాసమహర్షి. అందుకె ఇది పంచమవేదం.

మళ్ళీ అశ్వాన్ని అనుసరించి అర్జునుడు వెళ్ళుతూ జరాసంధ పౌత్రుణ్ణి జయించి తిరిగి రాజ్యంలో నిలిపి అందర్నీ ఫలానినాటికి అశ్వమేధ యజ్ఞానికి రావలసిందని ఆహ్వానించి వెళ్తాడు. శిశుపాలుడి కుమారుణ్ణికూడ గెలుస్తాడు తరువాత పౌండ్ర, ఆంధ్ర, ద్రవిడ కేరళ కర్నాట సౌరాష్ట్ర దేశాలమీదుగా ద్వారక, గాంధారదేశం వెళ్ళి అక్కడి వాళ్ళందరనూ యజ్ఞానికి రావలసిందని ఆహ్వానిస్తాడు.

తిరిగి అశ్వం రావలసిన సమయం వచ్చిందని వేదవ్యాసుడు ధర్మ రాజుకు జ్ఞాపకం చేస్తాడు. ఇంతలో అర్జునుడు తాను అశ్వాన్ని తీసికొని రేపటి రోజు రాగలనని శ్రీకృష్ణునికి కబురుచేస్తాడు. చైత్రపౌర్ణమినాడు యాగం చేయాలి. అప్పటికే సర్వదేశాధీశులూ బభ్రువాహనుడూ, ఉలూచీ చిత్రాంగద అనేకులైన బ్రాహ్మణులూ వచ్చారు. ఆహ్వానితుల నందరనూ ఆదరించి మర్యాద చేస్తారు పాండవులు. వచ్చినవాళ్లు సంతోషించకుండా వెళ్ళినవాళ్లు లేరు.

ధర్మరాజు వ్యాసమహాఋషికి మొత్తం రాజ్యాన్ని ధారపోసి దానం చేస్తాడు. కోటివేల నిష్కాలను మిగతావారందరకూ ఇస్తాడు. ఇంకా ఎంతో బంగారమున్నది. అప్పుడు వ్యాసుడు ధర్మరాజుతో ఈ భూమి నాకెందుకు ఈ పరిపాలన నాకెందుకు నీవే తీసుకోవలసింది. బ్రాహ్మణపరమయిన ఆస్తిని ఊరికే తీసికొనటం ఇష్టంలేకపోతె ఇంకా బంగారం ఉన్నదికదా దాన్నితో దీనిని కొనాల్సింది. మా ఉపయోగంకోసం కొనాల్సింది. బంగారమయితే నా శిష్యుల ద్వారా ఎంతోమందికి ఉపయోగించేటట్లు పంపిణీచేయిస్తాను అన్నాడు. బంగారం ద్రవ్యం, పనిమయానికి పీలయినదికావటం అప్పటి్నుంచేనేమో ఇంతకూ ఋషి చెప్పినట్లే అంతా అభిప్రాయపడ్డారు. ఆకాశవాణి అలాగెపలికింది అన్నారు. అది ప్రజావాణి. అందుకని ధర్మరాజు మళ్ళీ రాజ్యాన్ని పుచ్చుకొని చాల బంగారం ఇచ్చేస్తాడు. "కోటికోటులమాడలు కుప్పపోసి ఇస్తాడట!

ఎంతో ధనాన్ని రాజులకు వైశ్యులకు శూద్రులకు త్రవ్వితండాలు ఇస్తాడు. అంతా ధర్మరాజు దాతృత్వాన్ని మెచ్చుకొంటారు. సక్రమంగా అశ్వ

మేధం జరిగింది. ఒక్క విశేష విషయంకూడ వైశంపాయనుడు జనమేజయు నికి చెప్తాడు ఈ అశ్వమేధానికి సంబంధించి.

## 2. హింసా విమర్శనం

లక్షలాది జనం దానాలందుకుని వెళ్తున్న సమయంలో దానజలం క్రిందపడినచోట ఒక ముంగిస ఒక బిలంనుంచివచ్చి ఆనీళ్ళలో పొర్లుతూ అంత గొప్ప అధ్వరాన్ని అంతా పొగడుతున్న సమయంలో అందరికి వినపడే టట్లు అంటుంది. "ఈ అశ్వమేధం సక్తుప్రస్థుడు చేసిన ధర్మానికి సాటి రాలేదు" అని. అక్కడున్న వారంతా ఆశ్చర్యపోతారు. ఆ ముంగిసతో "ఇలా నీవెందుకనవలసివచ్చింది-చెప్పు" మంటారు.

అందుకా నకులం సక్తుప్రస్థునికథ ఇలా చెప్తుంది. "ధర్మక్షేత్రమైన కురు క్షేత్రంలో రోషం కామంలేని మహాత్ముడుండేవాడు. ఉంచవృత్తితో తననూ తన భార్య, కుమారుడు కోడలనూ పోషించుకొంటూ ఉండేవాడు. ఒకసారి అనావృష్టిదోషం కలిగింది. పరిగయేరుకొనే వారి బ్రతుకు చాల కష్టమై పోయింది. నలువురు వెళ్ళి ధాన్యం ఏరుకొనివచ్చినా ఆకలి తీరేదికాదు. ఒక నాడు సాయంత్రానికి ఏరుకొచ్చిన ధాన్యం పేలపిండిగాచేసి కాలకృత్యాలు తీర్చి ఆరగించడానికి నలుగురకూ నాల్గు భాగాలు చేసుకొన్నారు.

ఇంతలో ఒక బ్రాహ్మణుడు అతిథిగావచ్చాడు. ఆయన్నుతెచ్చి కాళ్ళుకడిగి ఆదరించి మర్యాదచేస్తారు. ఆసక్తుప్రస్థుడు తనభాగం సత్తుపిండిని ఆ బ్రాహ్మ ణుని ముందుంచుతాడు. అతిథి దానినంతా తిన్నా అతడి ఆకలి తీరకపోయింది. ఆ తరువాత భార్య, కుమారుడు కోడలూకూడ బలవంతంగా సక్తుప్రస్థుని ఒప్పించి తమ భాగాలు ఒకరితరువాత ఒకరు ఆ అతిథికి సమర్పిస్తారు. అంతా తినేసేదాకా అతిథి ఆకలి తీరిందికాదు. అప్పటికి తీరింది. అందుకు సక్తుప్రస్థ చాల సంతోషించాడు. వెంటనే ఆ అతిథి తానే ధర్మదేవత అనీ వీరి వ్రతశీలత చూడాలని వచ్చాడనీచెప్పి "గొప్పగుణాలు కలవాడివయ్యానువ్వు! భక్తి, విన యం, శ్రద్ధ, యుక్తి, ఓర్పు, కరుణా సక్తి ఇవన్నీ అతిథులపట్ల నీకున్నాయి. అదుగోచూడు ఆకాశంలో-దేవతలు నిన్నుఎలా అభినందిస్తూ ఆశీర్వదిస్తున్నారో నీవు బ్రహ్మలోకానికి రావలసింది," అని తీసికొని వెళ్తాడు. అంతా బ్రహ్మ పదం చేరుతారు."

ఈ కథచెప్పి, "ఈ విషయమంతా అక్కడ ఒక కన్నంలోఉండి నేను చూస్తూ ఉన్నాను. ఆ పిండి అక్కడపడితె దానిని తిందామని ఆ అతిథికి కాళ్లు కడిగినచోటుకు వెళ్ళాను. ఆ నీళ్ళు నావంటికి తగిలి ఈ ప్రక్కభాగమంతా నా శరీరంలో బంగారు కాంతిమయమయింది. అంతగొప్ప దానమది అనుకొన్నాను. తర్వాత ఈ రెండో ప్రక్కకూడ అలాకావాలని చూశాను కాని అక్కడ నీళ్ళు మిగులకపోయినయి. ఆ తరువాత ఎన్నోచోట్ల తిరిగి ఎన్నో దానధర్మాలు చేసే ప్రదేశాల్లో నీటినీ ఇప్పుడిక్కడ ఈ నీటినీ, స్పృశించాను. ఐనా నా రెండో పార్శ్వం బంగారం కాలేదు. ఆ కారణంచేతనే ఆ సక్తుప్రస్థుడి ధర్మానికి ఈ అశ్వమేధాధ్వరం పోలదన్నాను," అని వెళ్ళిపోయిందా నకులం.

ఇదేమిటి ఈ కథేమిటి, అనిపిస్తుంది. జనమేజయుడు దీని అంతరార్థమేమైనాఉంటె చెప్పమంటాడు. వైశంపాయనుడు చెప్తాడు "సక్తుప్రస్థుని యజ్ఞం హింసారహితమైన యజ్ఞం. అశ్వమేధం హింసతోకూడిన యజ్ఞం"! అందుకని ఈ ముంగిస అలా ఆక్షేపించింది" అన్నాడు.

భారతంలో ఇలాటి మహత్తరమైన విషయాలు ఇలా జంతువులద్వారా మృగాలద్వారా పక్షులద్వారా చెప్పించటం చూస్తాము. లేకపోతె ఆకాశవాణి పలికింది అంటారు. ఆ చెప్పిన మాటలు అక్కడికక్కడ అందరు ఆదరించినట్లు కథ నడుస్తుంది. ఇది గమనింపవలసిన విషయం. అక్కడున్న జనులందరి హృదయంలో ఉన్నమాటను ఎవరూ బయటికి చెప్పినట్లుండదు. ఆకాశవాణి పలుకు వినబడిందంటాడు. ఈ పలుకు ప్రజలది. వారు ఆ పరిస్థితుల్లో యుక్తమని అనుకొంటున్నదానినె ఆ వాణి చెప్పతుంటుంది. అలాగే తర్కం అనేదానికి అవకాశం లేకుండా ఈ నకులం తన ఊహ చెప్పేసి వెళ్ళిపోతుంది. దీని అంతర్యం తెలిసినవాళ్ళకు తెలుస్తుంది. సంస్కార రహితులకు తెలీదుగాక ఇది పూర్వాకాలపు కథాకథన సరళి.

వైశంపాయనుడు చెప్తాడు. "ఒకసారి ఇంద్రుడు యజ్ఞం ఆరంభించాడు. మునులు దేవతలు అంతా ఉన్నారు. యజ్ఞంలో పశువధకు గాను గోవుల్ని తీసికొస్తుంటే మునులు ఆర్ద్రహృదయులై ఇంద్రునితో అంటారు. అయ్యో! యజ్ఞంలో వీటిని చంపవలసి ఉంటుందా? ఇప్పటికి కృతయుగం వచ్చింది. మూడేళ్ళనాటి పాతధాన్యం తెచ్చి యజ్ఞం చేయటానికి సాధనాలుగా

చేయాల్సింది. అంతేకాని ఈ పశువుల్ని చంపనద్దం"టారు. వెంటనే ఆ విషయం మీద వాద ప్రతివాదాలు నడిచినయి. అంతా అక్కడికి అతిథిగా వచ్చిన ఉపరిచరవసువునడుగుతారు. ఆయన పక్షపాతబుద్ధితో దేవతలకు అనుకూలంగా తీర్పు చెప్తాడు. అనగా హింసతోకూడిన యజ్ఞమె గొప్పదని చెప్పాడు ఆని వైశంపాయనుడంటాడు.

ఉపరిచరవసువు చెప్పింది సరికాదని వైశంపాయనుని అభిప్రాయమనిపిస్తుంది. నిజానికి ఆయన హింసారహితమైన యజ్ఞం స్పష్టంగా గొప్పదని కూడ జనమేజయునకు చెప్తాడు.

ఒకసారి అగస్త్యుడు పశుహింసారహితమైన యజ్ఞాన్ని ఆరంభించి పన్నెండుసంవత్సరాలు చేయాలని సంకల్పిస్తాడు. ఆ సంవత్సరం వర్షాలు లేకపోవటంవల్ల ఋత్విజులు బాధపడుతూ "అయ్యో ఈయన ధాన్యాలతో పన్నెండు సంవత్సరాలు యజ్ఞం చేస్తానన్నాడే. ఇప్పుడే వర్షాలు ఆగిపోయినయి. ఇక ఈ పన్నెండేళ్ళు ఎలా జరుగుతుందో యజ్ఞం ఏమవుతుందోనని వ్యథపడుతారు. అగస్త్యుడు వారిని ఆదరించి తన తపోబలంతో ఉత్తర కురుభూములలోఉన్న ధాన్యాన్ని యజ్ఞశాలకు ఆకర్షించితెచ్చి యజ్ఞం చేస్తానుగాని ఆపను" అంటాడు. "నేను బీజరూపమైన మంత్రాలు చదివి హోమం చేస్తుంటే వర్షం రాకపోతుందా? ఇంద్రుడు నా మాట వినకపోతాడా అని కసురుకొంటాడు. అప్పుడు ఇంద్రుడు మేఘాలతోసహా వచ్చి వర్షం కురిసి మునికి నమస్కరించి యజ్ఞం సక్రమంగా చేయాల్సిందని చెప్పి వెళ్ళిపోతాడు. కనుక, హింసారహితమైన యజ్ఞంవల్ల అంతటి ప్రభావం కలుగుతుంది అన్నాడు వైశంపాయనుడు.

అదివిని "ఆ ముంగిస ఎవరు? చెప్పవలసిం" దంటాడు జనమేజయుడు- అందుకు వైశంపాయనుడు "ఆ ముంగిస జమదగ్నిముని. పితృదేవతల శాపవశాన ముంగిస అయినాడు. ఒకసారి పితృ కార్యానికిగాను పెట్టిన పాలకుండ, క్రోధదేవతవచ్చి త్రోసివేసి జమదగ్నికి కోపం తెప్పించాలని చూస్తుంది. జమదగ్ని కోపంరాకుండా చూసుకొంటాడు. ఊరుకొంటాడు. కాని పితృదేవతలు అలా శపిస్తారు. శాపమోచనం ఈ అశ్వమేధయాగ సమయమని చెప్పారు. అందుకనే ఇలా ఆయనవచ్చి యజ్ఞకర్మల అంతర్యం చెప్పటం అయింది.

అశ్వమేధ పర్వం-సమాప్తం

# మహా భారత కథలు

## ఆశ్రమవాస పర్వము - ప్రథమాశ్వాసము

## 1. మనస్తత్త్వం

అశ్వమేధ యాగం ధర్మరాజు మహోత్సవంగా చేశాడు. అంతా సుఖంగా ఉన్నారని కథ ముగించితె అదొకరకం సొరస్యం. అది కథమాత్రమె అవుతుంది. కాని వ్యాసమహర్షి ఇక్కడ చెప్పదలచింది బోధ. వివేకం! అష్టాంగ యోగం చేత పరిశుద్ధ మనస్కుడైన ధర్మరాజు జీవితంలో ఎలా ప్రవర్తించాడనేది చెప్పి, ఆ మనస్తత్త్వం మనిషికి కలిగితె సంసారంలో ప్రవర్తించడమెలాగోననేది తెలియ జెప్పాలని ఆయన ఆశించాడు.

జనమేజయుడె అడుగుతాడు- వైశంపాయనుడ్ని- 'ధర్మరాజుకు ధృతరాష్ట్ర గాంధారుల గూర్చిన మనస్తత్వం ప్రవర్తన వర్ణించి చెప్పు'మని వైశంపాయనుడు చెప్తున్నాడు : "ఆ పరిపాలనలో,-రాజు ధర్మరాజేకాని ధృతరాష్ట్రిని చూచివచ్చిన జనులంటే ఆయన ఎక్కువ శ్రద్ధను చూపెట్టేవాడు. రాజూ తమ్ములూకూడ ధృతరాష్ట్ర గాంధారులను పితృసమానంగా ప్రేమించారు. తమ్ములుకూడ ధృతరాష్ట్రుని వ్యతిరేకించడమనే పొరపాటుచేసేవాళ్ళు కాదు. సోదరులైదుగురూ, విదురుడూ ప్రతిరోజూ ఆతడ్ని దర్శించి తమకు తెలియని ఎన్నో విషయాలు అడిగి అతడిచేత చెప్పించుకుని ప్రశంసించి వెళ్లేవాళ్ళు. ద్రౌపది, సుభద్ర కుంతిలు గాంధారివద్దకు వచ్చి ఆమెనెంతో సంతోష పెట్టేవాళ్ళు.

ఎలా సంతోష పెట్టేవాళ్ళు? అనిపిస్తుంది మనకు. ముసలివాళ్ళకేం తెలుసు మనపరిస్థితి అనుకొనే మనము, "మాకు తెలీదు-మీరు చెప్పండి అని అడిగి విని ప్రశంసించినప్పుడు ముసలివారికి కలిగే సంతోషం ఎఱుగజాలము అది ఇంతా అంతా కాదు. అందుకే వారంతావెళ్ళి ముసలివారి దగ్గర కూర్చొని మాట్లాడి విషయాలుగూర్చి తెలిసికొన్నారనడం! ముసలివాళ్ళు చేయాలనుకున్న దానాల్ని వారిచేత చేయించేవాడు ధర్మరాజు. ఇదికూడ వాళ్ళ సంతోషింపజేయడానికి మహోమార్గం. అప్పుడప్పుడూ భృత్యుల్నందరి వారిముందుకుపిల్చి

మీరంతా యీ వృద్ధులపట్ల ప్రీతితో భక్తితో-వారి సంతానసష్ట దుఃఖం హరించే విధంగా వర్తిస్తూ ఆరాధించాలిసుమా, అని హెచ్చరించేవాడు ధర్మరాజు.

ధృతరాష్ట్రుడు, "తనకుమారుడైన దుర్యోధనుని దుశ్చేష్టలను తాను ఆపజాలకపోవడాన్ని గ్రహించినవాళ్ళే ఈ ప్రజలు" అని అనుకోకుండ ప్రజలు ప్రయత్నించాలి. ఆ హెచ్చరిక ప్రజలుగాని ధర్మరాజుగాని వ్యక్తంచేసేవారు కాదు ఏ క్షణానాకూడా! [illegible] పుత్రులకుగాను ధృతరాష్ట్రునిచేత చేయించేవాళ్ళు. [illegible] లాటి భూరిదానాలను ఇవ్వగలిగేందుకు వీలుగా ఆయనకు [illegible] ఫరా చేసేవాళ్ళు. ఆయన్ను అందుకు ప్రోద్బలంచేసేవాళ్ళు.

ధర్మరాజు ఇలా ఎలా మనసు నియంత్రణలో పెట్టుకొన్నాడనేది ఊహించి తెలుసుకోవలసిన విషయం. విజృంభమాణమైన, విజయవంతమైన తన జీవితానికి తన తెలివితేటలు మాత్రమె ప్రధానమని ధర్మరాజు ఎప్పుడూ అనుకోలేదు. తన తమ్ముళ్లూ, తన సఖుడూ పరమాత్మ, బంధువూకూడ అయిన శ్రీకృష్ణుడే తన విజృంభమాణమైన విజయానికి కారణం అనుకొంటూ ఉండేవాడు. ఇంతటి ఈ స్థితికి వచ్చేటప్పటికి సాధారణ కలియుగ మానవుడికి, ఆ స్థితికి తానైతానే కారణమనే గర్వం కలుగటం సహజం. కాని ధర్మరాజు అలా అనుకోలేదు. పూర్వం సంగతులన్నీ తలుచుకొని దానికి తాను కారణం-దీనికికాదు-అనుకొంటుంటేనే, గర్వంకాని, దైన్యంకాని కలిగేది! ధర్మరాజు యుద్ధమయింతర్వాత అలా ఆలోచించి ఆలోచించి దుఃఖంలో పడటం తెలిసిన విషయమె. దానినుంచి ఆయన్ను ఉద్ధరించడానికి మహామునులు, వ్యాసమహర్షి, శ్రీకృష్ణులతోసహా భీష్మాదులంతా తంటాలు పడ్డారు. చివరకు ఫలాన-నీ కర్తవ్యం-నీవది-చెయ్యి అనిచెప్పి, అశ్వమేధయాగం చేయించారు. గతంనుంచి ప్రస్తుతానికి ఆయన మనసును లాగారు.

అందుకని ఇప్పుడు ధర్మరాజు ఏకాగ్రతంతా, తలిదండ్రులు- వారు తన ప్రక్కనె ఉన్నవారు గనుక-వారిని సంతోష పెట్టటంతోనే ముడివేయబడి ఉంది. నిజానికి చెట్టుఉండి మంచి పుష్పాల్ని మంచి ఫలాల్ని పుట్టిస్తుంది. వాటిని దగ్గరకుతెచ్చి వాసనచూసేవారికి తినేవారికె సుఖాన్ని ఇస్తయి. దూరానఉన్న వారికి ఏలాటి సుఖం ఈయలేకపోవచ్చు. ఆ చెట్టువాడు తను అధికారిగా, సొక

రుగా, ఉత్పత్తిదారుగా, యంత్రకారిగా, వ్యాపారిగా ఎక్కడెక్కడికో వెళ్ళి అనేకులతో వ్యవహరించి ఒక మంచి స్థితికి రావటమనే కర్తవ్యంచేసి, తన తల్లిని, తండ్రిని, భార్యను, పుత్రుల్ని, బంధువుల్ని సంతోషపెట్టడమనేది ప్రస్తుతంగా కర్తవ్యంగా ఎప్పటికప్పుడు అనుకోవటమనేది కృతార్థత!

"నీవు నన్ను అలా అనాదరించావు-నీ కొడుకులు మమ్మల్ని ఇన్ని తిప్పలు-పెట్టారు"-అని ఎత్తిపొడుస్తూ ఎదుటివారికి దుఃఖాన్ని కలిగించటంవల్ల ఎవరికి సుఖం? అలాటి ఈర్ష్యా పూర్ణమైన-ద్వేషపూర్ణమైన వికారం మనలో చేరితే ఆ వికారానికి దోవచూపి ప్రసరింప జేయటం అనేది తన అహంకారానికి సుఖమేమోకాని,-నిజానికి-ఆ వ్యక్తికి సుఖమైన విషయంకాదనేది ఆలోచించి గ్రహించాలి. ధర్మరాజు అలా గ్రహింపగలిగినవాడై అలాంటి వికారాలు తన మనసులోకి చేరకుండా చూసుకొంటూన్నాడనేది భారతం విని నేర్వదగిన విషయం! క్రోధం, ద్వేషం, లోభం, ఈర్ష్య ఇవి తనవికావు. తనువేరు తనమనసువేరు తన మనసుకు మాత్రమె అప్పుడప్పుడు కలిగే దుర్గుణాలు అవి-అని తెలియటం అవసరం. అలా అనుకొంటెనే వాటిని దూరంచేసి, స్వచ్ఛమైన మనసుతో ఎదుటివారికి సుఖసంతోషాలను కలుగజేయ కలుగుతాడు మానవుడు.

అర్జునుడుకూడ శ్రీకృష్ణ పరమాత్మ బోధలవల్లనయితెనేమి. పూర్వజన్మ సంస్కారంవల్లనయితెనేమి-ఇలాంటి మనస్తత్వాన్నే సంతరించి ఉంచుకొన్నాడు. నకుల సహదేవులున్నూ-ఈ తత్వాన్ని యింకా సంతరించుకొంటూ ఉంటున్నారు. వాళ్ళుకూడా ధృతరాష్ట్రునిపట్ల ఏలాటి స్పర్థనూ ఎన్నడూ చూపలేదు.

భీముడయితె ధర్మరాజులేని సమయాన తనకు గర్వం ఉందనిఎఱిగి ముసలి వారిని నొప్పించి తన గర్వాన్ని సంతృప్తిపరచుకొంటూ ఉండేవాడు. "ఈ గుడ్డాయనకొడుకుల్ని తిరుగులేకుండా చంపేసింది ఈ చేతులే! ఇవీ నా దేవుళ్ళు". అంటుండేవాడు ధృతరాష్ట్రునికి వినపడేటట్లే! అర్జునుడు వారించేవాడు నకుల సహదేవులు నవ్వుకొనేవాళ్ళు. భీముడు తత్త్వజ్ఞానమెరిగినవాడె. కాని వేదాంతికాదు.

ఇక ధృతరాష్ట్రుని మనస్తత్వం ఎలాఉందనేది తెలియదగిన విషయం అనిపిస్తుంది! తన కుమారుడితో కొంతకాలం ఏకీభవించి నిజాయతీ రహితంగా

వర్తించటంచేత సర్వులనూ యుద్ధంలో పణంగాపెట్టిన సమయంలో విదురుడూ, సనత్సుజాతుడూ చెప్పిన జ్ఞానం కొంత అయనమీద పనిచేసింది. కాని ఆ యుద్ధం అపగలుగటం అనేది తనచేతిలో లేనిపనిగా తెలిసికొన్నాడు. ఒకానొక ప్రవర్తనను కలిగిఉండి తత్కాలానికి యుక్తమైన ధర్మమైన పని చేయటం వరకే మానవుడు చేయకలిగింది. ఆ తరువాత తన ప్రవర్తన కారణంగాగాని లేదా ఇతర కారణంగాగాని జరిగే కర్మలను తను అపగలటంగాని పూరించడం గాని తనచేతులోదికాదు అని తెలిసికొన్నాడు. మనంకూడ భారతంలో నేర్చు కోవలసిన విశేష విషయం ఇదె. ఒకానొక క్షణాన అవలంబించాల్సింది, ఈ ధర్మమార్గమా లేక ఆ దుష్టమార్గమా అని వచ్చిన ప్రశ్నకు శ్రేయోమార్గాన్ని అవలంబిస్తాను అని ప్రవర్తించటమే మనం చేయకలిగింది. మరి అలా చేశాను గాని, ఈ యుద్ధంలో నావాళ్ళంతా చచ్చారుకదా నాకేంలాభం అనటానికి వీల్లేదు. నేనుచేసిన పొరపాటువల్ల నావాళ్ళు చచ్చారని ధర్మరాజు మొదట్లో వాపోయినట్లు ధృతరాష్ట్రుడు వాపోవటల్లేదు. దానికికారణం సనత్సుజాతుడు అతడికి కలిగించిన జ్ఞానం!!

అతడి ప్రస్తుత ప్రవృత్తి ఏమిటంటే-చనిపోయిన తన పుత్రులు సుగతిని పొందాలి. బ్రతికున్న ధర్మరాజాది బంధువులు సుఖులై వర్ధిల్లాలి. తాను తన ఆత్మోన్నతికోసం తపను చేసికొనాలి అని.

అందుకని ఒకనాడు ధర్మరాజునూ, తమ్ములనూ పిల్చి తాను తపను చేసి కొనడానికి ఆశిస్తున్నాడనీ అందుకు రాజుగా ధర్మరాజు అనుజ్ఞ ఇవ్వవలసిందనీ వేడుకొంటాడు. తనూ గాంధారీ వెళ్తామంటాడు. ధర్మరాజు గోలపెట్టుతాడు. నేను పేరుకు రాజునుగాని నీవే స్వయంగా ఈ రాజ్యానికి రాజు. నీకు ఇక్కడ నేను తిన్నగా ఉపచర్యచేయటల్లేదా? ఎందుకు వెళ్ళాలనుకొంటున్నావు, మీతో పాటూ నేనూ వస్తాను. అంతేగాని మిమ్మల్ని పంపడమనేది అసంభవం"- అంటాడు. కాళ్ళు పట్టుకొని దండం పెడుతాడు. "ధృతరాష్ట్రుడు"-అలాకాదు- అలాకాదు-నేను వెళ్ళాలి నీవనుజ్ఞ ఇవ్వాలి మీరంతా ఈ ధర్మరాజుకు చెప్పండి "అంటూనే కళవళపడి గాంధారిమీదకు వరిగి మూర్ఛపోతాడు". అంతా గొడవ పడిపోతారు. చల్లని నీళ్ళతో ధర్మరాజు కళ్ళు శరీరం తుడుస్తుంటే ధృత రాష్ట్రుడు తెలివొంది ధర్మరాజును కౌగలించుకొంటాడు. కాని "నేను తపళ్ళ

రణకు పోవటం అనేది నీ అనుజ్ఞ ఇస్తేనేగాని చేయను. అయితే నీవు ఆ అనుజ్ఞను ఇస్తేనేగాని నేను ఇక భోజనం చేయ"నన్నాడు.

వెంటనె అక్కడకు వేదవ్యాసుడు వస్తాడు. అంతా సంభ్రమములై ఆయనకు కాలువునిస్తారు. ఆయన ధర్మరాజుతో అంటాడు. "పూర్వపు రాజులు ఎలా అయితె రాజ్యంచేసి చివరకు తపశ్చర్యకు పూనుకొన్నారో అలా ఈయన చేయడానికి అభ్యంతరమేమిటి? ఆయనన్ను వెళ్ళనివ్వు. ఇన్నాళ్ళు చక్కగా పరిచర్యలు చేశావు చాలు. ఇక ఆయన ఆత్మోన్నతి సంగతిచూసుకొననీ, రాజు యుద్ధంలో నైనా చావాలి. సమాధిలోనైనా చావాలిగాని రోగంతో చవిపోవటం కోరదగిందా" అంటాడు.

ధర్మరాజు ఏలాటి సమాధానం చెప్పలేక తండ్రితో "ముందు భోజనం చేయి-నీ ఇష్టంవచ్చినట్లై చేతువుగాక" అంటాడు. వనానికి పోవడానికి ముహూర్తం కొద్దిరోజుల్లోనని నిశ్చయించారు. ఈలోగా మృతులైన పుత్రులకు విశేష శ్రాద్ధక్రియలు జరిపి విశేష దానాలివ్వాలని నిర్ణయించుతారు.

ధృతరాష్ట్రుడు ధర్మరాజును ప్రక్కకు తీసికొనిపోయి రాజనీతి విశేషాలు శత్రురాజుల్ని ఎలా జయించాలో-అన్నీ వివరంగా చెప్తాడు. తరువాత ధర్మరాజు ధృతరాష్ట్రుని విశ్రాంతికోసం పంపి తాను వెళ్ళిపోతాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు గాంధారితో "తపస్సుచేసి, నాకుమారులకు సుగతి కలిగిస్తాను" అంటాడు. "మా తండ్రి అయిన వేదవ్యాసుడు నాకనుమతిచ్చాడు. ధర్మరాజు అనుమతించాడు . పురజనులను పిల్చి వారి అనుజ్ఞపొందాలి," అని వారిని పిలిపిస్తాడు. వారితో దుర్యోధనుడి దుశ్చేష్టలకు తాను మూలమైనందుకు చింతిస్తున్నాడనీ ధర్మరాజు మంచి ప్రభువనీ ఆయన పాలనలో ప్రజలంతా సుఖపడతారనీ, తనకు తపశ్చర్యకై పోవడానికి అనుమతింపవలసిందనీ అడుగుతాడు. వారు చింతించినవారై చివరకు శంఖువనే బ్రాహ్మణునిద్వారా తపశ్చర్యకు రాజు వెళ్ళడానికి సమ్మతినిస్తారు.

భీముడయితె విదురునితో ధర్మరాజాదుల ఎదుట "ధృతరాష్ట్రుడు మృతులయినవారికి పెద్దఎత్తున విశేష శ్రాద్ధక్రియలు చేయటం దండుగ" అంటాడు. అప్పుడు అర్జునుడు ఆయనన్ను వారించి ఆ శ్రాద్ధక్రియలు నాడబ్బుతో చేయాల్సిందని పెదనాయకునకు చెప్పవలసిందని విదురునితో అంటాడు. ధర్మ

రాజుకూడ నా ధనంతోనూ అర్జునుడి ఇంట్లోని ధనంతోనూ శ్రాద్ధక్రియలు బాగా జరుపవలసిందని చెప్తాడు. ఈ మాటలన్నీ ధృతరాష్ట్రునికి చేరుతవి. ఆయన ఉదాసీనంగా ఊరుకొంటాడు. ఇదీ ధృతరాష్ట్రుని మనస్తత్వ విషయం. ఇన్నాళ్ళూ చాలా స్వార్థపరుడుగా ఉండి సనత్సుజాతుని బోధ తరువాత సత్త్వగుణుడైనవాడు ధృతరాష్ట్రుడు. ఎల్లప్పుడూ సత్త్వగుణంలో ఉంటున్నవాడు విదురుడు. మామూలు మంచిమానవుడుగా ఉంటూ అన్నీ తెలిసికోవాలనుకొంటూ ధర్మాన్నీ పాటించాలి అనే దృష్టిలో ఉన్నవాడు ధర్మరాజు. సర్వజ్ఞుడైన జ్ఞాని శ్రీకృష్ణుడు. ఇదీ అప్పటి ఈ మానవుల పరిస్థితి.

## 2. ఆశ్రమవాసం

ఆశ్రమవాసం నిశ్చయమైంది. ముహూర్తంకూడ నిర్ణయించి పెట్టారు. తీరా ముహూర్త సమయానికి బయలుదేరి అరణ్యాలకు వెళ్తుంటే ప్రజలు ఎంతో మంది వచ్చి చూస్తారు. వెనకటి రోజుల్లో పాండవులు ద్రౌపదితోసహా అరణ్యాలకు వెళ్ళటం చూసి ఎలా దుఃఖించారో ఇప్పుడూ అలాగే దుఃఖించారు. పుర ద్వారందాకా కుంతీ ద్రౌపది సుభద్రలు సహా అంతఃపుర స్త్రీలుకూడ వస్తారు. ధృతరాష్ట్రుడు "ఇక మీరంతా ఉండిపోండి మేము వెళ్ళొస్తాము" అంటాడు. కుంతి తనుకూడ వారితో ఆశ్రమానికి వెళ్ళిపోతానంటుంది. ధర్మరాజాదులు "అయ్యో ఇదేమిటి!" అంటారు. ధర్మరాజు అలాకాదు-నేనే ఈ ధృతరాష్ట్రునితో వెళ్తాను నీవు ఈ కోడళ్ళను తీసికొని లోపలకు వెళ్ళమంటాడు. కుంతి మాత్రం తాను ఈ గాంధారీ ధృతరాష్ట్రులకు శుశ్రూషచేస్తానని! వెళ్ళిపోవేననీ అవని ధర్మరాజు చేసేపనికాదనీ చెప్తుంది. తానై [illegible] చేసి [illegible] విధవరాలి రాజరికం వెలయించడం ఆమెకు పడదంటుంది.

అంతా ఆమెను ప్రార్థిస్తారు. భీముడు కొంత కఠినంగా మాట్లాడతాడు. "నీవు పురికొల్పి మా చేత యుద్ధం చేయించి ఇలా ఇప్పుడు వెళ్ళిపోతానంటావే" మంటాడు. ఆమె అందుకు "నాయనా! ఈ కౌరవులు పిల్లను [illegible] అవమానించి పెట్టటం చూసి మీ తేజస్సు నశించిపోయి కృశిస్తున్నారని ఆ తేజస్సును ప్రోత్సహించి విజృంభమాణం అయేటట్లు చెయ్యాలనే నేను శ్రీకృష్ణునితో అన్నాను" పాండుకులం నిర్వంశమైపోతుందేమోనని, అలా అనాల్సి వచ్చింది. దానికినీవు ఎత్తిపొడిస్తే నేనేం అనగలను గనుక" అంటుంది. భీముడు పాపం సిగ్గుపడి ఊరుకొంటాడు.

కొంతదూరంలో ఉన్న ధృతరాష్ట్రుడు ఈమె వస్తానంటం ఎరిగినవాడై ధర్మరాజు ఎలాచెప్తే అలా చేయవలసిందని కబురుచేస్తాడు. ఎవరు చెప్పినా తాను విననంటుంది కుంతి. చివరకు ధర్మరాజువెళ్ళి ధృతరాష్ట్రునితో తన తల్లికూడ వస్తున్నదనీ ఆమెచేత శుశ్రూష చేయించుకొని ఆమెకు బుద్ధిచెప్పవలసిందంటాడు. బుద్ధి అంటే ఇక్కడ విద్య అని అర్థం అనిపిస్తుంది. వెళ్ళద్దంటే వచ్చినందుకు శిక్షించుమనికాదు. అంతా అలా వెళ్ళి శతయూపుడనే రాజర్షి ఆశ్రమంలో చేరుతారు ధృతరాష్ట్రాదులు. వీరికోసం అక్కడ పర్ణశాల ఏర్పరుస్తారు.

ఇది ప్రథమాశ్వాసము

# 1. నారదాగమనం

ధృతరాష్ట్రాదులు పురంవదలి తపోవనానికి వెళ్ళారు. సంజయుడు, విదురుడు, గాంధారి, కుంతికూడా వెళ్ళారు. అలా వెళ్ళి శతయూపుడనే రాజర్షి పూర్వం కట్టుకొన్న తపోవనంలో ఉంటారు. శతయూపుడు వారిని అక్కడనే ఉండవలసిందని కోరుతాడు, ధృతరాష్ట్రుడు అందుకు సమ్మతిస్తాడు.

ధృతరాష్ట్రాదులు పెద్దవారై అసంఖ్యాకాలైన అనుభవాలను జీవితమంతా అనుభవించారు. ఇప్పుడు తమకు కావాలంటే రాజభోగాలు రాజధానిలో జరుగకపోవు. కాని వాటిని ఎందుకు వద్దని వచ్చారిక్కడకు? సుఖాలని సర్వులూ అనుకొనేవి ఒకానొక స్థితిలో సుఖాలనిపించవు. అథవా సుఖాలనిపించకేం చేస్తాయి అనుకొందాం. కాని కష్టాలనిపించే అనుభవాల్ని కోరటం కూడ మానవ ప్రవృత్తే ననిపిస్తుంది ఒక విధంగా- మూడు నాలుగు తీపి పదార్థాలు తిని వెంటనే కారంతో చేసిన పదార్థాలు కోరినట్లు. ఈ సుఖం దుఃఖం కూడ మనసుకు వికారాలే, ఈ మనసు ఎలా ప్రవర్తిస్తోంది ఈ క్షణాన అని ప్రశ్నించుకోవటం - ఓహో తీపి తినవద్దంటోంది - అనుకోవటం గమనిస్తూ ఉంటె ఒకొక్కప్పుడు విచిత్రమైన అనుభూతి కలుగుతుంది. ఈ తీపి - కారం - చేదులకు ఏమంత భేదం లేదనీ, మనసు పోకడె ప్రధానమైందని అనిపిస్తుంది. ఈ సుఖం దుఃఖం అనుకొనే విషయాలుకూడ అంతె. మహా సుఖదమని భావించి పుత్రులు పుత్రికలు, పౌత్రులు, భాత్రులతో రెండు రోజులుంటాం సుఖంగా. వెంటనే ఏదో పేచీ పెట్టుకొని దుఃఖాన్ని కొనుక్కొచ్చుకొని తేచిపోతాం. మనం కొనుక్కొచ్చుకోనక్కర్లేదు - సుఖం దుఃఖం అలా కాలాన్ని అనుసరించి ఒకటి తరు

వాత ఒకటి వస్తూ పోతూ ఉంటాయి. మనం ప్రయత్నిస్తే - అంటె - ఏవో శుభకార్యం చేయటం వల్ల సుఖం వస్తుందనుకోవటమె సరికాదు. మనంచేసే పనులవల్లకాదు-సుఖ దుఃఖాలు కలిగేది. బహుశ! వాటి కాలగతినిబట్టి అవి వస్తయి. ఐతె మనం ఏ పనైనా నిశ్శంకతో చేయవచ్చునా అనే శంక వస్తుంది. మంచిగా ప్రవర్తించాల్సిందె. అది కర్తవ్యం. అలా మంచిగా ప్రవర్తించటం వల్ల మంచి ఫలం కలుగటంమాట అటుంచి సుజ్ఞానం కలుగుతుంది. ముందు సత్త్వగుణం కలిగి తరువాత జ్ఞానం కలుగుతుంది. చెడ్డగా ప్రవర్తిస్తె సత్త్వగుణమె పైకిరాదు. ఇంకా జ్ఞానం కలిగేదెక్కడ!

ఇంతకూ సుఖందుఃఖం అలా ఒకదానివెంట ఒకటి వస్తానె ఉంటయి. "వాడు మంచివాడు-పాపం వాడికి దుఃఖం కలిగిందేమిటి?" అనటం అర్థంలేని మాట. "ఇంతలావు ఉన్నావు తేలుమంత్రం ఎరుగవా" అన్నట్లే. సుఖంలో దుఃఖంలో కూడ సరియైన జ్ఞానం మనసులో నిలిచి ఉండటమె, మంచిపనులు చేసి సత్త్వగుణాన్ని సంతరించుకొన్నవానికి కలిగే ఫలితం.

ఇంతకూ ధృతరాష్ట్రుడూ మిగిలినవారూ శతయూపుని ఆశ్రమంలో ప్రశాంతమైన స్థితినికోరి మరీవచ్చి అందుకు తమలోతాము ఎంతో [illegible] పొందుతూ అక్కడ ఉంటున్నారు. అక్కడకు నారద మహర్షి మొదలైనవారు వచ్చారు. "ఈ ఆశ్రమంలో మీరు చేరటమె పుణ్యవశంవల్లననాలి. [illegible] అర్థం మీ మనసులు జ్ఞానపూర్వకమైన పరిశోధనలు, [illegible] పొందు తయి అనటం. నారదుడు, ఇంద్ర లోకంలో [illegible] ఇంద్రు డికి అయిన సంభాషణలో ధృతరాష్ట్రుని [illegible] ధృతరాష్ట్రుడు శతయూపుని సమక్షంలో చెప్తాడు. మూడేండ్లు ధృతరాష్ట్రుడు అక్కడ తపసు చేసి చివరకు కుబేరుని కలిసి గంధర్వ[illegible] [illegible] సుఖాన్ని ఆస్వాదిస్తాడు. అంతరూ సంతోషిస్తారు [illegible]

కొన్నాళ్ళిలా అయింది. రాజధానిలో [illegible] ధృతరాష్ట్రిడి మహానుభావులెలా ఉన్నారోనని [illegible] సంజయుణ్ణి తలుచుకొని వేదన పొందుతారు. [illegible] కొన్నాళ్ళు ఆశ్రమంలో ఉండి తమవారిని [illegible] బయలుదేరి శతయూపాశ్రమానికి వెళ్తారు. [illegible] జ్ఞాపకం వచ్చి దుఃఖం కలుగుతుంది - ఆ దుఃఖ[illegible] త్నించి అందువల్ల మళ్ళీ సుఖాన్ని పొందుదామని [illegible]

అలాగే ధర్మరాజాదులు కూడ తమ రాజధానిని వదలి ఆశ్రమం చేరారు. అక్కడ దర్భాసనాలపై పడుకొని 'అమ్మయ్య' అనుకొన్నారు. వీరు బాధ్యపు. తారేమోనని ధృతరాష్ట్రుడు వారి వారి మంచాలు కుర్చీలు తెప్పించి వాటిమీద చేరుకోవటానికి అనుమతించి వారందర్నీ నెలరోజులపాటు తన దగ్గర ఉంచుకొంటాడు. వీరందరినీ పేరుపేరునా వర్ణనతో సహా సంజయుడు అక్కడి మునులకు పరిచయం చేస్తాడు.

చిత్రమేమిటంటే వీరి చరిత్ర విన్న వారి మనోభావాల్లో వీరి వర్ణన ఎలా ఎలా ఉందో ఎవరు చెప్పగలరు. ఇప్పుడు తీరా వీళ్ళ శరీరాలు చూచి "ఒహో ఆయన ఈయనేనా" అని సమన్వయం చేసికొనటంతప్ప-'ఏది నిజం?' ఏది కాదు? అనే దానికి ఏమిటి సమాధానం !! నిన్నటివరకూ మహావీర్యవంతుడై అర్జునుడు ఇప్పుడు బహుశః ఒక ముని కావటానికి సిద్ధంగావున్న ఆకారం అవుపడితే ఏది నిజం? పూర్వం మనసులో ఉన్న రూపమా ఇప్పటిదా? విదురుడు ఎక్కడా అవుపడడు. "ఆయనేడి" అని ధర్మరాజడుగుతాడు. ధృతరాష్ట్రుడు ఆయన యోగియై జడునిలా తిరుగుతున్నాడంటాడు. ఇంతలో అక్కడికి ఒక పిచ్చివాడిలా చూస్తూ విదురుడు వస్తాడు. ధర్మరాజు ఆయన్ను వెంబడించి వెళ్తాడు ఒక్కడున్నూ.

విదురుణ్ణి "విదుర మహాశయా ! విదుర మహాశయా ! అని పిలుస్తాడు. తాను ధర్మరాజునని చెప్తాడు. విదురుడు వెనక్కు తిరిగి నిలుచొని ఒక్కపాదం మీద నిల్చి యోగముద్రలో ఉంటాడు. ధర్మరాజు ఎదురుగ నిలుస్తాడు. విదురుడు తన శరీరం క్రింద పడిపోతుండగా తేజస్సులా అవుపడి ధర్మరాజు శరీరంలో చేరిపోవటం అవుతుంది. ధర్మరాజు శరీరం పుష్టిని తేజస్సును పుంజుకొన్నదిట.

శరీరం వదలి తేజోరూపంలో కాకపోతే వాయురూపంలో లేదా ఆకాశరూపంలో మనమూ ఇంకో శరీరంతో చేరేవాళ్ళమేను. మనకు ప్రేమ దేనిమీద ఉంటే అనగా- వాసన ననుసరించి ఆ శరీరంలో చేరుతామని శ్రీకృష్ణపరమాత్మ చెప్పనే చెప్పాడు. చివర సమయాన మనమేమి జ్ఞాపకం చేసికొంటామో తెలీదు గాని ఏలాంటి దుఃఖంగాని అంటని పరమేశ్వరుని మీద ప్రేమ పుట్టినట్లయితే దుఃఖం లేని స్థితికి వెళ్ళటానికి వీలు అని శ్రీకృష్ణుడే చెప్పింది నిజమనిపిస్తుంది. విదురుడు యమధర్మరాజుట. ఆయనకు మాండవ్యుడనే ముని, శాపం ఇచ్చాడట. అందుకని ఇలావచ్చి, వేదవ్యాసునికే అయినా- దాశీదానికి పుట్టాడట. యోగి అయినాడు గనక పూర్వజన్మలో తాను యమధర్మరాజు అని తెలిసి,

ధర్మరాజు యమధర్మరాజు అంశ అని ఎరిగి ధర్మరాజు శరీరంలో చేరిపోవటం ఆలోచనా యుక్తమైన విషయం. రాబోయే మార్పును ముందుతెలిసికొంటె ఆ మార్పును చావు అనముగాక. ఫలాన మార్పు వస్తుంది కనుక అది మార్పేను అనే అనుసంధానం నిలుస్తుంది. అది తెలీకపోయినా ఏదో మార్పు వస్తుంది. రానీ అనుకొంటే చావుకోసం దుఃఖించాల్సిన పని ఉండదేమో ననిపిస్తుంది. మార్పు ఖాయం అనేది అనుసంధానం చేయటం ఒక మహత్తరమైన యోగమన వచ్చు ఒక విధంగా. కాని సుఖ దుఃఖాతీతుడైన పరమేశ్వరునిమీద మనసుంచి అపని చేయాలి అలా కాకపోతే డాక్టరు జెకిలు లాగా ఆ మార్పులు నిరంతరం నడిపిస్తూ సాధారణ మానవుడులానే జన్మ జన్మలకూ మార్పులు పొందుతూనే ఉంటాడనిపిస్తుంది.

## 2. పుత్రసందర్శనం

ఇలా, పాండవులు కొన్నాళ్ళు ఆశ్రమంలో ఉంటుండగా వేదవ్యాస మహా ముని అక్కడికు వస్తాడు. ఆయన్ని అంతా ఎంతో మర్యాద చేసి నమస్కారాలు చేసి గౌరవమిచ్చి కూర్చోపెట్టుతారు. ఆయన ధృతరాష్ట్రుని అడుగుతాడు "వనవాసంలో మనసు అలవాటుపడిందా. తపస్సు చేయటంలో సుఖం కనవడుతోందా?" అంటాడు. సత్త్వగుణం ఆవహిస్తోందా లేదా అని పరామర్శ అది! "పుత్రులు నశించారని ఇంకా హృదయంలో దుఃఖించటల్లేదుకదా? కుంతి మీకు శుశ్రూష చేస్తోందా తిన్నగా? మీరు ఇక్కడకు వచ్చిం తరువాత తాను అక్కడ ఉండినట్లయితే రాజ్యం తాను అనుభవించాల్సి వుంటుందని యోచించి అది ఇష్టంలేక ఇక్కడకు వచ్చేసింది! భీముడంటే నీకు ఆదరణ కలిగిందా" అంటాడు. ఇవన్నీ సత్త్వగుణం ఈతడికి కలిగించా లేదా అని తెలియడానికడిగిన ప్రశ్నలు. పైగా చెప్తాడు.

"వినుము దీర్ఘవైరవృత్తియు గ్రోధచింతనము లేక వాక్కు మనము నొక్క చందనమగుట సకల జనముల కనుబద్ధ సంపదాప్తి పరమసాధనంబు" మనసు, వాక్కు ఒకటే అయినదై వైరవృత్తి క్రోధవృత్తి లేకుండా వుంటే సకల సంపదాప్తి అనుబద్ధమై కలిగి ఉన్నట్లేను. ఇదె పరమ సాధనము అంటాడు వరమ సాధనమంటే మోక్షానికి మార్గమని అర్థం. ఆ స్థితికి ధృతరాష్ట్రుడు వెళ్ళాలని వేదవ్యాసుని ఆశయం. అందుకే ధర్మమూర్తి అయిన యుధి

క్షిరునిమీద సంతోషస్వాంతుడవై ఉన్నావా అంటాడు. ధృతరాష్ట్రుడు తల కాయ తిప్పుతాడు. అక్కడున్నవారంతా వచ్చి వ్యాసునకు నమస్కరిస్తారు.

వ్యాసుడు ధృతరాష్ట్రులకు ఏదో సుఖాన్ని కల్పించాలని వచ్చానంటాడు. ఏం కావాలో చెప్పాల్సిందంటాడు. అప్పుడు వారు యుద్ధంలో చని పోయినవారు ఏ లోకాల్లో ఎలా ఉంటున్నారో తెలియదు. మా కెంతో ఇచ్ఛగా వుంది వాళ్ళను చూడాలని అంటారు. గాంధారి కుంతినీ ద్రౌపదినీ ఇంకా అంద రనూ పేరు పేరునా చెప్పి వారికయిన బంధువులంతా కన్పడితే వీళ్ళు ఎంతో సంతోషిస్తారంటుంది. కుంతి తాను కర్ణుని చూడాలని ఉన్నదంటుంది. కర్ణుని పుట్టుక ఎలా అయిందో తాను నిర్దయగా ఆ పిల్లవాణ్ణి ఎలా నదిలో వదలిందో పూసగుచ్చినట్లు చెప్తుంది. ఇప్పుడు తాను ఆతడ్ని చూస్తానంటుంది. గాంధారి కోడళ్ళందరూ తమ తమ భర్తల్ని చూడాలని తహతహ లాడారు. వేదవ్యాసుడు సరేనని అంతా గంగానది ఒడ్డుకు పదండి అంటాడు. మరునా డుదయం అందర్నీ చూపుతానంటాడు. ఆ రాత్రి వాళ్ళందరకూ ఒక యుగంగా గడిచింది.

కుంతి తానడిగేటప్పుడు కర్ణుని జన్మంతా వర్ణిస్తుంది. తాను కన్యగా వున్నప్పటినుంచీ కర్ణుడెవడో ఎరుగదు. సూర్యుని ఉపాసించినప్పుడుకూడ తెలీదు. పుట్టిన వెంటనే అతడ్ని నదిలో వదిలింది. ఆ క్షణాన అది పాపమా కాదా అని తాను విచారింపదలచుకోలేదని చెప్తుంది. అది ఆ పరిస్థితుల్లో అలా జరకతప్పదనే నమ్మకం కుంతికి కలిగిందన్నమాట. జరిగే కొన్ని కర్మలు పాపమైనా పుణ్యమైనా, ఇష్టమైనా, కాకున్నా మానవుడు చేయటం ఖాయం. హృదయంలో భగవంతుడుండి యంత్రం తిప్పుతుంటే చక్రాలు తిరుగుతు న్నట్లు ప్రపంచంలో పనులు వెళ్ళిపోతుంటవి. తన మనస్తత్వం ఆ పనులు చేసే క్షణాన ఎలా ఉన్నదనేదే ప్రశ్న. కత్తిపెట్టి పొట్టలో పొడుస్తాడు. ఇది పుణ్యమా పాపమా? అది వాడి మనస్థితినిబట్టి ఉంటుంది. కడుపులో చచ్చిపోయిన బిడ్డను తీసి తల్లిని బ్రతికించడానికయితే అది పుణ్యమె. ఎదుటివాణ్ణి గాయపరచేందు కయితె పాపమె. మరి కుంతి చేసింది పాపమా పుణ్యమా అంటే అది తెలియడా నికి మానసిక శాస్త్రాలు తిరగవేయాల్సిందె. ఇంతకూ ఆమె అది పుణ్యమో పాపమొ నాకొద్దు. నాకు నా కర్ణుణ్ణి చూడాలనుంది చూపించుమంటుంది. కుంతి మనస్తత్వం పూర్వం జరిగిన పనుల్ని తలచి దుఃఖించటం అనేదాన్ని

దాటిన స్థితి అనిపిస్తుంది. కర్తవ్యం-అంటే ప్రస్తుతం-మాత్రమె స్మరణీయ మన్న సత్త్వగుణ లక్షణం ఆమెకు కలిగింది అనేది గమనీయం.

ఆ మరునాడు వీరందరకూ గంగానదీ తీరంలో, యుద్ధంలో చనిపోయిన బంధువులు అవుపడతారు. వారికి స్పర్ధలు లేవట. ప్రేమాదరణలున్నవట! సత్త్వగుణ లక్షణాలున్నవి! వారువచ్చి భీమసేనునితో పోరాటానికి దిగలేదు. అందరూ సగౌరవంగా ప్రేమించి మెలిగారు. ఒకరోజంతా వారు వీరితో గడుపుతారు. వారు వెళ్ళిపోవటం గంగానదిలోకివెళ్ళి మాయమవడమె. కనుక ఆ భర్తలతో వెళ్ళదలచిన భార్యలంతాకూడ గంగానదిలోకి వెళ్ళవలసిందని వ్యాసుడు అనుమతినిస్తాడు. కొందరలా వెళ్ళిపోతారు గాంధారీ ధృతరాష్ట్రుల అనుమతి కూడతీసికొని.

తిరిగి మిగిలినవారంతా ఆశ్రమానికి వస్తారు. ధర్మరాజాదులనందర్నీ వెళ్ళి రాజ్యం సలక్షణంగా చేసికొనాల్సిందని ధృతరాష్ట్రుడు పంపించివేస్తాడు. వేదవ్యాసుడూ వెళ్ళిపోతాడు.

## 3. ధృతరాష్ట్రాదుల నిర్యాణం

ఇలా కొంతకాలమవుతుంది. మొత్తం ఆశ్రమవాసం మూడేండ్లకాలము. యుద్ధమయింతర్వాత ధృతరాష్ట్రాదులు రాజధానిలో ఉన్నకాలము పదునైదేండ్లు. మొత్తం పద్దెనిమిది సంవత్సరాలు. ఈ పద్దెనిమిదికి అంతరార్థమేదో ఉండి ఉంటుంది అనిపిస్తుంది.

ఒకసారి నారదుడు ధర్మరాజువద్దకు వస్తాడు. ధర్మరాజు ఆయన్ను పూజించి నమస్కరించి విశేషాలడుగుతాడు. తన పెత్తండ్రి గాంధారీ, తల్లి ఎలా ఉంటున్నారో అడుగుతాడు. అప్పుడు నారదుడు వారి నిర్యాణంగూర్చి కథనం చేస్తాడు.

ధృతరాష్ట్రునకు ఆధారంగా సంజయుడూ, గాంధారికి ఆధారంగా కుంతీ ఉండినవారై అంతా తమతమ అగ్నిహోత్రాలను ఒకచోటచేర్చి ఉంచి నదీతీరానికి వెళ్ళారు. అక్కడ ఘోరతపస్సు చేస్తారు. భోజనమే వర్జించి తపసుచేస్తారు కొన్ని రోజులు. చాల బలహీనులైపోతారు. ఒకనాడు వారు స్నానంచేసి

వస్తుంటె చుట్టూ అగ్ని రగిలి వస్తుంటుంది ఆ అడవిలో. ధృతరాష్ట్రుడు సంజయుని పారిపోవలసిందనిచెప్పి, తానూ, గాంధారీ, కుంతీ, యోగంలో కూర్చుంటారు. సంజయుడు మొదట తాను వెళ్ళనన్నా-చావు తప్పించుకోగలిగినబలం ఉన్నవాళ్ళు వెళ్ళి అలా తప్పించుకోకపోవటం పాపం అని ధృతరాష్ట్రుడు చెప్పటంచేత వెళ్ళి హిమగిరి శైలమెక్కుతాడు. ధృతరాష్ట్రుడూ గాంధారీ కుంతీ ఆ అగ్నిహోత్రంలో దగ్ధులవుతారు.

ఈ సంగతిని నారదుడు చెప్పగా విని ధర్మరాజాదులు దుఃఖించి ఒక క్రమానికి శాంతికై ఊరిబయటకు వెళ్ళి, ఆశౌచం పాటించి, పితృకార్యాలు మహాశ్రద్ధతో చేస్తారు.

ఒకొక్కళ్ళె శరీరాన్ని వదలి వెళ్ళిపోతుంటే చూస్తూ ఉంటున్నారు పాండవులు. ఏమిచేయగలరు గనుక. ఏమిటి ఇలా పోవటం? జన్మ-మృత్యువూ-వీటి తేడాయేమిటి అనేది విచారించటం తప్ప ఏమీచేయలేరుగాక. ఆ విచారణచేయటమె విజ్ఞాన విషయం వైపుకు తరలివెళ్ళటం! సత్త్వగుణాన్ని వృద్ధిచేసికొనటం!! ఇలాటి సత్త్వగుణ స్థితిలోనే ఈ ప్రపంచం కేవలం దుఃఖమయం అనిపిస్తుంటుంది. ఈ సత్త్వగుణాన్నికూడ దాటిన క్షణాన ఇక అలా అనిపించదు నిర్గుణంవల్ల ఇక ముక్తె కలిగేది. ఇదీ మోక్షమార్గానికి సూచన.

ఇది ఆశ్రమవాస పర్వం

# మహాభారత కథలు

మౌసల పర్వము- ఏకాఖ్యానము

## ఉన్నదేది?

ధృతరాష్ట్రాదులు ఆశ్రమంతో వుంటూ అగ్నిలో ఆహుతులై నిర్యాణం పొందిన తరువాత మళ్ళీ పద్దెనిమిదేండ్లు ధర్మరాజాదులు రాజ్యం చేస్తూఉంటారు. అప్పటికే ఉత్పాతాలు అవుపించడం ఆరంభిస్తయి. మహావాయువు. శర్కరావర్షమై వీచిందట. సూర్యచంద్రులచుట్టూ వలయాలవుపడ్డవిట. ఇంతలోనే యాదవులంతా కొట్టుకు చస్తున్నారని వార్త వస్తుంది. అదెలా జరిగిందో విచారణ చేస్తాడు ధర్మరాజు.

కణ్వుడు, నారదుడు, విశ్వామిత్రుడు ఒకసారి శ్రీకృష్ణుని చూదామని ద్వారకకు వస్తారట. పెద్దల్నిచూసి నమస్కరించి వెళ్ళటమనే సంస్కృతి భారతదేశంలో అప్పటికె పెడదోవబట్టినట్లుంది. కొందరు యువకులు ఆటకాయతనంతో సాంబుడికి గర్భిణీస్త్రీ వేషంవేసి ఆ ఆకారాన్ని చూపి ఈమెకు ఏపిల్ల పుట్టుతుందో చెప్పవలసిందని ఆ మునులకు వినయం చూపి అడుగుతారు. ఇది ధూర్తవినయం. మునులు ఇది గ్రహించి వెంటనె శపిస్తారు-"ఈ మనిషికి ముసలం ఒకటి పుట్టుతుంది-దానివల్ల యాదవులంతా కొట్టుకు చస్తారుగాక' అని. బలరామకృష్ణుల్లో ఒకరు ఆకాశంలోకి వెళ్ళటంద్వారాను ఇంకొకరు భూమిమీద పండుకొని ఉన్నప్పుడు జర అనే రాక్షసి ప్రోద్బలంతో బోయివేసిన బాణంద్వారాను తనువులు విడుస్తారుగాక" అని శపించి, ఇక శ్రీకృష్ణునిచూచే ప్రయత్నమె వదలివెళ్ళిపోతారు.

యాదవ యువకులు ఈసంగతి శ్రీకృష్ణునకు చెప్తారు. ఆయన-విధాత తలచిన విధంగా జరుగుతుంది-దీనికోసం చింతపడకుండా ఉండటమె కర్తవ్యమని వారిని పంపుతాడు. మరునాడు ఆ సాంబుని కడుపున ముసలం పుట్టుతుంది. ఆ సంగతిని వసుదేవునికి తెలుపుతారు యాదవులు. ఆయన దానిని అరగదీసి పిండిగాచేసి సముద్రంలో కలుపుమంటాడు. దైవం చేసిన ఆజ్ఞను మానవుడు తన తెలివితేటలచేత పోగొట్ట చూడటం మామూలె. కాని చివరకు జరిగేది దైవం తలచిందే అవుతుంది. అలాగే ఆరోకటి కర్రను పిండిచేసి సముద్రంలో కలుపుతారు. ఆపిండికి సముద్రతీరానవున్న తుంగ పుంజుకొని నిలుస్తుంది.

ఇక ద్వారకాపురంలో మహాభయం ఆవరిస్తోంది. యముడు అక్కడ క్కడా ఒక్కొక్కరికి అవుపడుతున్నాడట! చిలుకలు గూబల్లా అరుస్తున్నాయట రాత్రుళ్ళు! మేకలు నక్కల్లా అరుస్తున్నాయట! గొడ్లకు గాడిదలు పుట్టాయట! ముంగిసలకు మూషికాలూ కుక్కలకు పిల్లులూ పుట్టాయట. యాదవులు బ్రాహ్మణుల్ని ఎలాగో ఒకలా బాధపెట్టటం ఆరంభించారు. హోమకాలంలో అగ్నిని చూస్తుంటె క్రూరమృగాల రూపాల్లో శిఖలు అవుపడ్డాయి. పొయిమీద కూర దింపంగానే పురుగులుగానయి అవుపడుతున్నది. ఇవన్నీ గమనించి శ్రీకృష్ణుడు తనను గాంధారి శపిస్తూ 'అప్పటికి ముప్పైఆరేండ్ల తరువాత యాదవులు తములోతాము కొట్టుకు చస్తా' రని చెప్పిన సంగతిని జ్ఞాపకం చేసికొని ఆకాలం దగ్గరపడిందని తెలిసి, ఆనాటి సభలో జాతర చేయడానికిగాను సముద్రతీరానికి అంతా వెళ్లాంగాక అని సర్వులను బయలుదేర తీస్తాడు.

జనం జాతరంటే సంతోషించి సర్వసంభారాలతో బయలుదేరి సముద్ర తీరానికి ఆ రాత్రికి రాత్రి వెళ్ళిపోతారు. ఆ రాత్రి రాక్షసులు ఊరిలోని శస్త్రాస్త్రచయాన్ని అపహరిస్తారు. శ్రీకృష్ణుని చక్రము అంతా చూస్తుండంగా ఆకాశానికి ఎగిరిపోతుంది. గరుడకేతనం పోతుంది. చివరకు రథం గుఱ్ఱాలూకూడ వెళ్ళిపోతయి. బలరాముని నాగలి, తాటిజండాకూడ వెళ్ళిపోతయి. ఎలాపోతయి అంటే చూస్తుండగానే పోతయి చేసేదేంలేక. బలరామ కృష్ణులు ఎవరిబండినో ఎక్కి జాతరకు వెళ్లారు. అక్కడ అదివరకు తపస్సు చేసికొంటూఉన్న ఉద్ధవుడు వీరందరూ వచ్చారని అడవిలో మరీ లోపలకు వెళ్ళిపోతాడు.

అక్కడ విడిసిన జనులు సంతుష్టిగాతిని, మిగిలింది కోతులకు వేశారు. తాపీగా కూర్చొని త్రాగారు. ఆ మత్తులో సాత్యకి కృతవర్మను ఎగతాళి చేస్తాడు-అశ్వత్థామతో కలిసి అర్థరాత్రివేళ చచ్చినట్టు పడివుండిన పాండవపక్ష శూరుల్ని చంపటం ఎంత సిగ్గుమాలినపని! తుచ్ఛుడుకూడ అలాటిపని చేయడన్నాడు. ప్రద్యుమ్నుడు,-"కృతవర్మ అలాచేయటం శోచనీయమైన విషయం-ఎందుకు నీవు చెప్పటం ఆ విషయం వదిలెయ్యమన్నాడు. కృతవర్మకు రోషం వచ్చింది. సాత్యకి, యుద్ధంలో చెయ్యి తెగిపోయిన సోమదత్తుడ్ని వట్టిగావెళ్ళి చంపిన సంగతిని జ్ఞాపకంచేసి అది అంతకంటె తుచ్ఛంకాదా అని అరిచాడు. వెంటనె శ్రీకృష్ణునికి కోపం వచ్చి కోపంతో చూస్తాడు. సత్యభామ కోపంతో

చూసింది. వీరిద్దరికి ప్రియమనుకొని సాత్యకి కృతవర్మ తలనరుకుతాడు. జను లంతా రెండు విభాగాలై ఒకరినొకరు కొట్టుకొంటారు. అస్త్రశస్త్రాలు ఎక్కువ లేకపోయినా ముసలం పిండితో పుంజుకొన్న తుంగ వారిచేతికందటంచేత దాంతో వారు కొట్టుకొని ఉద్రేకాలు పెంచుకొని ప్రాణాలు తీసికొంటారు. చచ్చినవాళ్ళు చావగా మిగిలిన ఇంకా కొందర్ని కృష్ణుడుకూడ చంపేస్తాడు. బలరాముడు అడవిలోకి వెళ్ళాడు. ఆడవాళ్ళు కొందరు ద్వారకకు వెళ్తారు. ఒక్క కృష్ణుడే మిగిలి, తానుకూడ బలరాముడు వెళ్ళినదోవ వెళ్ళిపోవాలని ప్రయాణమైపోతాడు. ఆయనతోపాటు బభ్రువు దారుకుడూ మాత్రం ఉంటారు. దూరంగా బలరాముడు చెట్టు మొదట్లో ఆనావడతాడు. అదిచూసి, శ్రీకృష్ణుడు ఇక జగరవలసినది బలరాముని ... మారిపోవటమేనని గ్రహిస్తాడు. దారుకునితో "వెంటనెవెళ్ళి అర్జునుని పిలుచుకొని రావలసింది" అని పంపు తాడు. బభ్రువునువెళ్ళి ఆడవా ... ... ల్ని పురములోకి చేర్చి ... మంటాడు. కాని కొంతదూరం వెళ్ళిన ... బోయవాడు చంపివేయటం స్వయం గాచూచి శ్రీకృష్ణుడె ఆ పనికి ... మరి వెళ్తాడు.

స్త్రీలనూ ఏనుగులనూ ... కకువచ్చి వసుదేవునికి నమస్క రించి, "కౌరవకులక్షయం ... ండా యాదవకులక్షయంకూడ చూశాను. ఇక ఇక్కడ ఉం... డు. అన్నగారు అప్పుడే అడవికి వెళ్ళాడు. నేనూవెళ్ళి తపం చేసికొంటాను. అర్జునుడు వచ్చేవరకూ ఈ ప్రజ నాన్ని మీరు రక్షించుకొనండి. అతడు రేపు వస్తాడు" అని చెప్పి అందర్ని ఒప్పించి తిరిగి అడవికి వెళ్ళిపోతాడు.

శ్రీకృష్ణుడు తిరిగి రాంగానే బలరాముడు మహాఘ...గా ...తో మణిసహస్రంతో అనం... తో ... . ఆయన ... అవతారం ... బలరాముడుగా ప్రవ... ఆ పాత్రను నటించా... నేపథ్యానికి వెళ్ళిపోయి ...యాడు. శ్రీకృష్ణుడు ... న్నాడు. ఒకచోట నేలమీద ... కొన్నాడు. ఆయన అరికాలు ... ఒక బోయచూశాడు. అది అరికాలు అనుకోలేదు. జర అనే ఒక ... అది ఒక పక్షిలా అవుపడింది వానికి. వెంటనె బాణంవేసి ఒక ... అది శ్రీకృష్ణుని కాలులోనుంచీ మోకాలుదాకా వెళ్తుంది ... చూచి భోరుమని ఏడుస్తాడు తనుచేసిన పొరపాటుకు..

శ్రీకృష్ణునిచుట్టూ ఇప్పుడు దేవతలున్నారు. ఆయన శరీరం లేదుగాక ఆయనకు నమస్కరిస్తున్నారు స్వర్గంలో. ఆయన అమృతమయుడైనాడు బ్రహ్మవచ్చి పాదాభివందనం చేశాడు.

ఈ శరీరం ఉంటేగాని నేను లేననేభయం శ్రీకృష్ణుడికిలేదు. 'శరీరం లేకపోతె మనం ఉన్నవాళ్ళమేకాము' అనుకొనే మనకే-చావు! ఎల్లప్పుడూ ఉండే వాళ్ళమే అని తెలిసినవారు దుస్తులు మార్చినట్లు శరీరాలను మారుస్తారు. వారికి దుఃఖం ఉండదు. శ్రీకృష్ణుడు ఈ కోవకు చెందినవాడు. అందుకె జీవన్ముక్తుడు. దారుకుడు పాండవులవద్దకు వెళ్ళి యాదవులు ఎలా కొట్టుకు చచ్చారో వర్ణించి చెప్పి శ్రీకృష్ణుడు అర్జునుని తీసికొని రమ్మన్నాడని చెప్పి వెంటనే బయలుదేర దీసి ద్వారకకు తీసికొని వస్తాడు.

అర్జునుడు కళావిహీనమైన ద్వారకను చూస్తూ ప్రవేశిస్తాడు. శ్రీకృష్ణుని భార్యలూ ఇతర అంగనలూ వచ్చి భోరున ఏడుస్తారు. వారందర్నీ రక్షించటం శ్రీకృష్ణుడు తనకు వప్పజెప్పినపని. ముందుగా వెళ్ళి దుఃఖాక్రాంతుడైన వసుదేవుని చూస్తాడు ఆయన గోలపెట్టి ఏడుస్తాడు. సాత్యకి, ప్రద్యుమ్నుడు సహా బిడ్డలంతా కొట్టుకు చచ్చిపోయినారని ఆయన వాపోతాడు. "పరీక్షిత్తును రక్షించిన ఆ శ్రీకృష్ణుడు యాదవులు చస్తుంటే ఉపేక్షించి ఊరుకొన్నాడు. ఇదంతా విధివశాన జరిగిందనాలి. ముసలం సాంబుని కడుపులో పుట్టటమే శాపవశాన-దానివల్లనే యీ కులం ఇలా నష్టమైపోయింది. నీవు వస్తావని, చనిపోయినవారికి సంస్కార కర్మలు చేస్తావనీ స్త్రీలను బ్రాహ్మణులను రక్షించి తీసికొనిపోతావనీ శ్రీకృష్ణుడు చెప్పాడు. బలరాముడు అడవికివెళ్ళి తపస్సు చేస్తాడనీ ఆయనతోపాటు తనూ వెళ్తాననీకూడ చెప్పాడు"-అని వసుదేవుడు అర్జునునికి చెప్తాడు.

అర్జునుడు వెంటనే దారుకునిపిల్చి స్త్రీలనూ బ్రాహ్మణులనూ ప్రయాణం చేయించుమనిచెప్పి కబురు పంపుతాడు. ఆ రాత్రి వసుదేవుడు యోగనిష్ఠలో కూర్చొని శరీర త్యాగం చేస్తాడు. అర్జునుడు మరునాడుదయమే ఈ సంగతి నెరిగి ముమ్ముందుగా వసుదేవునికి పరలోకక్రియలు చేస్తాడు. దేవకీ రోహిణి మొదలైనవాళ్ళు వసుదేవునితో సహగమనం చేశారు. అచితిమీద నేయి జల్లుతాడు. తరువాత అర్జునుడు చనిపోయిన వారందరికి పితృమేధము చేస్తాడు. ఇక బలరామ కృష్ణులను వెతుక్కుంటూ వెళ్ళిచూచివచ్చి, ఈ స్త్రీలనూ బ్రాహ్మ

ఋలనూ ద్వారకానగరం నుంచి బయటకు తీసికొనివెళ్ళి రక్షించాలి. ఆపని మిగిలింది. ఆ తరువాత ఈ ద్వారక సముద్రంలో మునిగిపోతుందని శాపమున్నదట. ఈ దుఃఖ ప్రకారంలో తన పాత్రను తాను నిర్వహించటంతప్ప తనకింకేదోవ లేదని అర్జునునకు తెలుసు. వసుదేవుడు సహా పౌరులనందరినీ రక్షించే పనిని తనకు అప్పగించాడు శ్రీకృష్ణుడు. ఇప్పటికే వసుదేవుడు గతించాడు. తాను బలరామకృష్ణుల్ని చూడటానికి వెళ్తున్నాడు. శ్రీకృష్ణునికి వెళ్ళంగానే వసుదేవుడు చనిపోయినాడని చెప్పటం ఎలా! శ్రీకృష్ణుడయితే తపస్సు వదలి తిరిగి ద్వారకకుగాని హస్తినాపురానికిగాని రాడుగాక, ఆయనకు ఈ దుర్వార్త చెప్పటం సమంజసమా? చెప్పకుండటమేమెలా!

ఇలా ఆలోచిస్తూ కొందరు సహచరుల్ని తీసుకొని అడవినపడి వెతుకుతున్నాడు అర్జునుడు. ఎక్కడ వెతకాలి. గాంధారి ఈ శ్రీకృష్ణుని శపించింది- దిక్కులేనిచోట ఒంటరిగా చస్తావని - అయ్యో ఎలాగ ఈయనున్న [illegible] గలిగేది! మహానుభావుడూ సర్వజ్ఞుడూ అయిన ఈ మనిషి [illegible] ఏది నిజం ? ఏదబద్ధం ? నిప్పుకు చెదలంటిందనటం ఎలా? ఇలా ఆలోచిస్తూ అడివిని గాలిస్తుంటే ఒకానొక బోయవాడు ఆయనున్న [illegible] తీసుకొని వెళ్తానని అక్కడకు దోవతీస్తాడు. అక్కడకు వెళ్ళేటప్పటికి - శాపం పరిపూర్తి అయి శ్రీకృష్ణుడు అవతారం చాలించాడు. [illegible] అర్జునుడు తెలిసికొంటాడు. తెలిసిన విషయమె మళ్ళ [illegible] కొంటూనే అలాగె అయిందనేది అర్జునునకు తెలి[illegible] [illegible] దుఃఖం. ఇలాగే అవుతుందని తెలిసికూడ ఆ [illegible] మానవుడు! అర్జునుడు కేవలం ఏడ్చాడు. [illegible] ఎంతసేపటికో తెలివి తెచ్చుకొని బలరామ కృష్ణులకు [illegible] తారు. వారి కళేబరాలుంటే వాటిని ద్వారకకు [illegible] లేదు. ఎందుకనంటె మరునాడే ఉదయానికి [illegible] శాపం తమకు తెలుసు. తెల్లవారకముందే [illegible] బ్రాహ్మణులనూ తీసికొని హస్తినాపురం [illegible] తన కర్తవ్యం. బ్రాహ్మణులంటే [illegible] కృష్ణుల శరీరాలకు ఆ అడవిలోనే అంత్య[illegible]

తిరిగి ద్వారకకు వస్తారు అర్జునుడూ మిగిలినవాళ్ళూను. పౌరులంతా ప్రయాణమై తమతమ అవసర వస్తు సామగ్రితో బండ్లమీద రథాలమీద బయలుదేరుతూ ఉంటారు. వారికి ఈ కృష్ణ బలరాముల నిర్యాణ విషయం చెప్పటం ఏమీ సమంజసం కాదు. వారు బ్రతికె ఉన్నారనుకోవనీ. సుఖంగా బ్రతకాలంటే ఆ మాత్రం అబద్ధం జీవితంలో ఉండాల్సిందె. నిజమయితె తెలిసికొనాల్సినట్టిదె - కానీ దానివల్ల ఏమి కలుగుతుంది? పైగా ఈ మనసు శరీరం తెలివి అనేవాటికి సుఖమనేది ఉండదు. ఈ సుఖాన్ని త్యాగంచేసి తెలియని జ్ఞానాన్ని పొంది సత్య పదార్థాన్ని చూడటం అది ఒక ప్రక్రియ. ఆ ప్రక్రియను భరించగలిగిన స్థితిలోనే మానవుడు దాన్ని అనుసరించి ఉచ్ఛస్థితిని పొందగలడు. గాని దానిని భరించలేని స్థితిలో ఉన్నవారికి ఆ ప్రక్రియ చెప్పినా అది అంటదు. అందుకని ద్వారకావాసులకు ప్రాప్తించిన అబద్ధపు బ్రతుకులో స్వరూపాన్ని ప్రవేశ పెట్టాలనే ప్రయత్నం అర్థంలేనిది అనుకొన్నాడు. శ్రీకృష్ణుని భార్యలకు కూడ ఈ విషాదకరమయిన వార్తను చెప్పలేదు. పిల్లలను స్త్రీలను బ్రాహ్మణులను రథాలను ఏనుగుల్ని కొంత సామగ్రిని తీసికొని బయలుదేతి ఊరుదాటే సమయానికి సూర్యభగవాను డుదయిస్తున్నాడు. ఇలా వెనక్కు తిరిగి చూశారు. ద్వారకా పట్టణం అంతా నీటిమయం అయిపోయింది. ఇదీ నిజం. ఇదీ శాపపర్యవసానం. ఉన్నదున్నదని ఇప్పటివరకూ అనుకున్నదేది? ద్వారకా నగరమా? శాపమా? శాపమేననిపిస్తుంది. అర్జునుడు నిట్టూర్చాడు.

అలా కొంతదూరం ప్రయాణం చేశారు. ఎవరో దోపిడీదార్లు వచ్చి వీరి సామాన్లు దొంగిలించటం ఆరంభించారు. అర్జునుడు వారించాడు. అతడికి అస్త్రాలు ప్రయోగించడానికి మంత్రాలు జ్ఞాపకం రాలేదు. బాణాలు మాత్రం వారిమీదవేశాడు. అయినావాళ్ళు కొంతభాగం సామాను దొంగిలించుకొనే పోయినారు. రుక్మిణి జాంబవతి మొదలైనవారు మాత్రం రక్షింపబడతారు. ధర్మరాజు ఈ గాంధారీ శాపం విషయం వచ్చినప్పుడు తనతో అంటూ ఉండేవాడు. "ద్వారక రాజధానిగా ఉంటున్నంత వరకు చేయవలసిందిలేదు. కాని ఆ తరువాత ఎవరి రాజ్యాలు వారివారి సంతతికి ఇచ్చే ఏర్పాటు చేయాలిమనం" అని. అది జ్ఞాపకమొచ్చి అర్జునుడు, కృతవర్మ కుమారునకు వాని తల్లికీ వారి బంధువులకూ మృత్తికావతపురం ఇచ్చి అక్కడ ఉండిపొండి అంటాడు. ఆ పిల్లవాణ్ణి అక్కడ రాజుగా చేస్తాడు. సాత్యకి కుమారుని సరస్వతి అనే పురంలో

రాజుగా చేస్తాడు. వజ్రుడు అనేవాణ్ణి ఇంద్రప్రస్థ నగరానికి రాజుగా చేస్తాడు. ఉన్న ఏనుగుల్ని రథాల్ని వారి ముగ్గురకూ పంచి ఇస్తాడు.

ఇక స్త్రీలకు శ్రీరామకృష్ణుల నిర్యాణ విషయం ఇప్పుడు చెప్పకపోతె ఎలా? ఇక ఎప్పుడు చెప్పేటట్లు!! సమాచారం చెప్పనంత మాత్రాన దుఃఖాన్ని పూర్తిగా మాన్పటం కలుగుతుందా? అందుకనే రుక్మిణ్యాదులందరనూ పిల్చి అలా అయిందని ఇంతకాలం తాను ఆ సంగతిని చెప్పనందుకు క్షమించాల్సిందనీ దండం పెట్టుతాడు. వారు లబలబలాడి గోల పెట్టుతారు. చివరకు అగ్ని ప్రవేశం చేస్తారు. సత్యభామ పూర్వజన్మలో విశ్వామిత్రుడంటారు. ఆమె తపను చేసికొంటానని వెళ్ళిపోయింది. ఆ కథకు అలా వెళ్ళటం అనుగుణ్యంగా అవుపడుతోంది! అర్జునుడు అక్కడకు దగ్గరలో ఉన్నట్టి వ్యాసాశ్రమానికి వెళ్ళి ఆయన కాళ్ళమీద పడుతాడు.

వ్యాసుడు అతణ్ణి లేపి ఎవరు నువ్వు? అర్జునుడా? అలా అవుపడటల్లేదు. ఎందుచేత? ఇలా అయిపోయినావేం? చంపకూడనివారిని చంపావా? అంటాడు. అర్జునుడు ఘోరుఘోరున ఏడ్చి బలరామకృష్ణులు చనిపోయారనీ తాను ద్వారకీ వానుల్ని పూర్తిగా రక్షింపలేక పోయాననీ కొందర్ని మాత్రం రాజులుగా నిలిపి నాననీ దుఃఖంతో మనను కృశించి నశించిపోతోందని - కర్తవ్యం చెప్పవలసిందనీ ప్రార్థిస్తాడు.

అందుకు పారాశర్యుడు చెప్తాడు - మునుల శాపం ఎలా ఉందో అలా జరిగింది. దానికిప్పుడు ప్రత్యేకంగా దుఃఖించాల్సిందేమిటి గనక! శ్రీకృష్ణుడు ఆ శాపాన్ని జరుగకుండా చేయరాదా అనుకొంటున్నావు. ప్రాప్తకాల మయిందన్నప్పుడు దానికి అడ్డం పడటమెందుకని ఆయన అనుకొన్నాడు. దోవనే పోతుంటాము. కాలిక్రింద చిన్న చిన్న చీమలువడి చస్తూ ఉంటయి. ఒకానొక మనస్థితిలో చూచిచూచి కాలువేస్తూ ఆ చీమల్ని రక్షిస్తాము. కాని అనన్యమైన కర్తవ్యాన్ని చేసేటప్పుడు అలాటి శ్రమ తీసికొనము. అలాగే శ్రీకృష్ణ భగవానుడు ప్రాప్త కాలమని తెలిసి ఆ శాపాన్ని అలాగే జరుగనిచ్చి వెళ్ళిపోయినాడు- అంతేగాని దానిని త్రిప్పడం చేతగాకకాదు. మహాయుద్ధంలో నీ విన్నాళ్ళూ గెల్చావంటే నీకంటె ముందే పరమాత్మ శూలం త్రిప్పి శత్రువుల్ని చంపి వేయడం వల్లనే వారిని నీవు గెలవకలిగావు. ఆయన అలా చింతించనీ క్షపాస-

ఇలా నీ ప్రయత్నాలు భగ్నం కావటం తథ్యమె. ఇది తెలిసె ఆయన చేసిన పనె మనం చేయాలి - కృతకృత్యులం కావాలని అర్థం.

శ్రీ కృష్ణుడు ధరణీభారం తగ్గించేందుకు అవతరించాడు. మాటచెల్లించి వెళ్ళి పోయినాడు, దానికోసం నీలాంటివాళ్లు అజ్ఞానుల్లా ఏడ్వకూడదు.

నీ బలం, నీ బుద్ధి, నీచేవ ఉల్లసిల్లే కాలంలోనే విజృంభించగలవు. కాల విపర్యయం కలిగితె బుధులైనవారుమాత్రం ఉబ్బును పొందగలరా! అంతకీ కాలమె మూలం. ఈ కాలమనేది ఎప్పటికప్పుడు ఏదో మంత్రం చెప్పి పరిస్థితి మార్చే శక్తి అనుకోరాదు. ఒక సంఘటనకూ ఇంకో సంఘటనకూ మధ్యనున్న దాన్ని మనసులో ఊహిస్తె అదె కాలం. దానికి ప్రత్యేకమైన ఉద్యమమేదీలేదు. సంఘటనల సంగతి అనుకొనేటప్పుడు - 'కాలం' అంటాం వాటి మధ్యగల వ్యవధిని కాలమంటే ఈ అవకాశమె ఆకాశం. కాలానికి 'మంచికాలమనీ' 'చెడ్డ కాలమనీ' అనటం ఆ సమయానగల సంఘటనలను బట్టేగాని నిజానికి కాలానికి మంచీ చెడూ అనేదేదీ లేదు. మంచీ చెడూ అనేది మనసునుబట్టి — నడచిన ధర్మాన్నిబట్టి. ధర్మం అనేది లేకపోతె మనసుకైనా మంచీలేదు చెడూ లేదు. ఒక ఆలోచనకూ ఇంకొక ఆలోచనకూ మధ్య గలస్థితె మనసంటాం. కాలానికీ మనసుకూ తేడాలేదీ దృష్ట్యా. మంచి ఆలోచన వస్తె అది మంచి కాలం. అదె మంచి మనసు. చెడ్డ ఆలోచన వస్తె అదె చెడ్డ మనసు. చెడ్డ కాలమూను. దానిని మంచీ చెడూలేని స్థితిలో ఉంచుకో గలిగితె అదె అమనస్కయోగం. అది మహా యోగ విషయం.

కనుక దిగులు పడకు. ఎలా జరగాలో అలా జరిగింది. నువ్వు అనేకం చూచావు. అనేకం-చూడలేదు! చూస్తున్న సంఘటనలెలా జరిగిపోయాయో అలాగే చూడని సంఘటనలు కూడ జరిగిపోతున్నయ్యనేది సమన్వయ పథకం. చిరునవ్వుతో ఇన్నీ తెలిసికొంటూ ఉండటమె కర్తవ్యం ఈ ప్రపంచంలో. వెళ్ళిరా అని దీవించి పంపుతాడు అర్జునుణ్ణి వ్యాసమహర్షి.

—ఇది మౌసల పర్వం—

# మహాభారతకథ.

## మహా ప్రస్థానిక పర్వము

## వైరాగ్యం

ధర్మరాజూ తమ్ములూ భారతయుద్ధం అయిన తర్వాత ముప్ఫయిఆరేండ్లు రాజ్యం చేశారు. సుదీర్ఘమైన జీవితంలో ఎన్నో సుఖాలు ఎన్నో దుఃఖాలు అనుభవించారు. అవి ఒకదానివెంట మరొకటిగా వస్తూనే ఉండేవి అన్నీ వెళ్ళిపోయినయి. రావటం పోవటం ఇదె పాటివని. యుద్ధం రావటం బంధువులంతా చావటం. అభిమన్యుడు చావడం పరీక్షిత్తు చచ్చిపుట్టి మళ్ళీ బ్రతకడం. ధృతరాష్ట్రి గాంధారులు, విదురుడు తల్లికుంతి అంతా తనువులు చాలించి పోవటం ఇదంతా ఒక గాడి. బండి దానిగుండా వెళ్ళటం సమానంగా తప్పదు. ఇన్ని సుఖాలు అనుభవించాం ఇంకా కొన్ని సుఖాలు కలిగితే బాగుణ్ణు అనే మనస్తత్వం హరించిపోయింది. ధర్మరాజాదులకు సుఖం దుఃఖం ఒకేరకంగా ఉంటున్నయి.

తీరా శ్రీకృష్ణభగవానుడే తనువు చాలించి వెళ్ళిపోయినాడు. అర్జునుడు ద్వారకావాసులైన స్త్రీలనే పటిష్ఠంగా రక్షించలేకపోయినాడు. నిజానికి వాళ్ళల్లో కొందరు మేము అలా వెళ్ళిపోతాం అని వెళ్ళిపోయినారుగాని వజ్రుని ఆలనా పాలనాలో ఉండటానికి ఇష్టపడలేదట.

యాదవులందర్నీ రక్షించటానికి వజ్రుని రాజుగా చేశారు. ఈ వార్తలన్నీ విని నిర్లిప్తుడుగా అవుతున్నాడు ధర్మరాజు. ఆయనతో పాటె తమ్ములూ ద్రౌపదీను. వీరి మనస్తత్వం ఈ దశలో ఇంకా కర్తవ్యం కర్తవ్యం- అంటూ చుట్టూ ఉన్నవారి సుఖదుఃఖాల నరయటం నుంచి పై మెట్టుకు పోయింది. కేవలం భగవంతుడెలా నడిపితే అలా నడచుకొంటాముగాక అన్న స్థితికి వచ్చింది. ఇందుకుగాను రాజధాని వదలి వెళ్ళిపోవాలనే ఉద్దేశ్యం కలిగింది ధర్మరాజుకు. తమ్ములతో చెప్పాడు. వాళ్ళూ అలాగే వెళ్ళాల్సిందే నన్నారు. అందరకూ తమకు శరీర త్యాగ సమయం దగ్గరపడిందనిపిస్తున్నట్లుంది. ఇతర బంధువుల్ని తలచలేదు. తమ్ములూ ద్రౌపదితో సహా దేశాటనానికి వెళ్ళి హిమగిరి శిఖరం ఎక్కి అక్కడ స్వర్గంచేరటం మంచిదని ధర్మరాజాదుల ఊహ. వెళ్ళలేకపోతే దుఃఖించాల్సిన పనిలేదనేది వారి మనస్తత్వంగా ఉంది.

ఒకనాడు సుభద్రను పిల్చి ధర్మరాజు రాజ్యమునూ రాజు కాబోయే పరీక్షిత్తునూ వజ్రుణ్ణి ప్రజల్ని గూర్చిచెప్పి వారికి సంరక్షకురాలిగా నీవు వుండాల్సిందని చెప్తాడు. తాము వెళ్ళిపోతామనీ సుభద్ర తమతో బయలుదేరే ప్రమేయం పెట్టుకోవద్దనీ చెప్తాడు. ఆమెకు తెలుసు ఈ ధర్మరాజు తత్త్వం. అయన చెప్పింది అజ్ఞగా శిరసావహిస్తుంది. వారు వెళ్ళటానికి ఇక ఏ అడ్డంకిలేదు.

ధర్మరాజు ఎన్నో దానధర్మాలు చేస్తాడు. ప్రజలను సంతోషపెట్టి వారిని సభకుపిల్చి "ఈ పరీక్షిత్తు మీకికరాజు. అతడ్ని ఆదరించి, ప్రేమతోఉండి రాజ్యం నడిపించాల్సిందని కోరుతాడు. ప్రజలు గుజగుజవోతారు. వద్దనేవారు కొందరు. వారలా వెళ్ళటం ధర్మమనేవారు కొందరు. ఇలా అనుకొంటూనే వారిలోవాళ్ళు పోట్లాడుకొనటం, సహదేవుడూ ధర్మరాజూచూచి చెప్పుకొని, కలియుగం వచ్చేసింది-ఇక మనం ఇక్కడ మనటం సరికాదనుకొంటారు.

కలియుగమంటె ఒక విషయాన్ని గురించి ఎవరితీరుగా వారు ఆలోచించి అదె సరియైనదనుకొనటం. దానికోసం పోట్లాట రాకేంచేస్తుంది. రెండు పక్షాలకూ ప్రధానమై ధర్మమనేది ఉన్నదని వారి మనసుల్లోఉంటే ఆ ధర్మం ఏమిటో తెలిసి అలా ఒప్పుకోనే వారిద్దరున్నూ. ఇప్పుడు తమకు తెలిసినదే ధర్మమనీ సిద్ధాంతమనీ కర్తవ్యమనీ అనుకొంటే-లోకోభిన్న రుచిః' అన్నట్లు విరుద్ధప్రవృత్తులకు పోట్లాటకాక ఏమి కలుగుతుంది. అందుకని కలియుగం వచ్చినట్లుందనుకొన్నారు.

మరునాడు పాండవులూ ద్రౌపదీ కాలినడకకు బయలుదేరుతారావనాలకు. పూర్వం జూదంలో చేసికొన్న, కాంట్రాక్టులో భాగంగా ఇలాగే రాజధానిని వదలి వీరు వెళ్ళటం ప్రజలందరకూ జ్ఞాపకం వచ్చింది. ఎంతోమంది వచ్చి సాగనంపుతారు. పాండవుల్ని అనుసరించి ఒక కుక్కకూడ బయలుదేరి నడుస్తోంది రాజధానినుంచి వనంలోకి.

ఎక్కడికి వెళ్ళటం? మళ్ళీ తిరిగి రావడమనే ఉద్దేశం లేదనిపిస్తుంది. ఎన్నాళ్ళనె మాటలేదు. శరీరాలు వదిలివేసేవరకూనని అనుకున్నారేమొ. ఎందుకిలా? అనేదానికి సమాధానం విధి అనేది తప్ప ఇంకేమీలేదు బహుశ. ఇక్కడ ఉండి శరీరం విడిస్తే శరీరాలకు అగ్ని సంస్కారాలు అంత్యక్రియలు పితృ

మేధలు చక్కగా జరుగుతవి. ఎక్కడకో వెళ్ళాలనుకొనటంలో పరమార్థం ఏమిటి? అది వారి మన స్తత్వం-వారి సంస్కారం-వీటిమీదనె ఆధారపడి ఉన్న దనిపిస్తుంది. చనిపోతే రెండు మార్గాలు కోరుతారు జనం. ఒకటి స్వర్గసుఖాలు రెండోది మోక్షం. స్వర్గం అనేది త్రివిష్టపంలో (టిబెట్) ఉండి సుఖం అనుభవించటం. త్రివిష్టపానికె శరీరంతోసహా వెళ్ళిపోవటానికి ప్రయత్నిస్తున్నారేమొ. వీరు అనిపిస్తుంది.

కాని వారు తూర్పు సముద్రం వరకూ వెళ్తారు ముందు. దేశప్రదక్షిణం చేసి కైలాసపర్వతం లేదా త్రివిష్టపం ఎక్కుదామని వారి ఊహ. సముద్రం దగ్గర అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై అర్జునుడితో "శ్రీకృష్ణునికీ నీకూ చక్రం, గాండీవం ఇచ్చాను. ఆ చక్రం ఎప్పుడో వెళ్ళిపోయింది స్వస్థానానికి. గాండీవాన్ని నీవింకా వదలకున్నావు. దేవకార్యంకోసం అదినీకు వచ్చింది. ఆ కార్యమయిపోయింది కనుక వరుణుడికి తిరిగి దాన్ని ఇచ్చేవెయ్యటం మంచిది. అలా చేయాల్సింది" అంటాడు. అర్జునుడు అందుకు అంగీకరించి తన సోదరులతో చెప్పి గాండీవాన్ని సముద్రంలో వేస్తాడు.

మనుషుల్లో వస్తువుల్లోగల సంగాన్ని ఇలా అంతా వదిలించుకొంటున్నారు. మళ్ళీ ప్రయాణం. దక్షిణానికివెళ్ళి పశ్చిమానికి తిరిగి మళ్ళీ ఉత్తరానికివచ్చి ద్వారకతీరానికి వస్తారు. ఇంకా ప్రయాణంచేసి మేరుగిరి నెక్కుతారు. ఆమీదట దాన్ని ఆరోహించటానికి ఆరంభిస్తారు. ఎందుకిలాచేయట మనిపిస్తుంది మనకు. ప్రజల సంగమం ఇష్టంలేక అయియుండవచ్చు. లేదా బొందెతో స్వర్గం చేరాలనే ప్రయత్నమై యుండచ్చు. వారంతా యోగులు. యోగాభ్యాసం చేస్తూనే వెళ్తుంటారు.

వృద్ధాప్యంలో యోగాభ్యాసం చేయటం సర్వులకూ చెప్పబడినధర్మం. కొంతసేపటికి ద్రౌపది శరీరాన్ని విడుస్తుంది. తరువాత సహదేవుడు, నకులుడు, అర్జునుడు, భీముడు ఒకరి తరువాత ఒకరుగా తమ శరీరాలను ప్రయాణంలో వదలివేస్తుంటారు. ఒకొక్కరు పడిపోయినప్పుడల్లా భీముడు ధర్మరాజుకా విషయంచెప్పి, ఎందుకిలా పడిపోయినారంటూనే ఉంటాడు. ధర్మరాజు వారివారి జీవితాల్లో వారి వారికి కలిగిన మనోవికారాల్లోగల మలినాన్ని చెప్పి-అందువల్లే వీరు స్వర్గద్వారందాకా రాలేకపోయినారనేది సూచిస్తాడు. అలా ద్రౌపతికి అ

నునిపై పక్షపాత పూర్ణమైన ప్రేమఅనీ, సహదేవునకు తాను ప్రాజ్ఞడనే అభిమానమనీ, నకులునకు తాను అందమైనవాడనే అభిమానమనీ అర్జునుడు తాను ఒక్కరోజులో భారతయుద్ధంలో జయిస్తానన్నమాట నిలుపుకోలేకపోయినాడనీ, భీముడు తనబలంవల్ల ఇతర్లను లెక్కచేయక పరుషవాక్యాలు పలికేవాడనీ, చెప్తాడు! ఇక ప్రయాణం చేసేందుకు మిగిలింది తానూ తనతోపాటు ఒక కుక్కాను.

అలా వెళ్తుండగా ఇంద్రుడే మంచి విమానంతోవచ్చి ధర్మరాజును ఆ విమానమెక్కి స్వర్గం రావలసిందని ఆహ్వానిస్తాడు. ధర్మరాజు తనవాళ్ళు క్రింద పడిపోయి ఉన్నవాళ్ళుకూడ వచ్చేపద్ధతి చేస్తేతప్ప విమానమెక్కనంటాడు. అందుకు ఇంద్రుడు "వాళ్ళు శరీరాలను వదిలేసి నీకంటె ముందే పరలోకాన్ని చేరారు." నీవు ఈ విమానంమీద ఎక్కిరావలసింది అంటాడు. ధర్మరాజు తానే గాక తనతో భక్తిపూర్వకంగా వస్తున్న ఆ కుక్కనుకూడ ఎక్కించి స్వర్గంతీసికొని వెళ్ళేట్టయితె వస్తాననీ లేకపోయేటట్లయితె అక్కడ అవసంలో ఉండిపోతాననీ అంటాడు. ఇంద్రుని ఆశ్చర్యానికి కుక్కరూపంలో ఉన్న ధర్మదేవత ఆశ్చర్యానికీ అంతుఉండదు. వారికి వివాదం కలుగుతుంది.

ఇంద్రుడు "ధర్మరాజా, అంతటి అనుజుల్నీ పత్నినీ తేలిగ్గా వదలినవాడవు ఈ కుక్క విషయంలో పట్టుదలచేస్తావేమయ్యా!" అంటాడు. ధర్మరాజు,-"భక్తియుక్తుని విడువకూడదు అది బ్రహ్మహత్యా పాతకమవుతుంది. భీమాదులు చనిపోయినవారు. వారువచ్చి ఈ విమానంతో ఇప్పుడు ప్రయాణం చేయతేరు. ఈ శునకం బయలుదేరినప్పటినుంచీ నాతోపాటుగా వచ్చినప్పుడు-దానిని శరణాగతునిగా చేయకపోవటం ద్రోహమవుతుంది. నీకు నేను నీతి చెప్పగలవాణ్ణికాదు. ఐనా నీస్వర్గం నేను ఒంటరిగా రానంటున్నప్పుడు నన్ను ఈ వనంలోనె ఉండనియ్యరాదూ," అంటాడు.

ధర్మరాజు నిర్లిప్తతను సత్ బుద్ధిని తెలియడానికి ఇంతకంటె ఏంకావాలి. అతడికి స్వర్గంపైకూడ కోరికలేదు. పోనీ నాకు మోక్షం కావాలని గానీ స్వర్గం అక్కర్లేదని గాని అతడనటల్లేదు. 'సర్వాన్ కామాన్ విహాయ' అనే సూత్రం పాటించి కలిగించుకొన్న మనస్థితిఅది. కుక్కనుకూడ ఉంచుకోవాలనటంకూడ దానిపై కోరికవల్లకాదు. అది ధర్మం గనుక-తనుచేసినపని ధర్మమనే గాడిలో వెళ్తుండటమె చూసుకొంటున్నాడు. అది శమంలో భాగం

అనిపిస్తుంది. అప్పుడు ఆ శునకము యమధర్మరాజుగా అవుతుంది. ధర్మరాజును యమధర్మరాజు ఆదరించి ఆశీర్వదించి స్వర్గానికి విమానంమీద వెళ్ళమని పంపుతాడు. నారదుడు వచ్చి ధర్మరాజును మెచ్చుకొంటాడు.ధర్మరాజుమాత్రం స్వర్గ సౌఖ్యాలేవీ తాను ఆస్వాదించకముందు తనవాళ్ళు ఎలాఉన్నారో చూపిస్తే గాని వీల్లేదంటాడు ఇంద్రునితో. ఇది మమకారమా ధర్మమా? మమకారం మాత్రంకాదు. అది ఆయనకు ఎప్పుడో నశించింది. ధర్మమనేది భూమిమీదనే భూమిని దాటింతర్వాత ఆ ధర్మం ఏమిటనేది తెలియదు. కాని అది కేవలం సహృదయత. ఆయన శరీరం ఇంకా ఉండియుండటంచేత ఆ శరీరంతోపాటు ఇన్నాళ్ళూ మనినవాళ్ళ క్షేమం అరసే అలవాటు ఆయనకింకా పోలేదని తెలియాలి అంతె.

ఇది మహాప్రస్థానిక పర్వం



# మహాభారత కథలు

## స్వర్గారోహణ పర్వము

### శాంతస్థితి

స్వర్గం చేరటానికి సిద్ధంగానే పాండవులు ఇళ్ళు బయలుదేరి వచ్చేశారు. దేశదేశాలూ తిరిగి చివరకు పర్వతమెక్కి త్రివిష్టపం చేరాలనే ఆశయంతో వెళ్ళారు. మధ్యలో ప్రాణాలు వదిలినవాళ్ళు పరలోకం చేరనేచేరారు. ధర్మరాజును బొందెతోనే ఇంద్రుడు తన రథంమీద నెక్కించుకొని స్వర్గలోకి తీసికొని వెళ్తుంటాడు.

ధర్మరాజు ఇంకా శరీరాన్ని కలిగే ఉన్న కారణంచేత తన తమ్ముళ్ళీ భార్యనూ మర్చిపోలేదు. ఇంకా దేహాభిమానం పూర్తిగా నశించలేదు. ఇంద్రుణ్ణి ప్రార్థిస్తాడు తనవాళ్ళను చూపవలసిందని. అందుకని ఇంద్రుడు ఎవరినోపిల్చి ఈతడ్ని ఆయన బంధువులున్న చోటుకు తీసికొనివెళ్ళి వాళ్ళను చూపించవలసిందని ఆదేశిస్తాడు అలా తీసిరుని వెళ్తుంటే మధ్యలోనే దుర్యోధనుడు గొప్ప సింహాసనంమీద ఆసీనుడై చంద్రుడూ అంగనలూ చుట్టూ ఉండి సంతోషపెట్టుతుండంగా కన్పడుతాడు. "ఈ మనిషి అతిలోభ పూర్ణమానసుడు. ఇతడివల్ల యుద్ధంలో అనేకులు చనిపోయినారు. ద్రౌపదిని భంగపరచటానికి ప్రయత్నించినవాడితడు. ఇలాటివాని దగ్గరకు నన్ను తీసికొని వచ్చారేమిటి? నావారెక్కడున్నారు? అక్కడకు నన్ను తీసికొని వెళ్ళాల్సింది" అంటాడు ధర్మరాజు.

అందుకు ఆ వెంటనెఉన్న నారదుడు అంటాడు. "యుద్ధంలో తన శరీరాన్నే త్యాగం చేశాడు. ఆ త్యాగానికి ఈ ఉన్నతి తగిందేకదా! యుద్ధంలో శత్రువుల్ను చంపటం పాపంకాదు. పాంచాలికి ఎగ్గుకలిగించాడనేమాట ఇక్కడికి వచ్చింతరువాతకూడ నీవెందుకు తల్చుకొని దుఃఖిస్తావు. మనోవికృతులు కలిగించుకొంటే దుఃఖమేకదా ఫలం! ఎగ్గులు మర్చిపో. అదీకర్తవ్య" మంటాడు.

ఐనా ధర్మరాజు, "అలాటి చెడ్డవ్యక్తి ఇక్కడ ఇంతటి సుఖాలతో తూగుతూ పుణ్యలోకంలో మాననీయుడై ఉండటమనేది నేను చూస్తున్నవింత! సరె నన్ను మాత్రం నావాళ్ళదగ్గరకు పంపండి అంటాడు. ఆయనకింకా ధర్మం

అధర్మం అనేదానిమీది లాలస పోలేదు-తనకు శరీరమున్న కారణంగా దేవ దూత ఆయన్ను తీసికొనిపోతుంటాడు. దుర్గంధం వస్తూ వుంటుంది వెంట్రుకలు, ఎముకలు పాములు దోమలు చీకటి క్రిమికీటకాలు రక్తమాంసాలు మధ్యగా ఆదారిఉంది. కాకికూతలు వినబడుతున్నాయి.

ఒకనది ప్రవహిస్తోంది. అందులో క్రాగి మరిగి తెర్లే నూనె పొంగుతున్నది. దాని ఒడ్డును చెట్లున్నాయి వాటికి కత్తులే ఆకులై ఉన్నాయి. ఆ నది వైతరణి. ధర్మరాజుకు చాల బాధగా వుంది. తనవారివద్దకు తాను వెళ్ళేదోవ ఇలాటిదా!" అదీ దేవతల అధీనంలోనే ఉందా? ఇంకా ఎంతదూరం వెళ్ళాలి" అంటాడు. దేవదూత అదీ దేవతల అధీనంలోనిదేననీ తాము రావలసినచోటుకే వచ్చామనీ అంటాడు. "ఆ! ఇదా ఆ చోటు!!"

అక్కడ తనవాళ్ళైతే కంటికీ అపుపడలేదు. కాని ఎవరో తను అక్కడకు వచ్చినందువల్ల తమకు మంచిగాలి వంటిది తగిలి ఉల్లాసకరంగా బాధోపశమ నంగా ఉందనీ వెళ్ళిపోక ఇంకా కొంతసేపు ఉండాల్సిందనీ అన్నట్లు తెలుస్తు న్నది. అలా అంటున్నది "ఎవర"ని తాను ప్రశ్నిస్తాడు. అందుకు వాళ్ళు తాము కర్ణుడని, ద్రౌపది అని, భీముడని, ఇలా సమాధానం చెపుతారు. వాళ్ళకు శరీ రాలు లేవు. పేర్లు పెట్టింది శరీరాలకే. ఆ పేర్లను ఇంకావాళ్ళు తమవే అను కొని సమాధానం చెప్తుంటారు, దేహాలు పోయినా దేహాభిమానం నిల్చి ఉన్న దనిపిస్తుంది. ఎక్కడుంది ఈ దేహాభిమానం? స్థూల శరీరం పోనేపోయింది, సూక్ష్మ శరీరానికి అతికి ఇంకా అభిమానం నిల్చి ఉన్నదని అర్థం. తాము ఆ నరకంలో ఉన్నమాట నిజమే. తాము అంటే తమ సూక్ష్మ శరీరాలు, సూక్ష్మ శరీరం అంటే మనసు బుద్ధి అహంకారం అజ్ఞానం అనే వీటిని చుట్టబెట్టుకొన్న ఆత్మ అనాలి. ఈ మనసు బుద్ధులు ఇంకా తాను అంటే ఆ స్థూల శరీరమేనా అనీ, ఈ కనబడే నూనె క్రాగుడు స్పర్శ ఆ స్థూల శరీరానికే ఇంకా తగిలి కాలు తున్నట్లుగా మహా బాధపడిపోతున్నారు వాళ్ళు. నిజానికి ఆ క్రాగిన నూనె తమ సూక్ష్మ శరీరాలను తాకనే లేదనిపిస్తుంది. వాళ్ళ సూక్ష్మ శరీరాలు మాత్రం తాకినట్లు భ్రమించి గోలపెట్టున్నాయి. ధర్మరాజు ప్రశాంత మనస్కుడు కావటం చేత ఆయనమీద గాలులు ఎంతో మంచిగా వాళ్ళు అనుభూతి చేస్తున్నారు.

ఇదంతా ధర్మరాజు సశరీరుడై చూస్తూ వింటూ దుఃఖంలో మునుగు తున్నాడంటె అది ఆశ్చర్యమేమీకాదు.

వెంటనే ఆయనకు ఇంద్రుడు సరియైన పరిపాలన చేయటంలేదనిపిస్తుంది, ఆయన్ని ఇక తాను చూడనక్కర్లేదనుకొంటాడు, "నేను రాను. ఇక్కడే ఉంటాను మీరు వెళ్ళి ఇంద్రునికి అలా చెప్పండి" అంటాడు.

దేవదూతలు వెళ్ళి ఇంద్రుడితో ఈ సంగతి చెప్పినప్పుడు ఆయన హుటాహుటి ఇక్కడకు వచ్చేస్తాడు, ఆయనతోపాటు యమధర్మరాజు కూడ వస్తాడు, వారంతా రావట మేమిటి, ఆ వైతరణి, ఆ వెంట్రుకలు అస్థికలు దుర్గంధం అంతా నశించిపోవడమేమిటి రెండూ ఒక్కసారె జరిగినయి. ఇంతకు ముందు కన్నదినవన్నీ నిజమా అబద్ధమా? అవి తను అనుభూతి చేసినట్టివి-అబద్ధమనటం ఎలా? నిజమయితె ఇప్పుడవేవి? వాటికి భిన్నమైనవి ఉన్నాయే! ఇలా ఆశ్చర్య పడుతుంటాడు.

ఇంద్రుడు, ధర్మదేవత - ఇద్దరూ చెప్తారప్పుడు, ఇదంతా వట్టిమాయ, నీకు పాపుల అనుభూతి కలిగించడానికి ఇలా చేశాం మేము. 'రాజ్యాంతే నరకం ధ్రువం' అనే సూత్రం ప్రకారం నీవు నరకమంటే ఏమిటో చూడాల్సిన అవసరం ఉండటంచేత ఈ మాయ చేసి నీకు నరకమనేదాని అంశను చూపాము. నీ వాళ్ళంతా నిజానికి ఈ దేవలోకంలోనే సుఖాలు అనుభవిస్తున్నారు. కర్ణుడు ఉత్తమ స్థితినంది వెలిగిపోతున్నాడు - మాతోవచ్చి - వారందర్నీ చూడాల్సింది అంటారు, ధర్మరాజు అందుకు అంగీకరించంగానే ఆకాశగంగలో స్నానం చేయాల్సింది ముందు అంటారు. యమధర్మరాజు ధర్మరాజు సౌశీల్యాన్ని ఎంతో మెచ్చుకొంటాడు. నిన్ను మూడుసార్లు పరీక్షించాను. యక్షుడుగా బ్రాహ్మణుని అరణిని లేడి ఎత్తుకు పోయినపుడు మంచినీటికోసం సరస్సులో నీరు త్రాగనీయకుండా అడ్డుపడి ప్రశ్నలడిగి నీ ప్రవర్తనను తెలిసికొన్నాను. శునక రూపంలో నీ వెంట స్వర్గద్వారం వరకూ వచ్చి నీ ప్రవృత్తిని పరీక్షించాను. మళ్ళీ ఇక్కడ దయ ప్రేమ ఆదరణ ఈ పాపులపట్ల నీవు చూపటం చూశాను. నీవు ఇక స్వర్గం రావలసింది అంటాడు-

ధర్మరాజు ఆకాశగంగలో స్నానం చేస్తాడు. ఆ సమయాన అతడి స్థూల శరీరం అతడ్ని వదలుతుంది. ఆయన సూక్ష్మ శరీరానికి దేవత్వం కలుగుతుంది, తాను ఇంకా ధర్మరాజేను అనుకొంటున్నాడా లేదా అనేది ఆలోచించాల్సిన సంగతి. దేవతలు ఆయనకు ఆయన తమ్ములున్న స్థలం చూపుతారు. నరుడు

నారాయణునితో కలిసి అవుపడుతాడు. కర్ణుడు పదమూడవ ఆదిత్యుడుగా వెలుగుతుండటం చూస్తాడు. భీమసేనుడు మరుద్గణాల్లో చేరుతాడని తెలిసికొంటాడు. నకుల సహదేవులు అశ్వనీదేవతలుగా అవుపడతారు. ద్రౌపది మహాలక్ష్మిగా అవుపడుతుంది. ద్రౌపదేయులు, పాండురాజు కుంతి మాద్రి అంతా అక్కడ దేవతలుగా ఉంటున్నారు. అది చూస్తాడు ధర్మరాజు. అభిమన్యుడే చంద్రుడుగా ఉంటాడు. భీష్ముడు వసువుల్లో ఉంటాడు ద్రోణుడె బ్రహస్పతి. ఇంకా మిగిలిన వారందర్నీ కూడ అక్కడ ఇతర దేవతలుగా చూస్తాడు.

వీళ్ళంతా ఇలాగే ఉంటారా లేక మారిపోతారా? నిన్నటివరకూ తన శిష్యుడుగా ఉన్న పిల్లవాడివాళ గొప్ప పదవిలో ఉంటున్నట్లె వీళ్ళూ ఉన్నారా? వాళ్ళకి తమ పూర్వకాలపు పరిచయాలు జ్ఞాపకంలో ఉండి అలాగే ప్రవర్తిస్తారా ఎల్లప్పుడూ అనే మాట-అర్థంలేని మాట! ఎప్పటి ప్రవర్తన అప్పటిదె. అలా అని అవజ్ఞ చేస్తారనికాదు, చేయాలనీ కాదు. ఏది ధర్మమో లేదా ఏది తన స్వభావమో అలా ప్రవర్తించటం తప్పనిసరె. చిన్నప్పుడు తనని కన్నారుగనుక అప్పుడే వాళ్ళు తలిదండ్రులై ఆ తరువాత కారా? కాని ఈ మార్పు కలగటమనేది ఆలోచించి తెలిసికోవలసిన విషయం. జనమేజయుడు పై సందేహాన్ని అడుగనే అడుగుతాడు. వైశంపాయనుడు చెప్తాడు. ఎల్లకాలం అలా ఎందుకుంటారక్కడ? ధృతరాష్ట్రుడు కుబేరునిలో కలుస్తాడు - ధర్మరాజు యమ ధర్మరాజుతో కలుస్తాడు. అంతా అధినేత శరీరంలోని భాగాలు. అలా ఉంటూ ఉంటారు. మారుతూ ఉంటారు. అదే తెలియాల్సింది.

ఇది భారతకథ. నాయనలారా మీరీ కథవిని వెళ్ళి నిద్రపోవటమూ చేయచ్చు, దానిని తలచి తలచి విషయ విమర్శనమూ చేయచ్చు. ధర్మశాస్త్రాన్ని ఎరుగనూ వచ్చు. ఎవరి సంస్కారాన్నిబట్టి వారు చేస్తారనేది తెలియటం అతి ముఖ్యమైన విషయం. ఈలాటి పరిస్థితులు మనకూ మన జీవితాల్లో ఎప్పుడో కలగటం కద్దు. అప్పుడు, ధర్మరాజు ఎలా ప్రవర్తించాడు అనీ ఆయన ఇప్పుడీ పరిస్థితుల్లో ఏం చేసేవాడు అనీ తెలిసి అలా చేయటం తెలివైన పని లేదా ఈ పరిస్థితుల్లో శ్రీకృష్ణుడయితే ఏమి సలహానిచ్చి ఉండేవాడు అనీ ఆలోచించవచ్చు. క్లిష్ట పరిస్థితుల్లో ఇలా చేయడం మంచిదా అలా చేయడం మంచిదా అనే సమస్యకు సమాధానం పంచమవేదమయిన మహాభారతంలో దొరుకుతుంది. అది ధర్మ సూక్ష్మన్ని కొంతా సమ్మతంగా చెప్పుంది. సంస్కారం కలిగినవై

ఎంతోమేలును ఆ ధర్మం కలుగజేస్తుంది. ధర్మపరుడైన ధర్మరాజు, శ్రీకృష్ణ భగవానుల ప్రభావం మనపై కలిగితే ఆలాంటిమేలు కరతలామలకం అవుతుంది.

అలాగాక దుర్యోధనుడు సైంధవుడు, కీచకుడు మొదలయిన వాళ్ళేంచేసి ఉండేవారో అది అనుసరిస్తానేవారికి సరియైన ఫలితం కలుగదనేది గమనీయం మనః ప్రవృత్తి నెలా ఉంచుకోనాలనే దానికి ఈ భారత కథలు గీటురాయి. దీనినెరిగి ఆ విధంగా పాటించడం భారతీయ సంస్కృతి!!

వినండి, తెలియడం అయిందనుకొంటె ఇక ఆచరణే మిగిలింది! ముందు తెలియాలి! ఆ తరువాతె ఆచరణ!! తెలీకుండా చేసే ఆచరణ శిష్టుల ఆచరణ వంటిదె అయితె చింతలేదు. దురదృష్టవశాత్తు దుష్టుల ఆచరణ ననుసరిస్తే కీడే మిగుల్తుంది.

నాయనలారా ! కథ కంచికెళ్ళింది. నేను పడక చేర్తాను మీరూ వెళ్ళి పడుకోండి. చక్కని కలలు కనండి. అన్నాడు బాబాయి.

రుధిరోద్గారినామ సంవత్సర మాఘ బ॥ తదియ ఆదివారం (19-2-1984)న ఈ వ్రాయడం పూర్తి అయింది.

ఓం తత్సత్

